
SARASWATA NIKETANAM * VETAPALEM. *

# ఆంధ్రప్రదేశ్

జన్మదిన సంచిక

1963, నవంబరు.

# ఆంధ్రప్రదేశ్

## జన్మదిన సంచిక

సంపుటి: 8 సంచిక: 1



బిద్రీ కళాఖండాలు - (చూ. 72వ పేజీ. వివిధ పరిశ్రమలు-బహుముఖాభివృద్ధి)

సంపుటి : 8

సంచిక : 1

# ఆంధ్రప్రదేశ్

కార్తీకం - మార్గశిరం

1885 శకం

నవంబరు : 1963

"ఆంధ్ర ప్రదేశ్" పాఠకులకు, రచయితలకు
జన్మదిన సందర్భంగా
మా శుభాకాంక్షలు. —— ఎడిటర్.

## విషయసూచిక



సంవత్సరంచందా — రు. 3—00.

విడి ప్రతి రు. 0—25 నయాపైసలు.

ముఖచిత్రం : "ఆంధ్రప్రదేశ్" దివ్యదీపాష్టకం.

రెండవ అట్ట : నిజామాబాద్ జిల్లా సాద్‌మత్ గ్రామంలోని మదురా జాతికి చెందిన స్త్రీలు. (చూ. 60 పేజీ)

# ముఖ్యమంత్రి లేఖ

ప్రియమైన చదువరీ !

ఈ నెల మొదటి తేదీతో మన రాష్ట్రానికీ అలాగే ఈ పత్రికకూ ఏడు సంవత్సరాలు పూర్తై యెనిమిదవ సంవత్సరం ప్రవేశించింది. ఇటువంటి 'జన్మదిన' సందర్భంలో పర్యాలోకనం చేయడం ఎవరి కైనా సహజం. 'గతాన్ని' సింహావలోకనం చేసి ఏమేమి సాధించిందీ తెలుసుకోవడం, 'భవిష్యత్తు'లోకి దృష్టిని సారించి ఏమేమి సాధించవలసివున్నదీ తేల్చుకోవడం పారిపాటి.

గత ఏడు సంవత్సరాలలో, దేశంలోనూ, ప్రపంచంలోనూ సంభవించిన సంఘటనల మూలంగా ఆర్థిక రంగంలోనూ, ఇతర రంగాలలోనూ అనేక మార్పులు వచ్చాయి. ఏదైనా కొత్త అవసరం – మన త్యాగశక్తిని ప్రదర్శించడానికి వచ్చిన పిలుపు కానీ లేక ప్రజల జీవన పరిస్థితులల్లో మార్పు తేగల నూతన విప్లవాత్మక పథకాలను అమలుపరచడం కానీ – కలిగినప్పుడల్లా మనం ఇతరుల కంటే వెనుకబడకుండా వుండడానికి ప్రయత్నించడమే కాకుండా కొన్ని గమనార్హమైన సందర్భాలలో ఇతరులకు మార్గదర్శకులం కావడానికి కూడా శాయశక్తులా కృషి చేశాము. రెండవ ప్రణాళిక, మూడవ ప్రణాళిక అచరణలో కూడా మనం ఉత్తమ ప్రమాణాలు సాధించాం. నాలుగవ ప్రణాళికకు ప్రాతిపదికను రూపొందించే సమయం ఆసన్నమైంది. ఈ ప్రణాళిక పరిమాణం, మనకుగల సాధన సంపత్తులు, శక్తిస్తోమతులను గురించి మనం తీవ్రంగా యోచించడం సహజం. మూడవ ప్రణాళిక కంటే ఇది భారీగా వుంటుందనడంలో సందేహం లేదు. ఇదివరకే సూచించబడినట్లు ఈ ప్రణాళిక వ్యయం రూ 450 కోట్లుగానీ లేక అంతకుమించిగానీ వుండవచ్చు. అయితే ఈ సంఖ్య ఎంత అయినప్పటికీ ప్రధానంగా కావలసింది అకుంఠితమైన ప్రజోత్సాహం. దేశశక్తిని పటిష్ఠం చేయడానికి వారు శక్తివంచన లేకుండా తోడ్పడాలి. ప్రకృతి సిద్ధంగా, చారిత్రకంగా ఈ రాష్ట్రానికి సంక్రమించిన పాత్రను అది పరిపూర్ణంగా నిర్వహించగలగడంలో చేయూత నివ్వాలి. మన ప్రజానీకం – వ్యవసాయ దార్లు, వర్తకులు, పారిశ్రామిక వేత్తలు, ఉద్యోగులు, విద్యార్థులు మొదలైన వారంతా – ప్రధానమైన ఈ బాధ్యతను దృష్టిలో పెట్టుకొని వచ్చే సంవత్సరమంతా తమ ముందున్న కార్యభారాన్ని ఏకాగ్రచిత్తంతో నిర్వహించగలరనీ, మన ఉత్పత్తి కృషికి అవరోధం కలిగించగల స్వల్పమైన విభేదాలను విస్మరించగలరని విశ్వసిస్తున్నాను.

అనేక అంతర్రాష్ట్రీయ సమస్యలు పరస్పర సంప్రదింపుల వల్ల, ముఖాముఖి చర్చలవల్ల సులభంగా పరిష్కార మవుతాయి. ఎక్కువ సందర్భాలలో ఈ విధమైన పరిష్కారాన్ని మనం సాధించగలిగాం కూడా. ఉదాహరణకు ఎగువ సీలేరుపై చాలా కాలంగా సాగుతున్న వివాదాన్ని ఈ పద్ధతిలో సత్వరంగా పరిష్కరించుకోవడం జరిగింది. సమస్యలంటూ లేకపోయినప్పటికీ, వ్యక్తులమధ్యవలె రాష్ట్రాల మధ్య కూడా సంప్రదింపులు, చర్చలు తరచుగా జరగడం అవసరం. ఉభయులకూ ప్రయోజనం చేకూరడానికీ, వివిధ విషయాలలో ఒండొరుల మధ్య నిర్మాణాత్మక సహకారానికీ ఇవి అవసరం. ఉమ్మడి పథకంగా నిర్వహించబడుతూ వున్న తుంగభద్ర ప్రాజెక్టు విషయంలో ప్రయోజనకారి అయిన ఇట్టి సహకారం వల్ల మొదటి నుంచే సత్ఫలితాలు కలుగ నారంభించాయి. దేశంలోని భారీ ప్రాజెక్టులలో ఇదొకటి. ప్రాజెక్టు నిర్మాణం తొలిదశల నుంచే ఇది ప్రజలకు ప్రయోజనం చేకూరుస్తున్నది. క్షామ పీడిత ప్రాంతాలలో సేద్యపు నీటి పారుదల విషయంలోనే కాకుండా విద్యుచ్ఛక్తి సరఫరా, పారిశ్రామికీకరణలలో కూడా అభివృద్ధి జరుగుతున్నది. తుంగభద్ర వర్క్‌షాపులకు సంబంధించి ఇప్పుడు కొన్ని విస్తరణ ప్రతిపాదనలు వున్నాయి. ఈ వర్క్‌షాపు దేశంలోనే అద్వితీయమైనది. అనేక ప్రాజెక్టులకు అవసరమైన సాధన సామగ్రిని ఇది సరఫరా చేస్తుంది. విస్తరణ కార్యక్రమానికి అధిక మొత్తం అవసరం. ఇది ఆంధ్రప్రదేశ్, మైసూరు రాష్ట్రాల ఉమ్మడి ప్రాజెక్టు కావడంవల్ల ఈ వ్యయాన్ని ఏ పద్ధతిలో పంపిణీ చేసుకోవాలో చర్చించి పరిష్కరించుకోవలసివుంది. తుంగభద్ర, రాజోలిబండ ప్రాజెక్టుల ఆయకట్టు క్రిందవున్న కొన్ని గ్రామాలను మార్పిడిచేసే ప్రతిపాదనలుకూడా వున్నాయి. ఇవి ప్రధాన సమస్యలు కాకపోయినప్పటికీ, ప్రాజెక్టు పని, పురోగతి స్తంభించకుండా వుండడానికి వీటిని శీఘ్రంగా పరిష్కరించవలసి వుంది. అందువల్లనే ఈ అంశాలపై మైసూరు నాయకులతో నేను ముఖాముఖి చర్చలు జరపడానికి ప్రతిపాదించాను.

తుంగభద్ర బోర్డు రద్దు చేయబడుతుందంటూ పత్రికలలో వెలువడిన కొన్ని వార్తలు వాస్తవం కాదని ఈ సందర్భంలో నేను స్పష్టం చేస్తున్నాను. ఎగువ సీలేరు విషయంలో జరుగుతున్నట్లుగా తుంగభద్ర బోర్డు విషయంలో కూడా ఆంధ్రప్రదేశ్, మైసూరు రాష్ట్రాల ముఖ్యమంత్రులు ఒకరి తరువాత ఒకరు బోర్డు అధ్యక్షుడుగా వ్యవహరించడానికి సంబంధించిన ప్రతిపాదన మాత్రమే యిప్పటి వరకూ చర్చించబడింది.

పారిశ్రామికీకరణలో మైసూరు మనకంటే చాలాముందంజ వేసింది. తుంగభద్ర ప్రాజెక్టు ఇతోధిక పారిశ్రామికాభివృద్ధికి దోహదం చేసింది. ఈ విధంగా ప్రయోజనం పొందాలనీ ముఖ్యంగా

బోర్డు ఆధీనంలోగల రెండు విద్యుత్కేంద్రాలలో యంత్రాలను వినియోగంలోకి తెచ్చిన పిమ్మట ఇటువంటి లాభం పొందాలనీ మనంకూడా ఆశిస్తున్నాము. ఇంతేకాక మునీరాబాదు విద్యుత్కేంద్రం నుంచి కూడా మనం విదుచ్ఛక్తి వాటా పొందుతాము. ఈ విషయంలో మద్రాసుకూడా మనకంటే మెరుగ్గావుంది.

ఆంధ్ర ప్రదేశ్‌ను సాధారణంగా పారిశ్రామికంగా వెనుకబడిన రాష్ట్రం అంటారు. అయితే రాష్ట్రంలో సాధన సంపత్తుల కొరత ఈ వెనుకబడిన తనానికి కారణం కాదు. ఈ సాధనసంపత్తులను సరిగా వినియోగంలోకి తేకపోవడమే దీనికి హేతువు. అన్ని విధాలైన ముడిపదార్థాలు ఇక్కడ సమృద్ధిగా లభిస్తాయి. విద్యుచ్ఛక్తి అభివృద్ధికి ఇప్పుడు మనం ప్రాధాన్యత నిచ్చాం. ఇది మన పరిస్థితిని పూర్తిగా మార్చివేయాలి. ఉజ్వల భవిష్యత్తుగల రాష్ట్రం మనది. మన అవసరంయొక్క ఈ అంశం ఇప్పుడు మన మనుస్సులలో ప్రధానంగా మెదులుతూవుంది. మన ఈ అవసరాన్ని చాలాకాలం క్రితమే గుర్తించిన కేంద్ర ప్రభుత్వం, మున్ముందు క్రొత్త పరిశ్రమలను నెలకొల్పే విషయంలో ఈ అంశంపట్ల తగు శ్రద్ధవహిస్తూ వుండగలదని నమ్ముతున్నాను. "మిగ్" యంత్రాగారపు మూడవ యూనిటు హైద్రాబాదులో స్థాపించబడనున్నట్లు ఇటీవలే మనకు హామీ లభించింది. నాలుగవ ప్రణాళికలో విశాఖపట్నంలో ఉక్కు కర్మాగారం నెలకొల్పబడే సూచనలున్నాయి. దక్షిణ దేశానికి ధాన్యాగారమైన మన రాష్ట్రం త్వరలోనే దక్షిణ ప్రాంతపు పారిశ్రామిక మండలంగా కూడా రూపొందగలదని నేను విశ్వసిస్తున్నాను.

పారిశ్రామిక ప్రగతికీ, ఆర్థికాభివృద్ధికీ కృషి చేస్తున్నామంటే మన సాంస్కృతిక, శాస్త్రీయ, విద్యా కార్య కలాపాలను నిర్లక్ష్యం చేస్తున్నామని అర్థంకాదు. సుసంపన్నమైన, పరిపూర్ణమైన ప్రజా జీవితమే ఎల్లప్పుడూ మన లక్ష్యంగా వుండాలి. అయినప్పటికీ – మనమున్నట్టి పరిస్థితుల్లో – మానవకృషికి సంబంధించిన ఈ శాఖలను ప్రోత్సహించడానికి ప్రభుత్వం తాను ఆశించినంతగా ఖర్చు చేయలేకపోయింది. సైన్సు అకాడమీని స్థాపించి, దానికి 50 వేల రూపాయిలు ఇవ్వడానికి ఇటీవల నిశ్చయించాము. అయితే అది చిహ్నప్రాయమైనది మాత్రమే. ఈ విషయాలలోసహాయంచేయాలని ప్రభుత్వం యెంతగా ఆకాంక్షించి నప్పటికీ కళలు, శాస్త్రవిషయాల తక్షణ భవిష్యత్తు ఇప్పుడు ప్రైవేటు వ్యక్తులు, సంస్థలకృషి, చొరవ, త్యాగంపైననే చాలావరకు ఆధారపడి వున్నట్లు కనిపిస్తుంది. ప్రజానీకానికి ఆరోగ్య, వైద్య సౌకర్యాలు కల్పించే విషయంలో కూడా ప్రభుత్వం ఈ సదుపాయా లన్నింటినీ పూర్తిగా తీర్చే పరిస్థితిలో ఇంకాలేదు. వ్యవస్థీకృతమైన ప్రైవేటు వ్యక్తులు, సంస్థల తోడ్పాటు, సహకారం చాలా వరకు అవసరం. ఈ విషయంలో ఇటీవల సికింద్రాబాదు బట్టల వర్తకుల సంఘంవారు ఆదర్శప్రాయమైన కృషిజరిపారు. వారు తమ గుమస్తాలకు వారి కుటుంబాలకు ఉచితంగా వైద్య సౌకర్యాలు కలిగించే నిమిత్తం ఒక చికిత్సశాలను ప్రారంభించారు. వివిధ పట్టణాలలోని యజమానులంతా వ్యక్తిగతంగా ఇలాంటి సౌకర్యాలు కలిగించలేకపోయినప్పటికీ ఇతర వృత్తులకు సంబంధించిన ఇలాంటి సంస్థలు ఉమ్మడిగా ఈ విధమైన కృషి జరపవచ్చు.

మన రాష్ట్ర రాజధానిలో మిర్ ఆలమ్ చెరువువద్ద ఇటీవల జూలాజికల్ పార్కును ప్రారంభించారు. ఇది మన రాజధానికి చేకూరిన ఒక వినూతనమైన ఆకర్షణ. ఇది భారత దేశంలోని జంతుప్రదర్శన శాలలో కెల్లా పెద్దదిగా రూపొందుతుంది. ఇది సుమారు 302 ఎకరాల విస్తీర్ణంలో ఆవరించివుంది. వివిధ జిల్లాల నుంచి తీసుకొనివచ్చిన జంతువులను, పబ్లిక్ గార్డెన్‌లోని పాత జంతుప్రదర్శనశాలనుంచి తెచ్చిన జంతువులను ఇక్కడ వుంచారు. నాలుగు సంవత్సరాల క్రితమే ఈ పథకం మంజూరైంది. ఈ పార్కు వన్యమృగాలు, జంతువులపై పరిశీలనజరపడంలో శాస్త్రీయమైన సంస్థగా అభివృద్ధి జెందగలదనీ రాష్ట్రం నలుమూలలనుంచి వచ్చే, సాధారణ ప్రజలకు విహార కేంద్రంగా పెంపొంద గలదనీ ఆశిస్తున్నాను.

గత పదకొండునెలలుగా నేనీ ఈ లేఖలు వ్రాస్తున్నాను. ఇవి ప్రజలకు నెలవారీ నివేదికల రూపంలో వున్నాయి. వీటిని చదివి, వాగ్దానాలు ఎంతవరకూ నెరవేర్చ బడిందీ చూచుకున్నట్లయితే, ప్రతిలేఖా అంతక్రితపు లేఖకంటే ఆశాజనకంగావున్నట్లు గ్రహించగలుగుతారు. ఈ నాడు మన చరిత్రలో ఒకమైలురాయి వద్ద ఆగిన ఈ తరుణంలో సహజంగా మన కార్యనిర్వహణా సామర్థ్యంపట్ల విశ్వాసాన్ని పెంపొందించుకోవడానికి మాత్రమే గతంలోకి చూస్తాము. పిమ్మట భవిష్యత్తులోకి దృష్టిని సారించి ద్విగుణీకృతోత్సాహంతో ముందుకు సాగిపోతాము.

జై హింద్ !

భవదీయుడు,

నీలం సంజీవరెడ్డి.

# పుట్టిన రోజు

— జంధ్యాల లక్ష్మీనారాయణ శాస్త్రి

నా పుట్టినరోజు నాడు
నా జన్మదినమ్ము నేడు !
నా పుట్టినరోజు నాడు
నాకు పేరు పెట్టినాడు
పెద్దల సన్నిధిలో మా
పెద్దనాన్న పండితుడు !
నా పేరాంధ్రప్రదేశ్ !
అమ్మ పేరు ఆంధ్రమాత !

ఈ నా పుట్టిన రోజున
అఖిలాంధ్రము పొంగిపోయె !
కన్నతల్లి కనుగొల్కుల
కనుపించె ప్రమోదాశ్రులు !
నా పుట్టినరోజు నాడు —
భాగ్యనగర వీథులలో
బంగారపు రథం మీద
నా జనని మహోత్సవమ్ము
నయన మోహనముగ సాగె !
నా పుట్టినరోజు నాడు —
వెలుగొందెను నలు దిక్కుల
విజయోత్సవ దీపమాల !
వినుపించెను నలు మూలల
విశ్రుతాంధ్ర వీరగీతి !
నా పుట్టినరోజు నాడు
నా జన్మదినమ్ము నేడు !

నే పుట్టినరోజు నాడు -
రాజరాజ మౌళిమకుట
రత్న కాంతి పదసరోజ
విద్యానగరేంద్ర విజయ
విస్ఫారిత నయన కమల
కాకతీయ రాజ్య రమా
కల్యాణ ప్రభా తిలక
రెడ్డిరాజ శౌర్య విభా
శ్రీరంజిత ఫాల ఫలక
తెలుగుతల్లి దీవించెను
తలుగుతల్లి లాలించెను
నే పుట్టినరోజు నాడు
నా జన్మదినమ్ము నేడు !

నా పుట్టినరోజు నాడు -
హంపీ విఠలాలయమున
నల్ల రాతి రథం కదలె !
ఓరుగంటి బంటునందు
లొక్కుమ్మడి రంకెవైచె !
లేపాక్షిని బసవేశుడు
లేచి మూపు విదలించెను !
అమరావతి శిల్పలక్ష్మి
ఆలపించె శాంతిగీతి !
నా పుట్టినరోజు నాడు
నా జన్మదినమ్ము నేడు !

నా పుట్టినరోజు నాడు
నా నాయక మణులు వెలిగె !
ఆంధ్రరత్న మకుటంలో
అలరె రమ్య రోచిస్సులు !
దేశ భక్తి హృదయంలో
తేజరిల్లె జయదీప్తులు !
విశ్వదాత చేతులలో
వెలిగె వేయి దీపతతులు !
నా పుట్టినరోజు నాడు -
'మిరపకాయటపా' వీర
వరుల గుండె లుప్పొంగెను !
ఆంధ్ర సింహ కంఠంలో
ఆనందం గర్జించెను !
పొట్టి బాబు కన్నులలో
మోద బాష్పములు నిండెను !
నా పుట్టినరోజు నాడు
నా జన్మదినమ్ము నేడు !

నా పుట్టినరోజు నాడు
నన్నయాదు లరుదెంచిరి !
కావ్యకళా సుమములతో
కన్నతల్లి నర్చించిరి !
నన్నయకవి నందివర్ధ
నములు తెచ్చి అర్పించెను !
కవిబ్రహ్మ క్రమకళా
కమలాలు సమర్పించెను !
శంభుదాసు సౌగంధిక
సమర్చనము గావించెను !
నన్నె చోడకవి చక్కని
సన్నజాజు లందించెను !
శ్రీనాథుడు గులాబీలు
సిద్ధపరచుకొని తెచ్చెను !
పోతన మధు మందారపు
పూలమాల కొనివచ్చెను !
అల్లసాని కొల్లలుగా
మల్లెపూలు అందించెను !
తిమ్మనకవి పారిజాత
దివ్య పుష్పములు తెచ్చెను !
ప్రభురాయలు బంగారపు
బంతిపూలు పంపించెను !
పింగళికవి చెంగలువలు
పేర్చి కూర్చుకొని వచ్చెను !
భట్టుమూర్తి సంపెంగలు
బుట్టలతో పట్టితెచ్చె !
రామకృష్ణు డొక్క జపా
ప్రసవమాలతో వచ్చెను !
మొల్ల మంచి తులసీదళ
ముల మాలిక కూర్చి తెచ్చె !
కందుకూరి కవిచంద్రుడు
కాశీ రత్నములు తెచ్చె !
కూచిమంచి అందమైన
కుందమాల కొనివచ్చెను !

చేమకూర చేమంతుల
చెండు కట్టుకొని వచ్చెను !
నా పుట్టినరోజు నాడు
నన్నయాదు లరుదెంచిరి !
కావ్యకళా సుమములతో
కన్నతల్లి నలరించిరి !

నా పుట్టినరోజు నాడు -
గుండెలలో పసిడి పంట
నిండుకొన్న నా అక్కలు
నాతోడై నా నీడై
నీ వానంద మందినారు !
ఒక్కొక్కటె ఉత్సాహం
ఉప్పొంగిన పాలవెల్లి !

ఒక్కొక్కటె ఉల్లాసం
ఒరసిన నదీమతల్లి !

నా పుట్టినరోజు నాడు -
తుంగభద్ర పొంగిపోయె
కృష్ణవేణి శ్రుతి గల్పెను
గోదావరి గీతి పాడె
నాగావళి నాట్యమాడె
కిన్నెర గానమ్ము చేసె
వంశధార వంత పాడె
మంజీర ధ్వనియించెను
పినాకిని ప్రియము వల్కె
చంపావతి సరసమాడె
శబరి కేలుదోయి మోడ్చె
అక్కలతో కలసిమెలసి
ఆడుకొంటి పాడుకొంటి !

నా పుట్టినరోజు నాడు !
నా జన్మదినమ్ము నేడు !
నా పే రాంధ్రప్రదేశ్ !
అమ్మ పేరు ఆంధ్రమాత !

నాకు నాడు విజయదశమి -
బహుకాలం పరులనీడ
బ్రతికి విసుగుపడిన నరుడు
సత్యాగ్రహ వీరాగ్రణి
జయశంఖం బొత్తినాడు !
నవ్య విజయదశమి నాడు
నాకు నేడు విజయదశమి !

నాకు నాడు దీపావళి !
నా ఇంటికి శోభావళి !
అలసత్వం వ్యామోహం
అపమార్గం వైషమ్యం
నరకాసురులై నశింప
అరుదెంచిన శోభావళి !
నా ఇంటికి దీపావళి !
నాకు నేడు దీపావళి !

నానా జాతికి శుభక్రాంతి
నాకు నేడు సంక్రాంతి !
పండిన నా తెలుగుపంట
బండ్ల మీద ఇలు చేరెను
పూచిన నా తెలుగు పూలు
పూజార్థము దోసిట బడె !
నాకు నేడు సంక్రాంతి
నా జాతికి శుభక్రాంతి !

నా సీమకు నా డుగాది
నా భూమికి వత్సరాది
కష్ట సుఖ రుచి ప్రసాద
కలితమ్మగు నవ యుగాది
నా సీమకు నే డుగాది
నా భూమికి వత్సరాది !
నా పుట్టినరోజు నాడు !
నా జన్మదినమ్ము నేడు !

విద్యారణ్య మహర్షుల
విజ్ఞాన పయస్సు గ్రోలి
నాగార్జున గురుబోధల
నవనీత మ్మారగించి
వేమనార్య నీతి గీతి
కా మాధుర్యము గ్రహించి
త్యాగరాయ గానసుధా
ధారాంచిత లహరి మునిగి
అప్పాజీ మంత్రాంగ మ
హా ఫలమ్ము స్వీకరించి
సంజీవ కళా మయమై
రంజిలు మా మందిరమ్ము
మాతృదేవి సేవార్థము
మహోసంగముగ చేరితి
నా పుట్టినరోజు నాడు !
నా జన్మదినమ్ము నేడు !

నా పుట్టినరోజు నేడు -
మూడుకోట్ల పారిజాత
ముల మాలిక గొని వచ్చితి
కన్నతల్లి కంఠంలో
కై సేసితి కేల్మోడ్చితి !
తల్లి శుభాశిషమాలిక
తల దాల్చితి ధన్యనైతి !
కన్నతల్లి ముందునిల్చి
కావించితి నవ నాట్యము !
"నా ప్రకృతియె రమణీయము
నా సాహితి రసవంతము !
నా నాట్యం మహనీయము
నా గానం మనోహరము !
నా శిల్పం కమనీయము
నా చిత్రం సుమనోజ్ఞము !
నా పే రాంధ్రప్రదేశ్ !
అమ్మ పేరు ఆంధ్రమాత !"
నా పుట్టినరోజు నేడు !
నా జన్మదినమ్ము నేడు !
నా పే రాంధ్రప్రదేశ్ !

# ఐక్యరాజ్య సమితి పటిష్ఠీకరణావశ్యకత

డాక్టర్ ఎస్. రాధాకృష్ణన్



ఐక్యరాజ్య సమితి కార్యకలాపాలు, ప్రయోజనం ఏయేటికాయేడు సుస్పష్టమవుతున్నాయి. ఇటీవలి కాలంలో సూయజ్, పశ్చిమ ఇరియన్, కాంగో సమస్యల పరిష్కారంలో సమితి ప్రయోజనాత్మకమైన పాత్ర నిర్వహించింది. అయితే ప్రచ్ఛన్న యుద్ధం వల్ల కలిగిన ఒత్తిడుల వల్లా, ఆవేశాల వల్లా దీని కృషికి కొంత వరకు అవరోధం కలిగింది. అయినప్పటికీ ప్రపంచ శాంతిసాధనకూ, అంతర్జాతీయ సభ్యతకూ ఇది ఒక్కటే ఆశాజ్యోతి.

## ప్రపంచ శాంతి

ప్రపంచశాంతికి, సంక్షేమానికి ప్రస్తుత మున్నన్ని మహత్తర అవకాశాలు మానవ చరిత్రలో ఎన్నెన్నడూ లేవు. శాస్త్ర విజ్ఞానం అభివృద్ధి చెందడం వల్ల నవప్రపంచ నిర్మాణానికి మార్గం ఏర్పడింది. ఇప్పుడు మనం సువర్ణశకాన్ని సృష్టించగల శాంతి, భద్రతల సభ్య జీవనమార్గాలను సాధించ గలిగాం. ఈ లక్ష్యసాధనకు కావలసిన వస్తు సంపద, జనశక్తి ఈనాడు మనకు వున్నాయి. పోతే మానవ నాగరికత సంపూర్ణ వినాశనానికికూడా అంతే అవకాశం వుంది. అణుయుద్ధమే గనుక సంభవిస్తే విజేతలూ, పరాజితులూ అంటూ ఎవ్వరూ మిగలరు. అంతా ఒకేవిధంగా నశించిపోతారు. ఇటువంటి పరిస్థితులలో యుద్ధం పట్టి ఉన్మాదం మాత్రమే. పాత పద్ధతి ఆయుధాలతో చేసే యుద్ధంకూడా అణు యుద్ధంగా పరిణమించే అవకాశం వుంది. కాబట్టి మనం అణుయుద్ధాలతో పాటుగా అన్ని యుద్ధాలనూ వ్యతిరేకించాలి. న్యాయబద్ధమైన యుద్ధమనేది ఏదీ లేదు. మనం యుద్ధాలను నివారించదలిస్తే శాంతిసాధనకు కృషి జరపాలి. యుద్ధానికి వ్యతిరేకమైనట్టి రక్షణ మార్గం 'శాంతి' ఒక్కటే. అణ్వస్త్రపరీక్షల సంపూర్ణ నిషేధాన్ని త్వరలోనే అన్ని దేశాలూ ఆమోదించగలవనీ, సాధారణ సంపూర్ణ నిరాయుధీకరణకు అది మార్గం సుగమం చేయగలదనీ నా దృఢ విశ్వాసం.

వలస రాజ్యాధిపత్యంనుంచి విమోచనం, జాతి విచక్షణా నిర్మూలన, వెనుకబడివున్న దేశాల ఆర్థికాభివృద్ధి—ఇవి సుస్థిరమైన ప్రపంచ భద్రత, శాంతి సాధనకు అత్యావశ్యకమైనవి.

పరాధీన దేశాలు శాంతియుత సాధనలద్వారా స్వాతంత్ర్యం పొందడానికి వీలు కలిగించే ఒక యంత్రాంగాన్ని ఐక్యరాజ్య సమితి నెలకొల్పాలి. ఈ విషయంలో ఇది చక్కగా కృషి చేస్తున్నది. దౌర్జన్యాలను, దోపిడీ విధానాలను, ఒక దేశంపై మరోదేశం ఆధిపత్యం చెలాయించడాన్ని నిరోధించడంలో సమితి వలసజాతులకు సహాయం చేస్తున్నది. అయితే ఆఫ్రికాలో చాలా ప్రాంతాలు ఇంకా వలస పాలనక్రింద వున్నాయి.

## జాతి విచక్షణ

దాదాపు అన్ని ప్రపంచ దేశాలలోనూ జాతి విచక్షణ అనేది వుంది. కాని అనేక దేశాలు అందుకు సిగ్గుచెందుతూ వుంటే కొన్ని దేశాలు ఈ విచక్షణను ఘనంగా

ఎంచి పాటిస్తున్నాయి. దక్షిణాఫ్రికాలో మనుషుల వర్ణాన్ని, జాతినిబట్టి వేరువేరు శాసనాలు అమల్లో వున్నాయి. జాతి విచక్షణ ఇంకా కొనసాగుతున్నందుకు ఇతర దేశాలు ప్రశ్చాత్తాపం తెలుపుకొనే ధోరణిలో వుండి దానిని తొలగించడానికి ప్రయత్నిస్తూవుండగా దక్షిణాఫ్రికా మాత్రం దౌర్జన్య వైఖరి చూపుతూ వుంది. ఇది కనబరుస్తున్న జాతి విచక్షణా విధానం దేశంలోనూ, విదేశాలలోనూ వ్యతిరేకతకు గురైంది. అణచివేయబడిన ఆఫ్రికన్లు నిస్పృహకు లోనవుతున్నారు. నిస్పృహ చెందిన వ్యక్తులు నిస్పృహతో కూడిన తరుణోపాయాలనే అవలంబిస్తారు. వ్యతిరేకతను, విప్లవాన్ని నివారించాలంటే దక్షిణాఫ్రికా ప్రభుత్వం తన విధానాన్ని పునఃపరిశీలన చేసుకోవాలి.

దక్షిణ వియత్నాంలో కాథలిక్కులకు, బౌద్ధులకు మధ్య ఘర్షణలు జరుగుతున్నాయి. ఇవి ప్రస్తుత కాలంలో జరుగవలసినవి కావు. దక్షిణ వియత్నాంలో అత్యధిక సంఖ్యాకులైన ప్రజలను బాధించడం ప్రాథమిక మానవ హక్కులను ఉల్లంఘించడమే అవుతుంది. ఇవి త్వరలోనే సమసిపోగలవని ఆశిస్తున్నాను.

## జీవన పరిస్థితుల అభివృద్ధి

అనేక ప్రాంతాలలో ప్రజలను పీడిస్తున్న దారిద్ర్యం, క్షుద్బాధ, వ్యాధులను నివారించే బాధ్యత ప్రపంచంపై వుంది. ఆకలి, దారిద్ర్యంతో బాధపడుతున్న దేశాలు వున్నంతవరకూ తిరుగుబాట్లకు, ఘర్షణలకు ఆస్కారం వుంటుంది. అందుచేత, ప్రపంచంలో అనేక ప్రాంతాలలో ప్రజల స్థితిగతులను అభివృద్ధిపరిచే కృషిలో నిమగ్నమైవున్న ఐక్యరాజ్య సమితి, దాని ప్రత్యేక సంస్థలను పటిష్ఠం చేయడానికి మనం పాటుపడాలి. పరితప్తమైన ప్రపంచాన్ని సుఖసంతోషాలతో విలసిల్లజేయాలి.

ఆధునిక సమాజం అభివృద్ధిలో ప్రాథమిక చారిత్రక ధోరణి కనిపిస్తుంది. ఇతర ప్రజలను గురించి తెలుసుకోవాలనీ, వారితో స్నేహంగా కలిసిమెలిసి వుండాలనే అభిలాష సాధారణంగా వుంటుంది. కమ్యూనికేషన్ సౌకర్యాలు పెంపొందడంతో ప్రపంచ ప్రజల మధ్య పరస్పర అవగాహన పెంపొందింది. రెండు ప్రధాన అణ్వస్త్ర రాజ్యాలైన రష్యా, అమెరికాల మధ్య సాన్నిహిత్యం ఏర్పడింది. అవి అంతరిక్ష పరిశోధనలో, చంద్రమండల యాత్రలో సహకరించు కుంటున్నాయి. ప్రపంచాన్ని ప్రమాద పరిస్థితినుండి కాపాడడానికి మాస్కో, వాషింగ్టన్ల మధ్య వార్తా సంబంధాలు నెలకొల్పబడినాయి. పరస్పర వ్యతిరేకమైనవిగా భావించబడుతున్న రోమన్ కాథలిక్ చర్చి, కమ్యూనిజంల మధ్య కూడా అవగాహన ఏర్పడింది. ఇవన్నీ కూడా శాంతియుతంగా, మైత్రిగా జీవించాలన్న ప్రజల మనోవాంఛకు సూచకాలు.

చైనా, సోవియట్ దేశాల మధ్య వచ్చిన విభేదాలు దీనికి వ్యతిరేకంగా వున్నాయి. చైనాకు అణ్వాయుధాలను సరఫరాచేయడానికి రష్యా నిరాకరించడంతో ఈ విభేదాలు ప్రారంభమయ్యాయనేది సుస్పష్టం. చైనా దురాక్రమణ విస్తరణ తత్వాన్ని అవలంబిస్తున్నప్పటికీ మొత్తంమీద అది ఇతరదేశాలతోపాటు శాంతికీ, స్నేహానికీ అంకితమైంది. అయితే ఇప్పుడు ఆ దేశం ప్రపంచశాంతి, సఖ్యత ఆశయాలనుండి వైదొలగింది. ప్రస్తుత చైనా ధోరణి తాత్కాలికమైనదిగా వుంటుందని మనం హృదయపూర్వకంగా ఆశిస్తున్నాము.

ఈనాడు మనిషి ఎదుర్కొంటున్న గొప్ప సవాలు మనిషే. "అంతా నిర్మలంగావుంచి. నేను మాత్రమే కలతచెంది వున్నాను" అన్నాడు చైనా వేదాంతి లావోట్జూ. మన విజ్ఞానం ప్రవర్ధిల్లుతున్నకొద్దీ దానికి తగ్గట్లుగా మన ప్రవర్తన పరిణతి నొందాలి. ఇందుకు కేవలం మానవ స్వభావాన్ని ఆకళింపుచేసుకుంటేనే సరిపోదు. నైతిక అవగాహనా శక్తి పెంపొందడం అవసరం.

## సమితిని పటిష్ఠం చేయవలసిన అవసరం

మానవాళి కేవలం ఒక వ్యవస్థ కాదు. అది మానవుని స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ప్రతిష్ఠలనుంచి విడదీయలేని ఆధ్యాత్మిక విలువలతో అంతర్గతంగా సంఘటితమైవున్న ఒక సజీవ వ్యవస్థ.

ఏకోదేవః సర్వభూతేసుగూఢా
సర్వవ్యాపీ సర్వభూతాంతరత్మా.

భగవంతుడు ఒక్కడే. అతను సర్వాంతర్యామి. సకల చరాచరంలోనూ వ్యాపించి వున్నాడు. మనం పరస్పరం దౌర్జన్యానికి పూనుకుంటే అగోచరమైన ఈబంధాన్ని తెంచివేసినవారమవుతాము. నూతన ప్రపంచాన్ని రూపొందించుకోడానికి దైవం మనకు ధైర్యం, వివేకం, ప్రేమ, విశ్వాసాలను ప్రసాదించుగాక.

ఐక్యరాజ్య సమితిని పటిష్ఠం చేయడానికి, ప్రపంచ వ్యవహారాలలో అధికారంగల సంస్థగా దీనిని రూపొందించడానికి మనం శాయశక్తులా కృషిచేయాలి.

ఐక్యరాజ్య సమితిని మనం శాసనాధికారాలు కలదిగా, కార్యనిర్వహణాధికారాలు కలదిగా, పోలీసువిధులను నిర్వహించేదిగా రూపొందించుకోవాలి. భావితరాలవారిని యుద్ధ ప్రమాదంనుంచి కాపాడడానికి ఇదొక్కటే శరణ్యం. ఎప్పుడో ఫలించే స్వప్నంగా ఈ వాంఛితాన్ని పరిగణించరాదు. ఇది అత్యావశ్యకం. ఈ లక్ష్యసిద్ధికి మనందరం కృషి చేద్దాం.

(ఐక్యరాజ్య సమితి దినోత్సవ సందర్భంగా ఆకాశవాణి ఢిల్లీ కేంద్రంనుంచి 1963 అక్టోబరు 23 వ తేదీన ప్రసారమైన రేడియో ప్రసంగం.)

# విశేషాలు-వ్యాఖ్యలు

పి.వి. నరసింహారావు

## సమయోచితమైన హెచ్చరిక

అమెరికా సెనేటు, ప్రజా ప్రతినిధుల సభ కొన్ని వర్గాల ఆలోచనా సరళిలో ఇటీవల గమనార్హమైన మార్పు కనిపిస్తున్నది. విదేశాలకు వాగ్దానం చేసిన సహాయంలో కోత పెట్టాలన్న కోరిక క్రమంగా ప్రబలమవుతున్నట్లు కానవస్తున్నది. ప్రెసిడెంట్ కెన్నెడీ సూచించిన విధానాలకు విరుద్ధంగా ఉభయ సభలకు చెందిన కొందరు సభ్యులు వెనుకబడిన దేశాల అభివృద్ధితో తమకేమీ ప్రమేయం లేదనీ, ఎవరితోనూ సంబంధం లేకుండా తామే ఐశ్వర్యంతో తులదూగే పాత పద్ధతిని అవలంబించడమే మంచిదనుకునే ధోరణిలో వ్యవహరిస్తున్నట్లు కనిపిస్తున్నది.

ఈ వైఖరికిగల కారణాలేమిటో ఇప్పుడే ఇతమిత్థంగా చెప్పడం తొందరపాటు చర్యే అవుతుంది. ఒకందుకు, ఆంతరంగిక రాజకీయాలను-కనీసం పాక్షికంగానైనా - దీనికి కారణంగా పేర్కొనవచ్చు. కాని ఈ కారణంకంటే, ప్రచ్ఛన్న యుద్ధ ఉద్రిక్తతలు సడలడమే దీనికి ప్రధాన హేతువు అయినట్టు భావించడానికి ఎక్కువ ఆస్కారం వుంది. సంపన్న రాజ్యాల విదేశ సహాయక కార్యక్రమం ప్రాక్ - పశ్చిమ కూటాల వ్యామోహంతో పూర్తిగా ముడిపడకుండా లేదనీ, వెనుకబడిన దేశాలను తమ కూటమిలో చేర్చుకునే ప్రయత్నాలు పోటీలు పడి సాగుతున్నాయనే విషయం రహస్యమేమీ కాదు. 'నిర్నిబంధంగా సహాయం' చేయాలనే భావం వ్యాప్తిలోకివచ్చి, కూటాలను ఏర్పరుచుకునే విధానం లాభసాటిదిగా కన్పించక పోవడంతో, అలీన దేశాలు తగినన్ని బలపడడంతో దూరదృష్టిలేని కొందరు రాజకీయ వాదులు, ఎత్తుగడలు సాగేరోజులు గతించాయి కనుక సహాయం నిష్కారణంగా అందజేయడం భావ్యం కాదనే ధోరణిలో ఆలోచించడం ప్రారంభించారు. గత కొంత కాలంగా ఈ విధమైన ఆలోచనా సరళి ప్రబలుతున్నట్లు కనిపిస్తున్నది. ఈ శతాబ్దపు నాలుగవ దశాబ్దంలో అమెరికాలో ప్రెసిడెంట్ రూజ్వెల్ట్ అనుసరించిన సాహసోపేతమైన గొప్పవిధానాల తరువాత స్వల్పకాలిక ప్రయోజనంతో, స్వార్థదృష్టితో ఆలోచించే ధోరిణి బలపడుతున్నట్లు కనిపిస్తున్నది.

ఈ వైఖరిని మార్చివేయడానికి తరుణం ఇదే. ప్రపంచ సౌభాగ్యంకూడా ప్రపంచ శాంతి వలెనే అవిభాజ్యమైనది. నిజానికి ఇవి రెండూ ఒక దానిపై ఒకటి ఆధారపడి వున్నవి. అన్ని దేశాలలో కనీసం సహించదగిన జీవన పరిస్థితులైనా నిశ్చయంగా లేనిదే ప్రపంచశాంతి వుంటుందనుకోవడం దుర్లభమే. పెద్దరాజ్యాలమధ్య ఉద్రిక్తత సడలడం మంచిదే. కాని ఈ కారణంవల్లనే ప్రపంచశాంతి నిశ్చయంగా సిద్ధిస్తుందనే హామీలేదు. అణ్వస్త్రాల సంపూర్ణ నిషేధం వల్లకూడా ప్రపంచంలో సుఖ సంతోషాలు, శాంతి ఏర్పడవు. అయితే ఇందువల్ల పూర్తి వినాశనం నుంచి ప్రపంచానికి రక్షణ వుంటుందనడంలో సందేహం లేదు. అన్ని వర్గాల ప్రజలమధ్య సాధన సంపత్తులు సంతృప్తికరంగా, సమంజసంగా పంపిణీ అయ్యే పర్యంతం ప్రపంచంలో సుఖశాంతులు, సంతోషం అనేవి వుండవు. ఇటీవల స్వాతంత్ర్యం పొందిన వెనుకబడిన దేశాలను దారిద్ర్యం పీడిస్తున్నది. దీని నిర్మూలనకు కొద్దిపాటి సహాయం ఏ మాత్రం చాలదు. అంతర్జాతీయ ఉద్రిక్తతలు సడలడం, మానవాళిలో చాలా ఎక్కువ భాగం దుర్భర దారిద్ర్యంతో క్రుగ్గడానికి మాత్రమే హేతువైనట్లయితే ఈ పరిస్థితి ఎంతమాత్రం నిలకడగా వుండదు. శాంతి, దారిద్ర్యం వెన్వెంట సాగిపోవడం శుభప్రదం కాదు. కాగా దీనికి సంభావ్యమైన, సుసాధ్యమైన ప్రత్యామ్నాయ మార్గం ఒక్కటే. అదే శాంతినీ, సమృద్ధతనూ ఏక కాలంలో సాధించడం. "బొకారో" విషయంలో అవలంబించినటువంటి వైఖరివల్ల అంతిమంగా బలపడేది పీడితదేశాల ఉద్ధరకులమంటూ విర్రవీగే చైనావంటి సాహసిక శక్తులేననే విషయాన్ని సంపన్న రాజ్యాలు గమనించడం మంచిది. ఇది సాధారణంగా గమనించ బడుతున్న దానికంటే చాలా వాస్తవికమైన ప్రమాదం.

సామ్రాజ్యాలను నిర్మించుకునే కాలం గతించింది. విదేశ మార్కెట్లద్వారా అపరిమితంగా లాభాలు ఆర్జించే పద్ధతీ అంతమొందే కాలంకూడా శీఘ్రంగా ఆసన్నమవుతున్నది. సరిసమాన ప్రాతిపదికపై, ప్రపంచంలోని సాధన సంపత్తులను సహకార

భావంతో ఉమ్మడిగా అనుభవించేట్టి నూతన యుగాన్ని మనం ప్రారంభించాలి. సంపన్న దేశాలు ప్రపంచశాంతి సాధనకు తాము చేస్తున్న యత్నంలో, తిరిగి మొదటికి తీసుకొని రాగల విధానాలను, వైఖరులను అనుసరించడానికి బదులు ఈ సత్యాన్ని గుర్తించడం ఉత్తమం.

## అలీన దేశాల రెండవ సమావేశం

ఘనా అధ్యక్షుడు ఎన్‌క్రుమా సూచించినట్లు ఒకవేళ కొలంబో రాజ్యాలు కొత్తగా సమావేశం జరిపినట్లయితే దానికి భారత దేశం హాజరయ్యే ప్రసక్తి లేకపోగా సింహళం ప్రధానమంత్రిణీ, సంయుక్త అరబ్ రిపబ్లిక్ అధ్యక్షుల మధ్య కైరోలో చర్చలు జరిగిన పిమ్మట వెలువడిన సంయుక్త ప్రకటనలో ప్రతిపాదించ బడినట్లు అలీన రాజ్యాల రెండవ సభ జరపాలనే సూచనను భారతదేశం ఆమోదిస్తుందని ప్రకటించబడింది.

ఇటువంటి తొలి సమావేశం 1961వ సంవత్సరంలో బెల్గ్రేడ్‌లో జరిగింది. ఆ సభకు సన్నాహాలుజరిపిన దేశాలలో ఇండియా ఒకటి.

యుగోస్లావియా కూడా ఈ ప్రతిపాదన పట్ల హర్షం ప్రకటించింది.

ప్రెసిడెంట్ నాసర్, శ్రీమతి బండారనాయకేలు తమ సంయుక్త ప్రకటనలో, అలీన విధానాన్ని అనుసరించడం ద్వారా దేశాలమధ్య మంచి అవగాహనను ఏర్పర్చవచ్చని దృఢవిశ్వాసం ప్రకటించారు.

అంతకుపూర్వం సింహళం ప్రధాన మంత్రిణీ గౌరవార్థం జరిగిన విందులో ప్రసంగిస్తూ ప్రెసిడెంట్ నాసర్, భారత-చైనా సరిహద్దు వివాదాన్ని శాంతియుతంగా పరిష్కరించడంలో కొలంబో రాజ్యాల బాధ్యతను వీడవని స్పష్టీకరించారు.

## చౌ కపట నాటకం

గత నెలలో చైనా ప్రధాని శ్రీ చౌ-ఎన్-లై పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో మాట్లాడుతూ భారత ప్రధాన మంత్రితో చర్చలు జరిపే నిమిత్తం తాను ఢిల్లీకి రాగోరుతున్నట్లు తెలిపారు. చైనా-ఇండియా సరిహద్దు ఉద్రిక్తత సడలిందంటూ, చైనా సైన్యాలను సమీకరించడం లేదని నిరాకరిస్తూ భారత సైనికులు చైనా భూభాగాల లోకి చొచ్చుకుని వెళ్ళి దురాక్రమణ జరిపారని ఆరోపించారు. చైనా తన పొరుగు వారితో కుదుర్చుకున్న అనేక ఒప్పందాలు, సరిహద్దు ఒడంబడికలు మొదలైనవాటి విషయమై ప్రస్తావించి శ్రీ చౌ ఇలా అన్నారు: "వీటన్నింటి విషయంలోనూ శాంతియుత సహజీవనానికి సంబంధించిన పంచ సూత్రాలకు కట్టుబడి వున్నట్లు మేము ప్రకటించాము. ఇలాంటి ప్రకటనలు చేశాము గనుక వీటికి మేము బద్ధులమై వుంటాము." ఆయన ఇంకా ఇలా అన్నారు: "భారత దేశం సరిహద్దు వివాదాన్ని రేపి, శాంతియుత సహజీవనానికి సంబంధించిన పంచసూత్రాలను మంటగలపడం విచారకరం." అమెరికా ఇండియాకు చేసిన సైనిక సహాయాన్ని దృష్టిలో పెట్టుకొనే బహుశా శ్రీ చౌ, ఆగ్నేయాసియాలో దానికార్యకలాపాలను ఖండించి వుంటారు.

చైనా ప్రధాని ఢిల్లీ సందర్శించదలచడాన్ని, భారత విదేశాంగ మంత్రిత్వశాఖ ఒక ప్రకటనలో "కేవలం ఒక ప్రచారపుటెత్తుగా" పేర్కొన్నది. ఆ ప్రకటనలో ఇంకా ఇలా వుంది: "ఈ ప్రతిపాదనచేయడానికి గల కారణం, భారతదేశంపై చైనా భారీఎత్తున జరిపిన దురాక్రమణ ఫలితాలను కొంతవరకైనా దానికి దక్కకుండా చేసి శాంతియుత సంప్రదింపులకు ప్రాతిపదికను రూపొందించడానికి ప్రయత్నించిన కొలంబో ప్రతిపాదనలతో చైనాకుసంబంధంలేకుండాచేయడమే."

చైనా ప్రధాని చేసిన పై ప్రకటన, సింహళం ప్రధాన మంత్రిణీ, సంయుక్త అరబ్ రిపబ్లిక్ అధ్యక్షుల కైరో సమావేశం ఏక కాలంలో జరగడం గమనార్హం. కైరో చర్చలపై ప్రభావం పడవేయడం లేదా ఏ విధంగానైనా ఈ అంశాన్ని తికమక పరచడమే పై ప్రకటన ఉద్దేశం. ఏమైనప్పటికీ ఈ ఉద్దేశం నెరవేరలేదు. చైనా ప్రధాని కపట నాటకాలకు ఎవ్వరూ మోసపోరు. శాంతియుత సహజీవనానికి సంబంధించిన పంచ సూత్రాల పట్ల తన విశ్వాసాన్ని నిరూపించుకోవడానికి చైనా అనుసరించవలసిన ఏకైక మార్గం కొలంబో ప్రతి పాదనలను ఏకమొత్తంగా ఆమోదించి సమావేశానికి సిద్ధం కావడమే.

## అల్జీరియా-మొరాకో వివాదం

అల్జీరియా, మొరాకోల మధ్య ఏర్పడిన సరిహద్దు వివాదం చిలికి చిలికి గాలివానలా పెద్ద యుద్ధంగా పరిణమించింది. ఇది అప్రకటిత యుద్ధమే. కొత్తగా స్వాతంత్ర్యం పొందిన తన రిపబ్లిక్‌కు బాహ్యంగా ఏర్పడిన ఈ ప్రమాదాన్ని ఎదుర్కోవలసి వచ్చిన సమయంలో, అంతరంగికమైన ఒక తిరుగుబాటును కూడా తాను అణచివేసినట్లు ప్రెసిడెంట్ బెన్‌బెల్లా ప్రకటించారు.

సరిహద్దులలో మొరాకన్లు శతఘ్నులను, విమానాలను ఉపయోగించారు. ఉభయ పక్షాలలోనూ ప్రాణనష్టం సంభవించినట్లు తెలియ వచ్చింది. అల్జీరియాలో సాధారణ సమీకరణ ప్రకటించబడింది. ప్రెసిడెంట్ బెన్‌బెల్లా జాతీయ అసెంబ్లీకి సైనిక దుస్తులలో హాజరయ్యారు. పిమ్మట దానిని కాలనిర్ణయం లేకుండా రద్దుపరిచి, మొరాకోలో "ఇంపీరియలిస్టు దురాక్రమణ"ను

ఎదిరించి పోరాడడానికి సైన్యంలో చేర వలసిందిగా ప్రతి డిప్యూటీని కోరారు.

ఈలోగా అల్జీరియా "శాంతి రాయబార వర్గం" మొరాకో మంత్రులతో చర్చలు జరిపింది. యుద్ధవిరమణ జరిగినట్లు కూడా వార్తలు అందాయి. కాని తరువాత పోరాటం కొనసాగింది.

మధ్యవర్తిత్వం నెరపడానికి అరబ్‌లీగ్ సంసిద్ధత వెల్లడించింది. ఐక్యరాజ్య సమితి ప్రధాన కార్యదర్శి శ్రీ ఉథాంట్ కూడా ఈ వివాదాన్ని పరిష్కరించడానికి అవసరమైన ఎట్టిసహాయాన్నయినా అవి కోరేట్లయితే అందచేయడానికి సంసిద్ధత తెలియజేశారు.

ప్రస్తుత వివాదం కొన్ని సరిహద్దు గస్తీ కేంద్రాలకే పరిమితమైనట్లుకనిపిస్తున్నప్పటికీ భారీఎత్తున సైన్యం మొదలైన వాటిని వినియోగించడం జరిగింది. ఈ రెండు దేశాల మధ్య సరిహద్దును ఫ్రెంచి ఏర్పరిచింది. అయితే మొరాకన్లు, ఈ సరిహద్దు నిరంకుశంగా ఏర్పరిచిందనీ, పాక్షికమైనదనీ, అల్జీరియాకు అనుకూలంగా రూపొందించబడిందనీ, ఆ కాలంలో అల్జీరియా ఫ్రాన్సులో ఒక శాఖగా పరిగణించబడేదనీ వాదిస్తున్నారు. వివాదగ్రస్త ప్రాంతంలో చమురు లభించే అవకాశం కూడా వుంది.

అల్జీరియాలో లోగడ ఒక తిరుగుబాటు విఫలమైంది. కబైల్ ప్రాంతంలోని బెర్బర్ జాతివారు హొసేన్ ఐట్ అహమద్, కర్నల్ మొహండ్ ఉ ఎల్ హడ్జ్ నాయకత్వం క్రింద బెన్‌బెల్లా పాలనను నిరంకుశమైనదని ధిక్కరించారు. హొసేన్ ఐట్ అహమద్ ఒకప్పుడు ప్రెసిడెంట్ బెన్‌బెల్లాతో కలిసి కారాగారవాసం చేశారు. తిరుగుబాటు దార్లతో శాంతి సంప్రదింపులు జరపడానికి ప్రెసిడెంట్ బెన్‌బెల్లా ప్రతిపాదించారు. కాని విప్లవవాదులు దానిని తిరస్కరించారు. అల్జీరియా సైనిక దళాలు తిరుగుబాటు జరిగిన ప్రాంతంలోకి ఎట్టి సంఘర్షణ లేకుండా ప్రవేశించి దానిని వశపరుచుకున్నాయి. అయితే తిరుగుబాటుదార్ల నాయకులు, "సంపూర్ణ ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని" స్థాపించా లనే తమ లక్ష్యం సిద్ధించేవరకూ గెరిల్లా యుద్ధం కొనసాగుతూ వుండగలదని అజ్ఞాతవాసం నుంచి ప్రకటించారు.

అల్జీరియా మొరాకోల మధ్య ఏర్పడిన సరిహద్దు వివాదంలో పెద్ద రాజ్యాలు కూడా జోక్యం చేసుకున్నట్లు ఇప్పుడు స్పష్టపడుతున్నది. ఈ దేశాలకు ఆయుధాలు, మందుగుండు మొదలైన యుద్ధసామగ్రి ఎక్కడి నుంచి సరఫరా అవుతున్నదో గమనిస్తే దానినిబట్టి అసలు కీలకం వెల్లడవుతుంది. మధ్య ప్రాచ్యం ఇంకా ప్రచ్ఛన్న యుద్ధానికి ఆలవాలంగా వుంటున్నది. ప్రస్తుతం ఏర్పడిన ఈ వివాదాన్ని ప్రచ్ఛన్నయుద్ధ సంఘటనగా ఎంచవచ్చు. అమెరికా, రష్యాలు ఈ వివాదానికి ప్రేరేపకులుగా పరస్పర నిందారోపణలు ప్రారంభించాయి. ఇవి రెండూ (ఒకదానికొకటి) సరిహద్దు సమరం పెద్ద పోరాటంగా పరిణమించ వచ్చునని హెచ్చరికలు చేస్తున్నాయి. ఇది మామూలు ప్రచ్ఛన్న యుద్ధ పద్ధతి అయినట్లు ఎవరైనా గ్రహించగలుగుతారు. ఇది, పాత అలవాట్లు అంత తొందరగా వదలవనీ, గతంలో చేసిన వాగ్దానాలు, హామీలు మామూలు ధోరణిలో వర్తమానాన్ని తమ ప్రభావానికి లోనుచేస్తూ భవిష్యత్తును కూడా నిరాశాజనకం చేస్తాయనే విషయాన్ని మాత్రమే వెల్లడిస్తుంది.

అయితే ఈ వివాదాన్ని చక్రవర్తి హేలె సెలాస్సె అధ్వర్యంలో శాంతియుతంగా పరిష్కరించడానికి కృషి జరుగుతున్నది. ఇందు నిమిత్తం సమావేశం జరుగుతున్నది. ఈ వ్యాసం ముద్రించబడే నాటికి స్పష్టమైన ఏదో ఒక నిర్ణయం జరగవచ్చు.

## అంతరిక్షంలో అణ్వస్త్రాల ప్రయోగంపై నిషేధం

అమెరికా, రష్యా, ఇంకా పదిహేను ఇతర దేశాలు కలిసి ప్రతిపాదించిన ఒక తీర్మానాన్ని ఐక్యరాజ్య సమితి జనరల్ అసెంబ్లీ ఆమోదించింది. అంతరిక్షంలో కక్ష్యలోనికి అణ్వస్త్రాలు తదితర మారణాయుధాల ప్రయోగాల నిషేధాన్ని ఈ తీర్మానం లక్షిస్తున్నది. ఇది ఆమోదించబడటంతో అనూహ్యమైన బీభత్సానికి గల అవకాశాన్ని మొగ్గలోనే త్రుంచివేసినట్లయింది.

ప్రెసిడెంట్ కెన్నెడీ, సోవియట్ విదేశాంగ మంత్రి ఎండ్రీ గ్రోమికోలు ఇటీవల చేసిన ప్రకటనలు, పిమ్మట గ్రోమికో, అమెరికా స్టేట్ సెక్రటరీ డీన్ రస్క్‌ల మధ్య జరిగిన చర్చల పర్యవసానమే ఈ తీర్మానం. ఇది శాసనబద్ధమైనది కాకపోయినప్పటికీ, లోగడ అమెరికా, రష్యాలు సూత్రప్రాయంగా ప్రకటించిన ఒడంబడికను ఇది లాంఛనప్రాయం చేస్తుంది.

ఈ తీర్మానాన్ని ప్రతిపాదించిన దేశాలలో రెండు ప్రధానరాజ్యాలతోపాటు జనీవాలో నిరాయుధీకరణపై జరిగిన సమావేశంలో పాల్గొన్న ఇతర దేశాలన్నీ వున్నాయి. ఫ్రాన్సు, నిరాయుధీకరణ కమిషన్ను బహిష్కరించింది.

ప్రధాన రాజకీయ కమిటీలో ఈ తీర్మానంపై చర్చను ప్రారంభిస్తూ భారత ప్రతినిధి ఫ్రాన్సు, చైనాల మిత్రులు ఆ రెండు దేశాలచేత అణ్వస్త్రాల నిషేధ ఒడంబడికను సమ్మతింపజేయడానికి దౌత్య సంబంధ

మైన ఒత్తిడులను తెచ్చేపర్యంతం "ఈ ఒప్పందం రద్దయిపోయేప్రమాదం" వుంటుందని హెచ్చరించారు.

## ప్రచ్ఛన్న యుద్ధ ఉద్రిక్తత తగ్గుదల

ప్రాక్ - పశ్చిమ దేశాలమధ్య ప్రచ్ఛన్న యుద్ధం, ఉద్రిక్తతలు సడలుతున్నాయి. ఇటీవలి సంఘటనలే దీనికి నిదర్శనాలు.

భూమిపై అణ్వస్త్రాల ప్రయోగాన్ని నిషేధించడంతో పాటుగా ఈ విషయంలో మరో ప్రధానమైన సంఘటన జరిగింది. 250 మిలియన్ డాలర్ల గోధుమ సరఫరాకు సంబంధించి సోవియట్ రష్యాతో ఒడంబడిక కుదుర్చుకున్నట్లు ప్రెసిడెంట్ కెన్నెడీ ప్రకటించారు. ప్రపంచ శాంతి సుసాధ్యమైనదనడానికీ, ప్రయోజనాత్మకమైనదనడానికీ ఈ ఒప్పందం మరో ఆశాజనకమైన సంఘటన అని ఆయన పత్రికా ప్రతినిధులసభలో వెల్లడించారు. ఈ ఒప్పందం మేరకు 4 మిలియన్ టన్నుల గోధుమ సరఫరా జరుగుతుంది.

ఇంతేగాక యుగోస్లావియా అధ్యక్షుడు టిటో అమెరికాను సందర్శించడం, అక్కడ అమెరికన్లు ఆయనకు బ్రహ్మాండమైన స్వాగతమివ్వడం కూడా ప్రాక్ - పశ్చిమ దేశాల నాయకులు పరస్పర మైత్రిని గాఢంగా అభిలషిస్తున్నారనే విషయాన్ని వెల్లడిస్తున్నవి.

ప్రెసిడెంట్ టిటో అమెరికాలో వెలుబుచ్చిన అభిప్రాయాలు మెప్పు బడిశాయి. ప్రాక్—పశ్చిమదేశాల సంబంధాల చరిత్రలో నిజంగా ఇది ఆశాజనకమైన ఒక నూతనాధ్యాయం.

అయితే ఈ విషయంలో అతిగా ఆశాభావం కలిగివుండడాన్ని త్రోసిపుచ్చే కొన్ని అంశాలుకూడా వున్నాయి. ఉదాహరణకు, ప్రధాన మంత్రి కృశ్చేవ్, పాక్షిక అణ్వస్త్ర నిషేధ ఒప్పందం జరగడంవల్ల ఆయుధ సంపదను కూర్చుకోవటంలో సాగే పోటీ సమసి పోతుందనుకో రాదని అన్నారు. ఇది వాస్తవం. అణ్వస్త్ర నిషేధ ఒప్పందాన్ని ప్రపంచ శాంతిసాధన కృషిలో తొలిమెట్టుగా మాత్రమే అంతా పరిగణించారు. పాక్షికంగా గానీ, లేదా సంపూర్ణంగా గానీ అణ్వస్త్ర పరీక్షలను నిలిపివేసినంతమాత్రాన ప్రపంచ శాంతి గానీ, నిరాయుధీకరణగానీ సిద్ధించదు. ఆయుధాలను నిషేధించడం, వివాద హేతువులను నిర్మూలించాలన్న సువిశాల లక్ష్యంలో ఒక భాగం మాత్రమే. అందుచేత అణ్వస్త్ర ప్రయోగ నిషేధ ఒప్పందం సాఫల్యం, శాంతినీ, సహజీవనాన్నీ స్థాపించడానికి తరువాత ఎంత దీక్షాసక్తితో పటిష్ఠమైన చర్యలు తీసుకోబడతాయో దానిమీదనే ఆధారపడి వుంటుంది.

## దక్షిణ వియత్నాంకు రాయబార వర్గం

దక్షిణ వియత్నాంలో మానవ హక్కుల ఉల్లంఘనను గూర్చి సింహళం, భారతదేశం, మరో 14 ఆఫ్రికా, ఆసియా దేశాలు ప్రతిపాదించిన తీర్మానాన్ని గత నెలలో ఐక్యరాజ్య సమితి జనరల్ అసెంబ్లీ చర్చించింది. న్యూయార్కులోని వియత్నాం పరిశీలక బృందం, వాస్తవ పరిస్థితులను గూర్చి ప్రత్యక్షంగా తెలుసుకోవడానికి దక్షిణ వియత్నాంకు రాయబార వర్గాన్ని పంపించాలని సూచించింది. కాని సోవియట్ యూనియన్ వియత్నాంలోని అంతర్జాతీయ కంట్రోలు కమిషను ఈ విషయాన్ని దర్యాప్తు చేసి అసెంబ్లీకి నివేదిక సమర్పించాలని కోరింది.

అయితే జనరల్ అసెంబ్లీ, వియత్నాంకు వాస్తవికాంశాల పరిశీలన నిమిత్తం ఒక బృందాన్ని పంపాలనే ప్రతిపాదనను ఆమోదించి, పరిశీలక బృందం నివేదిక అందేవరకూ చర్చలను వాయిదా వేయడానికి నిశ్చయించింది. ఈ పరిశీలక బృందంలో ఆఫ్ఘనిస్తాన్, బ్రాజిల్, సింహళం, కోస్టారికా, డహోమీ, మొరాకో, నేపాల్ దేశాల ప్రతినిధులు సభ్యులుగా వుంటారు.

## కాశ్మీరు పరిణామాలు

భారతదేశంలోని యితర రాష్ట్రాలలో వలెనే జమ్మూ—కాశ్మీర్‌లో కూడా, యికముందు, సదరె రియాసత్‌ను గవర్నరు అనీ, ప్రధానమంత్రిని ముఖ్యమంత్రి అనీ వ్యవహరిస్తారని, క్రిందటి నెలలో కాశ్మీరు మాజీ ప్రధాని బక్షి గులాం మహమ్మదు ప్రకటించారు. కాశ్మీరు సదరె రియాసత్, ప్రధాన మంత్రుల పేర్లను మార్చాలనే యీ సంకల్పాన్ని, కాశ్మీరును మిగిలిన దేశానికి మరింత సన్నిహితంగా కొనిరావడానికి గైకొన్న "మరొక పెద్ద చర్య"గా ఆయన అభివర్ణించారు. వచ్చే సంవత్సరం శాసన సభ రాబోయే సమావేశంలో, యీ చర్యకు శాసన రూప మివ్వబడుతుంది. అయితే, కాశ్మీరులో గల ప్రత్యేక పరిస్థితుల దృష్ట్యా దానికి ప్రత్యేక హోదానిచ్చే భారత రాజ్యాంగం 370 వ. సూత్రం మాత్రం అమలులో నే వుంటుంది. భారతదేశంతో కాశ్మీరు సమైక్యతా దోహదానికై కేంద్ర ప్రభుత్వం యిది వరకే గైకొన్న వివిధ చర్యలను గురించి, యీ సందర్భంలో ఆయన పేర్కొన్నారు.

ఏ భారతదేశానికి స్వాతంత్ర్యం వున్నదో, యెక్కడ "ప్రతి కార్మికునికీ సంఘంలో గౌరవ ప్రదమైన స్థానం వున్నదో" ఆ భారతదేశంలో భాగమై వుండటం కాశ్మీరుకు గర్వకారణమనీ, ఆనందదాయకమనీ నూతన ప్రధాని శ్రీ షమ్సుద్దీన్ అన్నారు. "చైనా లేక పాకిస్తాన్ బలవదాక్రమణ" క్రింద కాశ్మీరు స్వీయ భూభాగంపై తన

కున్న హక్కులను వదులుకొనడం యెన్నటికీ జరగదని ఆయన ప్రకటించారు.

ఇక మన పొరుగుదేశం పాకిస్తాన్‌కు సంబంధించినంత వరకూ, అది పూరికే దోబూచులాడుతున్నట్లు కనబడుతుంది; ఒకసారి తూర్పు సరిహద్దున మరొకసారి కాశ్మీరులోని యుద్ధ విరమణ శ్రేణిలో దూషణ, మోసములు మొదలు రాజకీయ వ్యవహారములలో అమర్యాద వరకూ గల సమస్త విషయాలు పాకిస్తాన్‌కు అతి సహజమైనట్టు తోస్తుంది. ఇటువంటి మోటు చేష్టలలో తాజాది చెక్‌నాటీ గ్రామానికి సంబంధించింది. ఈ గ్రామం భారతదేశం వైపు యుద్ధ విరమణ శ్రేణిలో వున్నప్పటికీ, దాని పరిపాలనాధికారం పాకిస్తాను అధికారులకు వున్నదట; యిటువంటి సిద్ధాంతాన్ని కనిపెట్టి, అర్థం చేసుకొనడం ఒక్క పాకిస్తానుకే చెల్లును. ఈ చేష్టల వెనుక దాగివున్న అసలు వుద్దేశం వేరు. ఏవిధంగానైనా భారతదేశాన్ని రెచ్చగొట్టి తద్వారా, మనకు అమెరికా చేసే ఆయుధాల సరఫరాను ఆపివేయాలని పాకిస్తాన్ కోరిక. కాని శ్రీ భుట్టో అమెరికాలో తన సమాలోచనల పట్ల "అసంతృప్తి" వెల్లడించడాన్ని బట్టి యీ ప్రయోజనం సిద్ధించే అవకాశం యెంత మాత్రమూ లేదనే చెప్పాలి.

## నవభారతంలో విజ్ఞానశాస్త్రం

జాతీయ ప్రయోగశాలలు, యితర విజ్ఞాన శాస్త్ర సంస్థలు కార్య నిర్వహణలో ప్రభుత్వ పద్ధతి "స్తబ్ధ వాతావరణాన్ని" తప్పించుకోవాలని, క్రిందటి నెల న్యూఢిల్లీలో భారతీయ విజ్ఞాన శాస్త్ర కాంగ్రెస్ 50 వ. సమావేశాన్ని ప్రారంభిస్తూ ప్రధాన మంత్రి నెహ్రూ సలహా యిచ్చారు. ప్రణాళికా సంఘం పరిగ్గా మరొక ప్రభుత్వ శాఖ వలే యేవిధంగా పనిచేసిందో పేర్కొంటూ జాతీయ ప్రయోగశాలలు అటువంటి పద్ధతిని విడనాడగలవని ఆశాభావాన్ని వెల్లడించారు. అత్యవసర పరిస్థితిలో జాతీయ ప్రయోగశాలలు చేసిన పని "స్తుతి పాత్ర" మైందిగా ఆయన అభివర్ణించారు. వయస్సుకు, అనుభవానికి మరీ యెక్కువ ప్రాధాన్యం యివ్వకుండా, విజ్ఞాన శాస్త్రంలో నాయకత్వానికి అవకాశాలను యువకులకు యివ్వాలని ఆయన అభిలషించారు. సరైన వ్యక్తుల ద్వారా విజ్ఞాన శాస్త్రాభివృద్ధికి సరైన పునాదులను నిర్మించాలి. భారతదేశంలో విజ్ఞాన శాస్త్రజ్ఞులు రెండు విధాలుగా పని చేయవలసి వున్నది. ఒకవంక వారు ప్రపంచంలోని సాధారణ అభివృద్ధి, ఆలోచనలకు దోహదం చేయాలి, మరొకవంక దేశీయ సమస్యల పరిష్కారానికి తోడ్పడాలి. వారు దేశంలో విజ్ఞానశాస్త్ర తత్త్వాన్ని పెంపొందించాలి.

భారతదేశంలో నెలకొల్పబడనున్న నాలుగవ అణుశక్తి కేంద్రం, విదేశీయుల తోడ్పాటు లేకుండగా, కేవలం భారతీయ విజ్ఞాన శాస్త్రజ్ఞులు, సాంకేతిక నిపుణులచే నిర్మింపబడగలదని అణుశక్తి సంఘం అధ్యక్షుడు డా. హెచ్.జె. భాబా భా.వి.శా. కాంగ్రెస్‌కు తెలియజేశారు.

## బొకారో

బొకారో ఉక్కు యంత్రాగారాన్ని స్వయంగా తానే నిర్మించుకొనడానికి భారతదేశం తుదకు నిర్ణయించుకున్నదని కేంద్ర ఉక్కు, భారీ పరిశ్రమలమంత్రి, గడచిన నెల భిలాయ్ ఉక్కుపనుల సంస్థలోని ఉద్యోగులు, ఇంజనీర్ల సమావేశంలో ప్రసంగిస్తూ ప్రకటించారు. అమెరికా సహాయార్థం భారతదేశం చేసిన ప్రయత్నం విఫలమైంది. ఇప్పుడు భారతదేశం బొకారో విషయంలో అమెరికా సహాయానికై తాను మొదటచేసిన అభ్యర్థనను వుపసంహరించుకొన్న
ఈ యంత్రాగారం 1967 నాటికి వుత్ప
ప్రారంభిస్తుందనీ, వుత్పత్తిశక్తి సా
15 లక్షల టన్నులు వుండగలదనీ,
1971–72 నాటికి 45లక్షల టన్నులకు
గలదనీ ఆయన చెప్పారు. భారతదే
యింతవరకూ వుక్కు టెక్నాలజీని విదే
నుంచి ఎరువు తీసుకొంటున్నది;
యిప్పుడు దీనిని మానివేయడానికి ప్రయ
త్నిస్తున్నది. దేశంలో ప్రభుత్వ విభాగపు
యంత్రాగారాలలోని ఇంజనీర్లు, కార్మి
కూడ, యిప్పుడు ఉక్కు యంత్రా
నిర్మాణ, నిర్వహణల విషయం
పైవేటు విభాగం సవాలును యెదురో
స్థితిలో వున్నారని ఆయన చెప్పా
భిలాయ్, రూర్కేలా, దుర్గాపురం య
గారాల విజయం నిస్సంశయంగా
ఋజువుచేసింది.

985 మిలియన్ డాలర్ బొకారో
మిల్లులను అమెరికా నిర్మించని పక్ష
"కొంచెంముందు, వెనుకలుగా యె
ఒకరు ఆ పని చేస్తారు" అని యిం
ముందు మన దేశంలో అమెరికా రాయబా
వున్న మిస్టర్ జాన్ కెన్నెత్ గాల్
అమెరికా ప్రజాప్రతినిధులసభ అ
యేషన్సు ఉపసంఘానికి ఆగస్టు మధ
రహస్యంగా చెప్పినవిషయం ఇప్పుడు వె
చేయబడింది. ఆయన యింకా
అన్నారు. "భారత దేశం తన పరిస్
ఉన్న యితర దేశాలవలెనే, యేదో
విధంగా, చిరకాలంనుంచీ వుంటున్న
రికంనుంచి విముక్తి పొందగోరుతున
ఈ విషయంలో మనం తోడ్పడక
మనకు నచ్చని యితరశక్తులు
చేస్తాయి." ఈ హెచ్చరిక యెంత వ
పనిచేసిందో యింకా వేచిచూడవలసివున

టోకారో విషయంలో తన వైఖరిని మార్చు కొనడంలో అమెరికా యిప్పటికే ఆలస్యం చేసింది.

## ఇంగ్లండు, పశ్చిమ జర్మనీలలో కొత్త నాయకులు

గడచిన నెలలో ఐరోపాఖండంలోని రెండు దేశాలలో కొత్తనాయకు లేర్పడ్డారు. ఇంగ్లండులో, అస్వస్థత కారణంగా పదవి కొనసాగించలేని హెరాల్డు మాక్మిలన్ స్థానే లార్డ్‌హోమ్ ప్రధానమంత్రి అయినారు. దీనికి ముందు, అనేకమంది ప్రముఖవ్యక్తుల తరఫున, నాయకత్వం నిమిత్తం కన్సర్వేటివ్ పార్టీలో తీవ్రమైన ప్రచారం జరిగింది. వారిలో ఒకరైన సైన్సుమంత్రి లార్డ్ హెయిల్షామ్, నాయకత్వానికై పోటీ చేసే నిమిత్తం కడకు తన ప్రభు పట్ట పరిత్యాగానికి కూడ సంసిద్ధులైనారు. పదవీ విరమణ చేస్తున్న ప్రధాన మంత్రితో సంప్రదించిన మీదట, రాణీ నూతన ప్రభుత్వాన్ని యేర్పాటు చేయవలసిందిగా లార్డ్‌హోమ్‌ను ఆహ్వానించారు.

పశ్చిమ జర్మనీ అధ్యక్షుడుగా వరుసగా 14 సంవత్సరాలు పదవిలోవున్న డా. కె. అడినోవర్ రాజీనామాతో, ఆ దేశంలో ఒక శకం ముగిసిందని చెప్పబడుతున్నది.

1949లో పదవి నలంకరించిన యీయన, అతి దృఢ చిత్తంతో పనిచేసి యుద్ధ విచ్ఛిన్నమై, క్షుధార్తమై వున్న జర్మనీని ఆత్మ విశ్వాసంతో సందడిగాపనిచేసే ప్రజానీకంతో సౌభాగ్యోపేతమైన ప్రజాస్వామిక దేశంగా తీర్చిదిద్ది, పశ్చిమ రాజ్యాలతో సమాన భాగస్వామిగా కలిసిపోయే అవకాశాన్ని కల్పించారు.

ఈయన వయస్సు 87 సంవత్సరాలు. ఇక ముందుకూడా తాను జర్మనీ రాజకీయాలలో పాల్గొనగలనని యీయన స్పష్ట పరిచారు.

డా. అడినోవర్ స్థానే ప్రొఫెసర్ లూడ్విగ్ ఎర్హార్డ్ జర్మనీకి అధ్యక్షుడు అయ్యారు. ఈయన విధానాలు కొంత సడలింపుకు సుముఖంగా వుంటాయి. ఈయన వయస్సు 66 సంవత్సరాలు. డా. అడినోవర్ క్రింద యీయన ఆర్థిక మంత్రిగా పని చేశారు.

పశ్చిమ జర్మనీ నుంచి భారతదేశం పొందిన భారీరకం సహాయాలలో ఒకటి రూర్కెలా ఉక్కు యంత్రాగారానికి సంబంధించింది.

(మిగతా 24 వ పేజీలో)

---

# త్యాగ దీపికలు

★ "కమ్మిశెట్టి"

మరువకోయీ ! భారతీయుడ ! అమరవీరుల గాథలు
భారత స్వాతంత్ర్య స్వేచ్ఛా సమరవీరుల గాథలు—

ఎన్ని బలిదానాల ఫలముగ
ఇచట స్వేచ్ఛానిలము వీచెను
ఏ రుధిర కాసారములలో
ఈ అరుణ కమలాలు పూచెను

మరువకోయీ ! భారతీయుడ ! అమరవీరుల గాథలు
మాతృ ధరణీ మహిత స్వేచ్ఛా సమరవీరుల గాథలు—

ఎన్ని మమతలు త్రెంచు కొనిరో
ఎన్ని ఆశలు త్రుంచు కొనిరో
మాతృ దేశపు పిలుపు నందుక
దాస్య శృంఖలముల విదల్చుక

ధారవోసిరి ధర్మవీరులు వేడి నెత్తుటి ధారలు
దేశ చరితాకాశ వీధుల మాసిపోవని తారలు—

మహా భారత ధరా తలిపై
విదేశీయుల పదాలేమిటి ?
చరిత కే అది మచ్చగా అభి
మాన వంతుల ఎదల గ్రుచ్చగ

సాగి పోయిరి సమర భేరీ ధ్వనులు దిక్కులు మ్రోయగ
ఎగుర వేసిరి జయపతాకము గగనవీధుల ఆడగ—

దేశ రక్షణ తమకు రక్షగ
దేశమే ప్రాణాధి కముగా
దేశమును ప్రేమించి పోయిరి
జీవితము లర్పించి పోయిరి

త్యాగ దీపికలై జ్వలించిరి మహాభారత వీరులు
దేశ రక్షణ కార్య దీక్షా బద్ధ కంకణ ధారులు—

★

# తెలుగునాడు నేటి చిత్రకళ

చలసాని ప్రసాదరావు

ఒకనాటి మన చిత్ర, శిల్పకళలను తలచుకొని ఈనాడు గర్వపడుతాం. దేశం నలుమూలలా చెల్లా చెదరుగా నిలిచివున్న అసంఖ్యాకమూ, అపురూపమూ నైన ప్రాచీన కళా సంపదను ప్రేత్తి చూపుకుంటూ గత కాలపు కళా వైభవానికి, ఔన్నత్యానికి మురిసిపోతాం.

కాని, నేటి మన సమకాలీనాంధ్ర చిత్రకళా స్వరూప మే విధంగా రూపు దిద్దుకుంటూన్నది ? ఈ రంగంలో, ఈ కాలంలో వస్తూన్న, ప్రదర్శితమవుతూన్న పరిణామాలూ, ధోరణులూ, వాటి ఫలితాలూ మన కళారంగాన్నే దిశగా పయనింప జేస్తూన్నవి ? ఆధునికాంధ్ర చిత్రకళా స్వరూప, స్వభావా లేలాంటివి ? అని ప్రశ్నించుకుంటే మాత్రం జవాబు రాబట్టగలగటం కష్ట సాధ్యమే.

ఒకనాడు కళ ప్రజల కత్యంత సన్నిహితమై వారి ఆదరణలో, మహారాజుల పోషణలో, మతావలంబనంతో పెరిగి వారివారి ఆశయాలకు, అభిరుచులకు, జీవనవిధానాలకూ అనుగుణ్యంగా రూపు దిద్దుకుంటూ, ప్రతిఫలింపజేస్తూ ఆ కాల పరిమితుల కనుగుణమైన, ఆశింపదగిన అభివృద్ధిని సాధించింది.

కాలం మారి, పాలకులు మారి, ప్రజల అభిరుచుల్లో, జీవనసరళిలో, ఆలోచనా ధోరణులలో విశేషమైన మార్పు వస్తూన్న కాలంలో సహజంగానో, కృత్రిమంగానో ఏర్పడిన ఒక రకమైన పాశ్చాత్య ప్రభావ ఫలిత వాతావరణ కారణంగా మన కళలకు ప్రోత్సాహం తగ్గి ముఖ్యంగా చిత్రకళారంగం దాదాపు నిర్జీవతకు లోనైనది.

కళలు సమాజ జీవికకు దర్పణాలవంటివి. సమాజ చైతన్యమునేవి కళా వికసనంతో బలంగా ముడిపడి వున్నది. కనుకనే మన జాతీయోద్యమకాలంలో వివిధరంగాలతోపాటు చిత్రకళారంగంలో కూడా పునరుజ్జీవనోద్యమానికి అంకురార్పణ జరిగింది.

ఆనాడే తెలుగు దేశంలో కూడా స్తబ్ధంగా నిలచిపోయిన చిత్రకళా రంగంలో నవ చైతన్యానికి, నూతన రీతులకు నాంది వాక్యం పలుకబడింది.



“పత్ని — పరిహాసి” — శ్రీ అ. వైదిరాజు

“ఏకాకి” — శ్రీ కొండపల్లి శేషగిరిరావు





"ఆపత్కాలం" — కుమారి అరవిందా చామకూర్

ఆనాడాంధ్ర చిత్ర కళారంగానికి నూతనాలంకారాలను మాత్రమేగాక, నూతన రూపాన్ని సైతం సమకూర్చ బూనుకొన్న వ్యక్తి దామెర్ల రామారావు. ఆ సంధికాలంలో ఆయన తనకు గల ప్రాచ్య, పాశ్చాత్య కళా విధానాల పరిజ్ఞానంతో రెండింటా గల ఉత్తమ లక్షణాలను మేళవించి ప్రత్యంగుళానా తెలుగుదనం ఉట్టిపడగల, నాటి ప్రమాణాల దృష్ట్యా సాంకేతికంగా పున్నత స్థాయి నందగల కళాసృష్టి చేసి అల్ప కాలంలో అనల్పమూ, ఆదర్శపాత్రమూ నైన ఫలితాలను సాధించి మార్గదర్శకుడై నాడు.

ఈ పునరుజ్జీవనోద్యమ దశలో కలకత్తాలో అవనీంద్రనాథటాగోర్ శిక్షణలో పర్యవేక్షణలో ప్రజ్ఞావంతులైన యువ చిత్రకారులనేకులు రూపొందారు. చిత్రకారులుగా వారి శక్తి సామర్థ్యా లసమానమైనవి. వీరందరూ దేశంలోని వివిధ ప్రాంతాలలో కళారంగ వికసనానికి తమ, తమ శక్తి సామర్థ్యాల నంకితం చేశారు. ప్రమోదకుమార ఛటర్జీ బందరు జాతీయ కళాశాలలో, దేవీప్రసాదరాయ్ చౌదరీ మద్రాసు చిత్రకళాశాలలో కా లిడటంతో ఆంధ్రదేశంలోని యువ కళాభిమానులకు పెన్నిధులు లభించినట్లయినది.

దామెర్ల రామారావు చేసి చూపిన కళాసృష్టి పదుగురి దృష్టి నటు మరలించి ఆకర్షించగా, మన కళారూపాలు పునరుద్ధరించబడాలనే జాతీయోద్యమాంతర్భాగమైన కోర్కె, సకాలంలో లభ్యమైన అవకాశాలూ, యువ హృదయాలను తేజితం చేసి కార్యరంగంలోకి దింపినాయ్.

ఆంధ్ర చిత్రకళా చరిత్రలో అదొక ఉత్సాహ భరితమైన కాలం. నిర్విరామ కృషితో, దీక్షతో కళపై అధికారాన్ని సాధించుకొని, ప్రదర్శింపగలగటం వినా మరో ధ్యేయమే దీ లేదా నాటి చిత్రకారులకు. కనుకనే అత్యల్ప కాలంలో అనల్పమైన ఫలితాలను సాధించి ప్రజల్నాకర్షించి, జాతి దృష్టి నీ రంగం పైకి మరల్చగలిగారు.

ఆలా రూపొందిన వారిలో ఆ పైడి రాజు, మాధవపెద్ది గోఖలే, హెచ్. వి. రాంగోపాల్, కె. శ్రీనివాసులు, పి.యల్. నరసింహామూర్తి, వేలూరి రాధాకృష్ణ, ముప్పాటి కృష్ణమూర్తి, కౌతా రామమోహనశాస్త్రి, తేజోమూర్తుల కేశవరావు, భాగేశ్వరశర్మ, వి. ఆర్. చిత్రా, అడవి బాపిరాజు, గుర్రం మల్లయ్య మున్నగువారెందరో ఉన్నారు.

ఆంధ్ర చిత్రకళా రంగంలో దేవీప్రసాదరాయ్‌చౌదరికి ఎంతైనా ఋణపడి యున్నది. ఆ కళాస్రష్ట పర్యవేక్షణలో ఆంధ్ర యువకులనేకులు గర్వింపదగిన కళానైపుణ్యాన్నలవర్చుకున్నారు. ఆనాటి చిత్రకారులలో అధిక సంఖ్యాకులు రాయ్‌చౌదరి శిష్యులే. అదొక విధంగా చిత్ర, శిల్ప సవ్యసాచిగా అఖండఖ్యాతి

"భిక్షకులు" — శ్రీ వై. హనుమాన్‌సూరి



నార్జించుకున్న రాయ్‌చౌదరీ యుగం. అయినా ప్రశంసనీయమైన విషయమేమంటే వారి శిష్యులలో ఏ ఒక్కరూ కూడా ఆయనకు నకళ్ళుగా తయారుకాలేదు. వారందరిమీదా, వారి చిత్రిత విధానాలమీదా రాయ్‌చౌదరీ ప్రభావమేగాక మరికొన్ని విధానాల, కొందరు ప్రాచ్య, పాశ్చాత్య చిత్రకారుల ప్రభావం సైతం వున్నమాట వాస్తవమే. కాని, వారెవరూ ఆయా మార్గాల ననుకరించలేదు. ఆయా చిత్రణా వైఖరులలో గల సద్గుణాల నభిమానించి, వాటి నవగతం చేసుకొని, తమ స్వకీయ మార్గంలోకి మలచుకున్నారే గాని మరొకరికి ప్రతిబింబాలుగా రూపొందలేదు. ఎవరికి వారే తమదని చెప్పుకోదగిన ప్రత్యేకతను, విశిష్టతను సాధించి తమతమ కళాసృష్టిలో తమ వ్యక్తిత్వాన్ని ప్రముఖంగా ప్రదర్శించారు.

ఆనాటి చిత్రకారుల సృష్టిలో వైవిధ్యం, సృజనాత్మకత ప్రశంసనీయమైన విధంగా వెల్లివిరిసినాయ్. తెలుగుదేశం, తెలుగుజాతి రూపురేఖలు, వారి కథలు, గాథలు, పురాణాల, ఇతిహాసాల సంఘటనలు, ఘట్టాలు, నాటి వాతావరణం చిత్రకారుల కుంచెలలో జీవం పోసుకుని చైతన్య విలసితంగా రూపొంది ప్రజల్ని ముగ్ధుల్ని చేసినాయ్.

నాటి కళ ప్రజల కత్యంత సన్నిహితమైనట్టిది, వారినే దృష్టిలో వుంచుకుని వారి కొరకే సృష్టింపబడినట్టిది. కనుకనే చిత్రకారుని చిత్రిత వస్తు స్వభావ మెటువంటిదైనప్పటికీ, చిత్రకారు డెంత శక్తిమంతుడైనప్పటికీ, చిత్రణా మార్గం సుబోధకమై, మనోహరమై ప్రజా హృదయాల్ని స్పందింపజేసినాయ్. కళ అంటే



"తిరుపతి నుండి" — శ్రీ వడ్లమాని మధుసూదనరావు

ఏమిటో వారికి తెలియజెప్పినాయ్. కళ పట్ల వారిలో ఆదరాన్ని, అభిరుచిని పెంపొందింపజేసినాయ్. అందువలననే "ఆ తరం" చిత్రకారుల కళాకృషి, సామర్థ్యాలు కేవలం ఆధునికాంధ్ర చిత్రకళా చరిత్రలో మాత్రమేగాక ప్రజా హృదయాలలో సైతం నేటికీ నిలచి ఉన్నాయ్.

నాటికీ, నేటికీ పరిస్థితులు—ముఖ్యంగా చిత్ర కళారంగంలో—ఊహించనంతటిగా మారిపోయినాయ్.

జాతీయోద్యమంతోపాటు వివిధ కళారంగాలలో వెల్లువికిన చైతన్యం దానితోపాటే. ఆ పరిస్థితి మారటంతో క్రమంగా తగ్గి ఒక దశలో చిత్ర కళారంగంలో స్తబ్దత ఆవరించుకున్నది. అంతవరకూ సమాజాన్నావరించుకున్న సమస్యల స్వరూప, స్వభావాలు మారటంతోపాటు మేధావి వర్గ ఆలోచనా విధానాలలో సైతం విపరీతమైన మార్పు నెలకొన్నది. ఈ సంధి కాలంలో మార్గదర్శనం తోచని సందిగ్ధావస్థలో చిత్రకారుల కుంచెలు తటపటాయించినాయ్. ఈ పరిస్థితుల ప్రభావాన్ని తట్టుకుని, అధిగమించి నిలబడ కలిగిన చిత్రకారులు బహు కొద్ది మందే!



"కేశాలంకరణ" — శ్రీ శీలా వీర్రాజు

అయితే, ఇట్టి పరిస్థితులలో సైతం బొంబాయి, కలకత్తావంటి చోట్ల చిత్ర కళారంగంలో కృషి బహుముఖంగానూ, ఉత్సాహపూరితంగానూ జరుగుతూనే వున్నది. అందుకు ప్రాంతీయమైన కారణాలనేకమున్నాయ్. పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన ఆ వాతావరణంలోంచి ఒక రకమైన కళా పోషకుల్ని సంపాదించుకోగలిగిన నాటి పరిస్థితులలో వృత్తి చిత్రకారులుగా జీవికను నిర్వహింపగలిగిన స్థితికి కొందరు ప్రముఖ చిత్రకారులు చేరుకోగలగటం సాధ్యమయినదికూడా. దీనికితోడు ప్రభుత్వపరంగా కేంద్రంలోనూ, కొన్ని రాష్ట్రాలలోనూ చిత్రకళారంగంలో కృషి చేసేందుకగాను లలితకళా అకాడమీలు నెలకొన్నాయ్. ఆనాటి పరిస్థితులలో చిత్రకారులకు ఆశాజ్యోతిగా పేర్కొనబడిన కేంద్ర లలితకళా అకాడమీలో సహజంగానే ఆ సమయంలో ప్రముఖ చిత్రకారులుగా పేరొందివున్న ఢిల్లీ, కలకత్తా, బొంబాయి చిత్రకారులకే ప్రాధాన్యత ఈయబడింది.

ఆ విధంగా అందరి దృష్టి ఆయా ప్రాంతాల చిత్ర కళా వైఖరులపై ముఖ్యంగా బొంబాయిపై కేంద్రీకరింపబడింది. ఆ దశలో మన చిత్రకారుల దృష్టి కూడా అటు ప్రసరించటం సహజమే. అయితే, ఎవరెన్ని చెప్పినా బొంబాయి చిత్రకారులకు దారి జూపినది పాశ్చాత్య కళా ప్రపంచమే. అందువల్లనే అందరి దృష్టి క్రమంగా బొంబాయి మీదినుండి పాశ్చాత్య కళారూపాలవైపు ప్రసరించింది.

అప్పటికే పాశ్చాత్య కళాప్రపంచంలో ప్రముఖ ప్రాంతాలనదగిన ఇటలీ, ఫ్రాన్స్, అమెరికావంటి దేశాల చిత్రకారులలో కళనుగురించి, కళా ప్రయోజనాన్నిగురించి, ప్రయోగ విధానాల్ని గురించి రకరకాల అభిప్రాయాలు, వాటిల్లోంచి పుట్టుకొచ్చిన వివిధ 'ఇజాలు' నెలకొని ఉన్నాయ్. పికాసోవంటి కొందరు తమ కళాసృష్టిలో వింతవింత పోకడలు ప్రదర్శించి కళా ప్రపంచాన్నే ఊపివేసిన, అనేక మార్పులకు దోహదం చేసిన కళా విషయిక చర్చలకు కారకులైనారు. వారి వాదాలు, వారి కళారూపాలు ఎలా ఉన్నా, ఆయా కళావిధానాల అవలంబనవల్లా, ఆయా ఇజాల వ్యాప్తివల్లా వారికి లభించిన అఖండ ఖ్యాతి మాత్రం అందర్నీ ఆకర్షించి, చకితుల్ని చేసి, ఆలోచింపజేసి అనుకరణకు ప్రోత్సహించింది. ప్రస్తుత తరం ఆంధ్ర చిత్రకారులలో ఈ 'ఇజాల' ప్రభావం ఎంతో కొంతైనా పడనివారరుదు.

మన సమకాలీనాంధ్ర చిత్రకళా స్వరూప, స్వభావాల పరిశీలనకు ముందింత పూర్వరంగమున్నది. ఈనాడే కళా ప్రదర్శనానికి వెళ్ళి చూసినా ఈ విషయం స్పష్టమవుతుంది. నిజానికీనాడు మనలో ఉన్న చిత్రకారులెవరో, వారి కృషి ఏ విధంగా కొనసాగుతున్నదో తెలుసుకోవటానికి పరిమిత పరిధిలోనే అయినప్పటికీ నేడు జరుగుతున్న చిత్రకళా ప్రదర్శనాలే మార్గంగా ఉన్నాయ్. గతంలోలా పత్రికాముఖంగా విరివిగా ప్రచురితమయ్యే అవకాశాన్ని నేటి చిత్రకళ కోల్పోయింది. నేటి మన పత్రికలలో విరివిగా వెలువడుతున్న యువ చిత్రకారుల "డ్రాయింగ్స్" ఆనాటి "పెయింటింగ్స్" యొక్క ప్రచురణ స్థానాన్నాక్రమించాయ్. ఇందుకు కారణం ఈనాటి చిత్రకారుల చిత్రణా విధానంలో వెల

కొన్ని విపరీతమైన మార్పులేగాని వేరు గాదు

గతంతో పోలిస్తే ఆంధ్ర చిత్రకారుల సంఖ్య ఈనా డెన్నో రెట్లు పెరిగింది. యువ చిత్రకారు లనేకులు రూపొందారు. వీరందరూకూడా వివిధ చిత్రకళా శాలల లోనూ క్రమపద్ధతులలో శిక్షణనందిన సమర్థులే. సాంకేతిక ప్రమాణాలదృష్ట్యా మరే ప్రాంత చిత్రకారులకు తీసిపోని నైపుణ్యం గలవారే! వీరందరి కుంచెల నుండీ అసంఖ్యాకంగా చిత్రాలు వెలువడు తూనే ఉన్నాయ్. వీరిలో అనేకులు ప్రశంసలకూ, పురస్కారాలకూ పాత్రులై ఉత్సాహోన్నందుకో గలుగుతూ ఉన్నారు కూడా!

గతంలో ఆంధ్ర చిత్రకళా రంగంలో ఘనమైన కృషి చేసినవారిలో కె. శ్రీనివాసులు, అ. పైడిరాజు, హెచ్. వి. రాంగోపాల్, భాగేశ్వరశర్మ, ధనపాల్ వంటి బహుకొద్దిమంది మాత్రమే నేటికి ఉత్సాహంగా, కాలంతోపాటు క్రొత్తదనాన్ని సంతరించుకుంటూనే వ్యక్తిత్వాన్నికూడా నిలబెట్టుకోగల విధంగా తమ కళాకృషిని కొనసాగిస్తున్నారు. మిగతా వారిలో చాలామంది కళా సృష్టి వివిధ రంగాలకూ అంకిత మవుతూన్నది. కొందరంటున్నట్లు ప్రముఖ చిత్రకారులు చాలామంది ఈనాడు కళాసృష్టిపట్ల నిర్లిప్తతను ప్రదర్శించటానికి కారణం కేవలం వారి నిర్లక్ష్య వైఖరే ననుకోవటం ఆత్మవంచన చేసుకోవటమే కాగలదు.

ఉత్సాహంగా కళాకృషిని కొనసాగించగల అవకాశాలీనాడు పరిమితమైనాయ్. ఇందు కనేక కారణాలున్నాయ్. వాటిలో ముఖ్యమైనది నేటి కళ కొక లక్ష్యం అంటూ లేకుండా పోయి కేవలం ఆర్ట్ ఎగ్జిబిషన్లలో ప్రైజులకోసమే కళ అన్నంతగా వాతావరణం రూపు దిద్దుకుని బలపడటమే. ఈ సంగతి స్వయంగా చిత్రకారులందరూకూడా ఎంతో బాధతోనూ, అసంతృప్తితోనూ అంగీకరిస్తున్నదే!

సామాజిక వ్యవస్థ, తత్సంబంధ ఫలితమైన కళారంగ పరిస్థితులు, ఇటీవలి కాలంలో విరివిగా వ్యాప్తిలోకి వచ్చిన కళా ప్రయోజనాన్ని గురించిన పాశ్చాత్యుల భావాలు, కళా విలువలను గురించిన వారి సూత్రీకరణలు, వాటి కనుగుణంగా సాగిన వారి కళాసృష్టి, అవి సాధించుకున్న పేరు ప్రతిష్ఠలు సహజంగానే యువ కళాకారులను ఆకర్షించి తమ కర్తవ్యం, కళామార్గం ఏమిటో తేల్చుకోలేని అయోమయావస్థలోకి దింపినాయ్.

అనేక కారణాలవల్ల ఆధునిక చిత్రకళ యాంత్రికంగానే పాశ్చాత్య చిత్రకళను అనుకరించుతూ వస్తున్నది. ఈ పరిస్థితి కేవలం ఏ ఒక్క ప్రాంతానికో మాత్రమే పరిమితమై లేదు.

పాశ్చాత్య కళా విధానాలలో అనేక ఇజాలూ, తద్భవమైన చిత్రణామార్గాలూ ప్రసిద్ధమై ఉన్నాయ్. జాగ్రత్తగా పరిశీలిస్తే వాటి కన్నింటికీకూడా ఏదో ఒక లక్ష్యం, పరమార్థం గోచరిస్తూనే ఉంటుంది. అయితే, ఆయా విధానాలను సూక్ష్మంగా వివేచన చేసి, వాటిలోగల సుగుణాలను స్వీకరించి స్వకీయ మార్గంలోకి అనువర్తింప జేసుకోలేకపోవటంలోనే నేటి యువ చిత్రకారులలోగల లోపం బయట పడుతూన్నది.

ఈ పరిస్థితి నధిగమించినవారే సమర్థవంతులైన చిత్రకారులుగా పేరొంది ఈనాడీ రంగంలో నిలద్రొక్కుకున్న వారంతా. ప్రస్తుత ఆంధ్ర చిత్రకళా రంగాన్ని



గొల్లభామలు – శ్రీ కె. రాజయ్య

సమీక్షించుకొంటూంటే నేటికీ ఉత్సాహంగా కృషిచేస్తూ, ఒడిదుడుకులను తట్టుకుంటూ, ఆధునిక రీతులను అర్థంజేసుకుని, సాంప్రదాయాన్ని వదలుకోకుండా ప్రాతక్రొత్తల సమన్వయంతో నిండుదనాన్ని, క్రొత్తదనాన్ని, వ్యక్తిత్వాన్ని ప్రదర్శింపగలుగుతూ, ఇప్పటికే ప్రశంసనీయమైన ప్రమాణాలనందుకున్నవారుగా కె. శ్రీనివాసులు, అ. పైడిరాజు, హెచ్. వి. రాంగోపాల్, భాగేశ్వరశర్మ, ధనపాల్, వడ్లమాని మధుసూదనరావు, కొండపల్లి శేషగిరిరావు, బదరీనారాయణరావు, పి. టి. రెడ్డి, ఎస్. వి. రామారావు, ఎం. రాజాజీ, వై. హనుమాన్‌సూరి, శీలా వీర్రాజు, కస్తూరి భాస్కరరావు, వర్ధూ శ్రీనివాసశర్మవంటి బహుకొద్దిమంది గోచరిస్తారు.

అయితే, వీరేగాక మరెందరో చిత్రకారులు పెద్దలూ, యువకులూకూడా తెలుగుదేశమంతటా ఉన్నారు. విజయనగరం, రాజమండ్రి, హైదరాబాదులలో గల చిత్రకళాశాలల్లో మరెందరో యువచిత్రకారులు రూపొందుతున్నారు. కాని, శోచనీయమైన విషయమేమంటే ఒకనాడాంధ్ర చిత్రకళా రంగంలో బహుకొద్దిమందిమాత్రమే కృషిచేస్తున్న ఒకదశలో బహుముఖంగాప్రదర్శితమైన ఉత్సాహం, వైవిధ్యం, సృజనాత్మకతలనేవి ఈనాడింతమంది ఉండికూడా కనుపించటం లేదు. అలాంటి వైవిధ్యాన్ని, సృజనాత్మకతను ప్రదర్శింప గలిగినవారే ఈనాడీ రంగంలో ప్రముఖ చిత్రకారులుగా నిలచిఉన్నవారంతా. కాని, వీరి సంఖ్య మొత్తం చిత్రకారుల సంఖ్యతో పోలిస్తే బహుస్వల్పం.

నేటి ఆధునికాంధ్ర చిత్రకళను పరిశీలిస్తే ప్రధానంగా రెండు వైఖరులు ద్యోతకమవుతాయ్.

సాంప్రదాయిక విధానంగా పేర్కొనబడుతూన్న సాధారణ చిత్రణా విధానంలోనే చిత్రిస్తూ, వర్ణ, రేఖా రూపకంగా నూతనత్వాన్ని ప్రదర్శింపజూచే వైఖరి ఒకటి ఉన్నది. ఇదే సిసలైన భారతీయ విధానంగా కొందరు పేర్కొంటూ ఉంటారు. కాని, ఆధునిక కళా ప్రక్రియల విజృంభణవల్ల దీనికి ప్రాధాన్యత తగ్గిపోయింది. ఈనాడీ మార్గాన్ని బహుకొద్దిమంది మాత్రమే అవలంబిస్తున్నారు. వారిలోనూ ఏ కొద్దిమందో మాత్రమే ప్రశంసనీయమైన ఫలితాలను సాధించగలుగుతున్నారు.

ప్రాచ్య, పాశ్చాత్య కళారూపాలలో గల విశిష్టతలపట్ల సరియైన అవగాహనతో రెండింటాగల ఉత్తమ లక్షణాల సమ్మేళనతో స్వకీయ శైలి అని చెప్పుకోదగినంత ప్రతిభావంతంగా చిత్రించగలగటం మరొకటి. ఈ విధానమే సర్వేసర్వత్రా ఈనాడు ప్రశంసాపాత్ర మవుతూన్నది. ఈనాడాంధ్ర చిత్రకళా రంగంలో ప్రముఖులుగా నిలచిఉన్నవారంతా అటువంటి నూతనత్వాన్ని, సామర్థ్యాన్ని ప్రదర్శించుతున్నవారే!

పాశ్చాత్య కళలో ప్రదర్శితమయే సాంకేతిక విలువలకు చకితులై, వాటికి గల ప్రపంచ వ్యాపిత ప్రసిద్ధికి, తత్ప్రభావానికిలోనై యథాతథంగా వాటిననుకరించజూసే మనస్తత్వం కూడా చాలామంది యువ చిత్రకారులలో వున్నది. ఈనాడు వీరి సంఖ్యే అధికంగా కనిపిస్తూన్నది. వీరి చిత్రాలలో ఇటు భావంగాని, అటు చిత్రణా మార్గంగాని ప్రాధాన్యత వహిస్తాయని చెప్పటానికవకాశంలేదు. తమ కళాసృష్టిని గురించి, తమ కళా విధానాలను గురించి తామే వివరించుకోలేనంతటి నిస్సహాయస్థితిలో వీరి చిత్రరచన సాగుతూన్నది. అందుకు కారణం కేవలానుకరణం బనా ఆయా పాశ్చాత్య కళా ప్రక్రియలను గురించిన సమగ్రమయిన అధ్యయనం లేకపోవటమే.

ఈ కారణం వలననే ఇటీవలి కాలంలో జరుగుతూన్న ఏ కళా ప్రదర్శనానికి వెళ్లి

---

## స్వీకారం

**అల్బర్ట్ ష్వైజర్**

రచయిత: శ్రీ 'విరించి', పేజీలు: 48, వెల: 0-75 న.పై., ప్రతులకు: శ్రీ గోదా గ్రంథమాల, శ్రీమన్నారాయణపురము, ఉల్లిపాలెము పోస్టు, దివి తాలూకా, కృష్ణా జిల్లా.

**మధుర గీతులు**

సంపాదకు: మురారి - వడ్డెంపూడి, పేజీలు: 66, వెల: 1-25, ప్రతులకు: యువ రచయితల సమితి సహకార ప్రచురణ, గుంటూరు.

**నాను మహిమ**

రచయిత: శ్రీ నల్లాన్ చక్రవర్తుల వేంకటనరసింహాచార్యులు, పేజీలు: 68, వెల: రూ. 1-00, ప్రతులకు: శ్రీ గోదా గ్రంథమాల, శ్రీమన్నారాయణపురము, ఉల్లిపాలెము పోస్టు, దివి తాలూకా, కృష్ణా జిల్లా.

* * *

**కుబ్జ శతకము**

పేజీలు: 22, వెల: 25 న. పై.

**శ్రీ రామ తారావళి**

పేజీలు: 24, వెల: 37 న. పై.

**శ్రీ వేణుగోపాల నక్షత్రమాల**

పేజీలు: 14, వెల: 25 న. పై.

**శ్రీ శ్రుతగిరిపుర రామలింగేశ తారావళి**

పేజీలు: 8, వెల: 13 న. పై.

**విజయ వీణ**

పేజీలు: 68, వెల: 1-00.

**శ్రీ భూలోకమాత శతకము**

పేజీలు: 22, వెల: 50 న. పై.

పై ఆరు గ్రంథముల రచయిత: కీ॥ శే॥ శ్రీ పొత్తూరి వీరరాఘవరాయ కవి, ప్రాప్తిస్థానం: శ్రీ వీరరాఘవరాయ కవీంద్ర గ్రంథాలయము, సంతమాగులూరు పోస్టు, గుంటూరు జిల్లా.

చూసినా అందులోగల చిత్రాలలో అధిక భాగం ఒకే మూసలో తయారైన వాటిలా గోచరిస్తాయ్. కనుపించవలసి నంతగా ఉత్సాహంగాని, వైవిధ్యంగాని ప్రదర్శిత మవదు.

ఈ రకమైన చిత్రాలలో భావ ప్రాధాన్యత గాని, సాంకేతిక నైపుణ్యంగాని ఎన్నదగినంతగా ప్రదర్శితం గావు. చిత్రణా విధానం ఎంత క్లిష్టంగా, అగమ్యగోచరంగా ఉంటే అంత ఘనమైనదిగా భావించే మనస్తత్వమే ఇందుకు కారణం. ఈరకం చిత్రకారులంతా ఒకే ఒక మాట చెపుతుంటారు. "మనం పాటలోని మిత్తం లేకుండానే కేవలం సంగీత స్వరాలనే విని ఆనందించగలగటం లేదా! అలాగే చిత్రంలో కూడా భావంతో నిమిత్తం లేకుండా అందులోని కళా ప్రమాణాలనే చూసి ఆనందించవచ్చు గదా! అదే మా విధానం!" అని.

నిజమే! సంగీతానికొక అర్థం అంటూ ఏమీ లేనప్పటికీ ఆయా స్వరాలలో, వాటి కలయికలో ఉద్భవమయే లయ మనల్ని స్పందింపజేస్తూ వున్నది. ఆ విధంగా మన కానందం లభ్యమవుతూ న్నది. అటువంటి పని చిత్ర కళలోనూ కూడా వివిధ వర్ణాల హృదయంగమమైన సమ్మేళన ద్వారా సుసాధ్యమే. అటువంటి అపూర్వ వర్ణ సమ్మేళనాలు అనేక మంది చిత్రకారుల కుంచెల నుండి వెలువడి అందుకు నమూనాలుగా నిలచి వున్నాయి కూడా! కాని సమస్య అది గాదు. ఇలా వాదించే వారు తమ చిత్రాలలో అటువంటి వర్ణసమ్మేళనాన్ని సాధించగలుగుతున్నారా అన్నదే ప్రశ్న!

ఆధునిక కళ అనేది అర్థంపర్థం లేని ఒక ప్రక్రియ అనుకోవటంలోనే ఈ శోచనీయావస్థ ఎదురవుతూన్నది. కళలో క్రొత్తదనంకోసం జరిగే ప్రయత్నం ఈనాటిది గాదు. ప్రాచీన కళారూపాలలో సైతం అటువంటి ప్రయత్నాలూ, ప్రయోగాలూ అనేకం గోచరిస్తాయ్. మార్పుకోసం, క్రొత్తదనంకోసం, అసాధ్యమనుకుంటున్న వాటిని సాధ్యం జేయటంకోసం జరిగే ప్రయత్నం అనాది నుండి సాగుతూనే వున్నది. ఆ ప్రయత్నంలో, సంఘర్షణలో పుట్టినవే నేటి ఆధునిక కళా ప్రక్రియలన్నీ.

ఒకప్పుడు చిత్రకళ ద్వారా ప్రతిఫలింపజేయటం అసాధ్యమనుకొన్న విషయాలను, భావాలను ఈనాడీ నూతన ప్రక్రియల అవలంబనతో ప్రేక్షకుల నాశ్చర్య చకితులను, ఆలోచనా పరులను చేయగల విధంగా రూపించగలగటం సాధ్యమవుతూన్నది. ఈ సంగతి అందరూ అంగీకరించినదీ, విశ్వవ్యాప్తంగా గౌరవింపబడుతూన్నదీనూ.

కాని, నేటి మన కళాభిమానులలోనే గాక అనేక మంది యువ కళాకారులలో సైతం ఆధునిక కళ అంటే అదొక ప్రహసన మన్నట్లుగా చూసే నిర్లక్ష్య వైఖరి, అసహిష్ణుత నెలకొన్నది. అందుకు బాధ్యత ఆయా కళా ప్రక్రియలదెంత మాత్రమూ కాదు, వాటిని సరిగా అర్థం జేసుకొని వాటిలోగల సద్గుణాల నవగతంచేసుకోలేక పోతూన్న చిత్రకారులు మాత్రమే అందుకు బాధ్యులు.

సాంకేతిక నైపుణ్యం దృష్ట్యాచూస్తే నేటి మన చిత్రకారులందరూ కూడా అత్యంత శక్తిమంతులైన వారే! వారి చిత్రరచనలన్నింటా ఆ విషయం ప్రస్ఫుటమవుతూనే వున్నది.

దానికితోడు ఆధునిక ప్రక్రియలపట్ల నిర్లక్ష్యంతో కూడుకున్న అనుకరణగాక, సరియైన అవగాహన, తమ కళపై తామే నమ్మకం, గౌరవం ప్రదర్శింపగలిగి నప్పుడు ఆధునికాంధ్ర చిత్రకళా స్వరూపమే మారిపోయి క్రొత్త వెలుగులను సంతరించుకొని మొత్తం చిత్రకళారంగమే అత్యున్నత శిఖరాల నందుకోగలదనటంలో సందేహం లేదు.

"శ్రమజీవన సంగీతం" – శ్రీ పి. టి. రెడ్డి



# వెలుగు బాటలు

కె. వి. భాస్కరరావు

నవంబరు మాసం బహుముఖ ప్రాముఖ్యం కలది. రాష్ట్రాల పునర్విభజన, ఆంధ్ర ప్రదేశ్ అవతరణ ఈ మాసంలోనే జరిగాయి. ఇక దేశస్థాయిలో సహకార సప్తాహంకూడా ప్రతియేటా నవంబరునెలలోనే జరుగుతోంది. ఈ సంవత్సరం 'సహకారవారోత్సవం' దేశమంతటా ఈ నెల 2 నుండి 8 వరకు జరిగింది. దీనివల్ల సహకార ఉద్యమం, దాని ప్రగతి ప్రజలకు, ఆ రంగంలో పనిచేసే వివిధ కార్యకర్తలకు విపులంగా తెలియజేయడానికి అవకాశం కలుగుతుంది. సంక్షేమ రాజ్యంలో సహకార రంగపు ప్రాముఖ్యం యెంతైనా వుంది. సమాజంలో గల ఆర్థిక వ్యత్యాసాలను క్రమబద్ధంగా తొలగించడానికి యిది ఉత్తమమార్గం.

ఆంధ్ర ప్రదేశ్‌లో సహకార రంగం పురోగమిస్తోంది. రాష్ట్ర ఆర్థిక, సాంఘిక విషయాలలో దీని ప్రభావం కన్పిస్తోంది. 1962 జూన్ చివరకు రాష్ట్రంలో వివిధ రకాల సహకార సంఘాలు 27,936 వున్నాయి. వీటిసభ్యత్వం 56 లక్షలు; పెట్టుబడి రు. 148.88 కోట్లు, అంటే దేశం మొత్తంలోగల సంఘాలలో 8 శాతం, సభ్యత్వం, పెట్టుబడిలో 10 శాతం మన రాష్ట్రంనుండి వుంటున్నమాట.

సహకార విధానంలో పెరుగుతున్న మార్పుల దృష్ట్యా మూడవ ప్రణాళికలో ఈ రంగంలోని వివిధ కార్యక్రమాలకు రు. 11.61 కోట్లు కేటాయించబడింది. గత సంవత్సరంలోను, ముఖ్యంగా అత్యవసరస్థితి ప్రారంభమయ్యాక ప్రశంసనీయమైన నిర్ణయాలు తీసికొనబడ్డాయి.

మన రాష్ట్రం ముఖ్యంగా వ్యవసాయ ప్రధానమైనది. జనాభాలో సుమారు 70 శాతం వ్యవసాయం లేదా అనుబంధ వృత్తులపై ఆధారపడినవారే. వ్యవసాయ ప్రధానమైన మన రాష్ట్రంలో పరపతి సౌకర్యం రైతులకు ఎంతైనా మేలుచేస్తుంది. ఆంధ్ర ప్రదేశ్‌లో 15 వేలకు పైగా ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘాలు పనిచేస్తున్నాయి. వీటిలో 18 లక్షల మంది సభ్యులున్నారు. ఈ సంఘాలు 90 శాతం గ్రామాలకు, 34 శాతం వ్యవసాయ దారులకు వర్తిస్తాయి. 1962–63 లో వ్యవసాయ దారులకు స్వల్పకాల, మాధ్యమిక ఋణాల క్రింద 22 కోట్ల ధనం ఇవ్వబడింది. 1963–64 అంతానికి రు. 25 కోట్లు, మూడవ ప్రణాళిక అంతానికి రు. 45 కోట్లు పరపతి సౌకర్యం కల్పించాలని ప్రభుత్వ లక్ష్యం.

గ్రామీణ సహకార సంఘాలు, కేంద్ర, అపెక్స్ బ్యాంకుల ఆర్థిక స్థితిని పెంపొందించేటందుకు వాటి వాటాధనానికి ప్రభుత్వం తోడ్పడుతోంది. ఇప్పటికి రు. 2.90 కోట్లు యిందుకోసం యివ్వబడింది. ముమ్ముందు కూడ అవసరాల కనుగుణంగా ధన సహాయం జరుగుతుంది. గ్రామీణ సహకార సంఘాల వాటాధనం, డిపాజిట్లు పెంచేటందుకు లక్ష్యాలు నిర్ణయించబడ్డాయి. ఇందువల్ల గత సంవత్సరాంతానికి వాటికి చెల్లించిన వాటాధనం 4 కోట్లు, డిపాజిట్ రు 1 కోటి చేకూరింది.

1963–63 అంతానికి సభ్యుల వాటాధనం రు. 4.5 కోట్లకు, డిపాజిట్ రు. 125 లక్షలకు పెంచాలని నిర్ణయించబడింది. రాష్ట్రంలో రెండు అపెక్స్ సహకార బ్యాంకులున్నాయి. ఐతే ప్రతి రాష్ట్రంలోను ఒకే రాష్ట్ర సహకారబ్యాంకు వుండాలని రిజర్వుబ్యాంకు సూచించింది. తదనుగుణంగా 1963 ఆగస్టులో రాష్ట్రంలో ఒకే బ్యాంకు రూపొందింప బడింది.

భూమి అభివృద్ధి మొదలైన పనులకు కావలసిన దీర్ఘకాలపు ఋణాలను భూమి తనఖా బ్యాంకులు ఇస్తాయి. రెండవ ప్రణాళిక ముగిసేనాటికి రాష్ట్రంలో 104 ప్రాథమిక భూమితనఖా బ్యాంకులు వుండేవి. తరువాత మరో 14 బ్యాంకులు కొత్తగా స్థాపించబడ్డాయి. ఈ బ్యాంకులిచ్చే ఋణాలు కూడ క్రమంగా పెరిగాయి. 1950–51 లో రూ. 36.7 లక్షలు అప్పులివ్వగా 1961–62లో రూ. 300 లక్షలు అప్పుగా యివ్వబడ్డాయి. 1962–63 లో రూ. 304 లక్షల వరకు అప్పు యివ్వడం జరిగింది. 1963–64 లో యిందుకు రూ 450 లక్షలు, ప్రణాళిక ఆఖరు సంవత్సరం నాటికి రూ. 600 లక్షలు యివ్వాలని లక్ష్యం. వివిధ ప్రాజెక్టుల క్రింద అధికంగా పొలాలను సాగుకు తేవాలన్న ఆశయానికి ఈ పథకం ఎంతైనా తోడ్పడుతుంది.

ఇటీవలి కాలంలో చేపట్టిన పథకాలలో టూసీ ప్రాజెక్టులో సంపూర్ణ ఆర్థిక కార్యక్రమం ముఖ్యమైనది. భారతదేశంలోనే యిదితొలిగా ప్రారంభమైనదని చెప్పవచ్చు. దీని ప్రకారం 5 సంవత్సరాల కాలంలో రూ. 75 లక్షలు దీర్ఘకాలపు ఋణంగా యివ్వబడుతుంది. ఇందువల్ల 30 వేల ఎకరాల మాగాణి సాగులోకి వస్తుంది. 1963 ఏప్రిల్ వరకు ఈ ప్రాజెక్టులో రూ 23.35 లక్షలు దీర్ఘకాలపు ఋణంగా ఇవ్వబడింది. నాగార్జునసాగర్ ప్రాజెక్టులోకూడా యిలాంటి పథకం అమలు జరుపడానికి పరిశీలన జరుగుతోంది.

రైతులు తాము ఉత్పత్తిచేసే ధాన్యాలను పదిలపరచి, సరసమైన ధరలకు విక్రయించేటందుకు సహకార విక్రయ సంఘాలు స్థాపించబడ్డాయి. అలాంటి సంఘాలు రాష్ట్రంలో 227 ప్రధాన కేంద్రాలలో వున్నాయి. ఇంతవరకు వ్యవసాయ ఉత్పత్తి విక్రయాన్ని కొద్ది సహకార సంఘాలు మాత్రమే చేస్తుండేవి. 1962-63 లో రూ. 1 కోటి విలువగల వస్తువులను 6 సంఘాలు కొన్నాయి. మూడవ ప్రణాళిక అంతానికి ఈ మొత్తాన్ని 23 కోట్లకు పెంచాలని వుద్దేశించ బడింది. 1963-64 చివరకు ఈ కార్యక్రమం క్రింద రూ. 11 కోట్లు నిర్ణయించారు. విక్రయ సౌకర్యాలు పెంపొందనిదే పరపతి సౌకర్యాలు వ్యాప్తిచేయడం కష్టమని గుర్తింపబడింది.

మూడవ ప్రణాళికలో ప్రతిజిల్లాలోనూ పైలెట్ ప్రాజెక్టుక్రింద మొత్తం 200 సహకార వ్యవసాయ క్షేత్రాలను నిర్వహించాలని నిర్దేశింప బడింది. ఇతర ప్రాంతాలలోకూడ యిలాంటి సంఘాలు స్థాపించబడతాయి. ఈ సంఘాలకు కావలసిన ధనసహాయానికి తగినపథకాన్ని ప్రభుత్వం రూపొందించింది. 1961-62, 1962-63 సంవత్సరాలలో 10 జిల్లాలలో పైలట్ ప్రాజెక్టులు ప్రారంభింపబడి 24 సంఘాలు స్థాపింప బడ్డాయి. ప్రాజెక్టు బయట ప్రాంతాలలో 48 సంఘాలు నిర్వహింపబడ్డాయి. సహకార వ్యవసాయ సంఘాల కార్యదర్శులకు రాజేంద్ర నగర్‌లో శిక్షణనిచ్చే కార్యక్రమాన్ని ప్రభుత్వం ఇటీవల మంజూరు చేసింది. అలాంటి మొదటి శిక్షణ శిబిరం 1-6-1963 న ప్రారంభింపబడింది. రైతుల సంపూర్ణ సహకారం పైననే ఈ కార్యక్రమం ఆధారపడివుంది. అందుకు కావలసిన చర్యలన్నీ తీసుకొనబడుతున్నవి. సహకార వ్యవసాయంవల్ల ఉత్పత్తి పెంపొందడమేగాక, రాబడి, ఉపాధి అవకాశాలుకూడా పెరుగుతాయి.

దైనందిన వాడకపు వస్తువుల ధరలను అదుపులో పెట్టేందుకు వినిమయ సంఘాలు ఉపయోగపడ్డాయి. జాతీయ అత్యవసర స్థితి దృష్ట్యా వీటి ఆవశ్యకత మరింత హెచ్చింది. సామాన్య ప్రజలకు, స్థిరమైన రాబడివచ్చే ప్రభుత్వోద్యోగులు మున్నగు వారికి యివి ప్రోత్సాహాన్ని కల్గించాయి. అన్ని జిల్లా కేంద్రాలలోను, విజయవాడలోను ప్రభుత్వోద్యోగులకు వినిమయదార్ల సహకార సంఘాలు స్థాపింపబడ్డాయి. సామాన్య ప్రజల ఉపయోగార్థం ప్రభుత్వం మరొక పథకాన్ని మంజూరు చేసింది. 50 వేలు జనాభా దాటిన ప్రతినగరం, పట్టణంలోను వినిమయ సంఘాలు ఏర్పాటవుతాయి. 1962-63 లో రాష్ట్రంలోని 5 ప్రాంతాలలో ఈపథకం అమలుజరుపబడింది. 1963-64లో మరొక 11 కేంద్రాలకు దీనిని వ్యాప్తి చెయ్యాలని సంకల్పం. నిత్యావసర వస్తువులను గ్రామాలలో గ్రామీణ ప్రాథమిక విక్రయ సంఘాల ద్వారా పంపిణీచేసే కార్యక్రమం ఆలోచనలో వుంది.

కార్మిక కంట్రాక్టు సంఘాలు, అటవీ సంఘాలు, జాలరి సంఘాలు, పాలసరఫరా సంఘాలు, గృహనిర్మాణ సంఘాలు, రిక్షా వారి సంఘాలు మున్నగు వాటికి సహకార పద్ధతిని ఆర్థిక, తదితర వసతులను కల్పించేటందుకు ప్రభుత్వం కృషి చేస్తోంది. చేనేత రంగంలో సహకారశాఖ సాధించిన ప్రగతి ప్రశంసనీయమైనది. నేత సహకార సంఘాల సాలుసరి ఉత్పత్తి రు 6.5 కోట్ల వరకు హెచ్చింది. ప్రస్తుతం రాష్ట్రంలో 3 సహకార నూలు మిల్లులు పనిచేస్తున్నాయి. మరొక రెండు మిల్లులను స్థాపించడానికి ప్రయత్నం జరుగుతోంది.

ఈ విధంగా సహకార రంగం వివిధ శాఖల ద్వారా తన లక్ష్యాలను చేరుకొంటోంది. ప్రజలు దీని ఆశయాలను గ్రహించి విశేషంగా పాల్గొన గల్గిననాడు ఫలితాలను మరింత త్వరగా సమాజంలోని అందరూ పంచుకొనగలరు. ఈ కృషిలో సహకార వారోత్సవాలు ఎంతైనా తోడ్పడుతాయి. ఒక్క వారమేకాదు; ప్రతి వ్యక్తీ, మరో వ్యక్తికి ప్రతినిత్యం దీని సందేశాన్ని కొనిపోవాలి. ఆనాడే జీవితంలో సహకారం విలువ తెలుస్తుంది.




నూతన ప్రచురణ: "రణభేరి" వెల 00-25 న.పై

విఖ్యాతాంధ్రకవులు

జాతిమైక్యత, రక్షణోద్యమ సందేశాలతో రచించిన ఉత్తేజకరాలైన

గేయముల రెండవసంపుటి:

ప్రతులకు: సమాచార పౌరసంబంధాలశాఖ

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదు.

(14 వ పేజీ తరువాయి)

దక్షిణ రొడీషియా

శ్వేతజాతి పాలితమైన దక్షిణ రొడీషియాకు "స్వాతంత్ర్యం" యివ్వకుండా ఆపు చేసి, ప్రస్తుతం మధ్య ఆఫ్రికా ఫెడరేషన్‌కి అదియిచ్చిన మిలిటరీ దళాలను యీ సంవత్సరంలో మరికొంత కాలం గడచినప్పుడైనా ఆ కాలనీకి తిప్పిపంప నిరాకరించమని ఇంగ్లండును కోరుతూ, గడచిన నెల ఐక్య రాజ్యసమితి జనరల్ అసెంబ్లీ తీర్మానించడంతో, దక్షిణ రొడీషియా ప్రజానీకానికై, వాస్తవమైన ప్రజాస్వామ్య స్వాతంత్ర్య సంపాదననిమిత్తం ఆఫ్రికా — ఆసియా దేశాలు నిరంతరం సాగించేకృషి ఒక నిర్దిష్టమైన మలుపు తిరిగింది.

దక్షిణ రొడీషియా రాజ్యాంగాన్ని రద్దు చేసి, సమస్త వర్గాలకు చెందిన ప్రజా ప్రతినిధులతో కలసి కొత్తదానిని తయారు చేయాలని తీర్మానంలో కోరబడింది. ఇంగ్లండు తన కాలనీకి సర్వసత్తాక ప్రభుత్వాధికారాలలో యే ఒక్కటినీ యివ్వకుండా, సమస్త ప్రజలకూ పూర్తి ప్రాతినిధ్యం వహించే ప్రభుత్వం యేర్పడేవరకూ వేచి వుండాలని చెప్పబడింది.

ఇంతకుముందు, భద్రతా సంఘంలో యిటువంటి తీర్మానం ఆమోదింప బడకుండా ఇంగ్లండు వీటో చేసింది. అసెంబ్లీలో, ఇంగ్లండు తాను "పాల్గొనదలంచలే"దని చెప్పి, ఆ విధంగా ఓటును బహిష్కరించింది.

మండలిలో ఇంగ్లండు వీటోను ప్రయోగించడం, కాలనీ భూభాగాలకు స్వాతంత్ర్యాన్ని యివ్వగలననే తన విధానానికి విరుద్ధంగా నడవడమేనని అసెంబ్లీలో తీర్మానాన్ని ప్రవేశపెట్టిన లైబీరియన్ ప్రతినిధి అన్నారు. ఇంగ్లండు తన వాదంలో, దక్షిణ రొడీషియాలో అత్యధిక సంఖ్యలో గల ఆఫ్రికావారికి నష్టం కలిగేట్టుగా ఐ. రా. చార్టరును తప్పుగా అనువర్తింపజానికి ప్రయత్నం చేసింది.

దక్షిణ రొడీషియాపై చట్టబద్ధమైన సమావేశాన్ని త్వరలో యేర్పాటు చేయాలని ఇంగ్లండును కోరుతూ జనరల్ అసెంబ్లీ నాలుగవ కమిటీముందు 22 ఆఫ్రికా — ఆసియా దేశాలూ, యుగోస్లావియా కలసి మరొక తీర్మానాన్ని ఉంచాయి. ఈ విషయంలో జనరల్ అసెంబ్లీ చేసిన వివిధ తీర్మానాలను ఇంగ్లండు అమలు జరుపలేదని విచారం వెల్లడించడం జరిగింది.

# కమ్యూనిటీ రేడియో సెట్లు

1963 ఆగస్టు నెలలో ఆంధ్ర ప్రదేశ్ లోని ఈ క్రింద పేర్కొన్న గ్రామాలలో, సంస్థలలో కమ్యూనిటీ రేడియో సెట్లను నెలకొల్పారు :-

శ్రీకాకుళం జిల్లా : సిరిపేట, రూంపల్లి, బెలగం పఠనాలయం, జగన్నాథపురం, బొందలుప్పి, సాంబర.

తూర్పు గోదావరి జిల్లా : సింగనరం.

కృష్ణాజిల్లా : గొసలపంచాయతీ బోర్డు (హరిజనవాడ), శ్రీరంగాపురం, పసలపూడి, గుంటకోడూరు, పత్తిపాడు, సెరికాలనపూడి, చోడవరం, పెనమలూరు, పెనుమల్లె II, పులపర్రు, గురజ, పెదగొన్నూరు, కొండవరం, మండపాకల II.

అనంతపురం జిల్లా : స్టేట్ ఆఫ్టర్ కేర్ హోమ్, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, అనంతపురం.

కర్నూలు జిల్లా : బనవసి.

మహబూబ్‌నగరం జిల్లా : తల్పనూర్, మద్దిగట్ల, బొల్లంపల్లి, ఆకుమనికుంట, వెన్నచెర్ల (నిమ్న తెగలు).

నల్గొండ జిల్లా : తొన్వకలాపురం, పాములపహాడ్, మాధాపురం, జిల్లా జైలు (నల్గొండ), సమాచారకేంద్రం(నల్గొండ), ముక్తాపురం, ఎర్రనాయగూడ.

నిజామాబాదు జిల్లా : మల్లూర్, కిష్టాపూర్, పెదవాల్గాడ్.

ఆదిలాబాదు జిల్లా : కొత్తమన్నూర్, బొరెగాం, నీరల.

కరీంనగర్ జిల్లా : జిల్లా సమాచార కేంద్రం, కరీంనగర్.

వరంగల్ జిల్లా : జిల్లా సమాచార కేంద్రం, వరంగల్, చిత్తకోడూరు.

# తెలుగన్న - వెలుగేను

 యశోకాంత్

తెలుగన్న వెలుగేను దేశంబు తెలుగేను
తెలుగు పేరెత్తితే - తేనెలై పారేను

గోదావరీతల్లి గొంతెత్తిపాడంగ
కృష్ణవేణీమాత ఉయ్యాల నూపంగ,
తుంగభద్రాతల్లి ఒడిలోన నిదురించి
బంగారుపంటలన్ పండించునాతల్లి॥
తెలుగన్న వెలుగేను

హరిణలోచనయైన ఆంధ్రమహాలక్ష్మి
మాతల్లిభారతికి భాగ్యాలకూతురై
జయ జయ నినాదాలు జగమెల్ల జేయంగ,
తరతరమ్ములనుండి తరలివస్తున్నాది॥
తెలుగన్న వెలుగేను

గాసటలు బీసటలు మాటాడువారికి
అర్థమిచ్చిన యట్టి ఆదినన్నయతెలుగు
కవిరాజు సీసాల గబ గబానిండింది
గోపన్న పాటలలో గొంతెత్తి పాడింది॥
తెలుగన్న వెలుగేను

ఒరుగల్లు పట్టణపు పొలిమేర భూమిలో
పోతన్న హాలముతో పొందుగా దిరిగింది
పోతన్న కలముతో నిండుగా మెలిగింది
తెలగాణ రత్నాలవీణ యని చాటింది॥
తెలుగన్న వెలుగేస

రారాజు కాలాన నిదుర మేల్కొని లేచి
విద్యానగర రాజవీధులం దిరిగింది
తిక్కన్న తిమ్మన గ్రంథాల నిండింది
కృష్ణరాయలచేతమన్ననలుపొందింది॥
తెలుగన్న వెలుగేన

తెలుగు బాలురతల్లి తెలుగు మాతల్లి
మము బెంచి పోషించు సాహిత్యమాత!
మాభాగ్య దేవతగ మాకు లభియించి
పిన్న పెద్దల చేత పూజింపబడుతోంది॥
తెలుగన్న వెలుగే

మందార మకరంద మాధుర్యములు నిండ
సంపంగి విరజాజి చేమంతి పూలతో -
కర్పూర హారతిని కరములం గైకొని
గొంతెత్తి చెల్లాయి గీతాలు పాడును

తెలుగన్న వెలుగేను దేశంబు తెలుగేను
తెలుగు పేరెత్తితే- తేనెలై పారేను

## తెలుపు నలుపు

## సాంకేతిక విద్యా విధానంలో గమనార్హమైన మార్పు

సాంకేతిక విద్యా చరిత్రలో కడచిన ఒక సంవత్సర కాలం చాలా ముఖ్యమైనది. సర్టిఫికెటు, డిప్లొమా, డిగ్రీ — ఈ అన్ని స్థాయిలలోనూ కోర్సుల కాలపరిమితిలో నైతేనేమి, బోధనా విషయంలోనైతేనేమి సాంకేతిక విద్యా విధానం చాలా మార్పుజెందింది. దేశంలో జాతీయ అత్యవసర స్థితి వల్ల ఏర్పడిన ప్రస్తుత పరిస్థితుల దృష్ట్యా ఈ మార్పు అవసరమైంది.

సాంకేతిక విద్యా కార్యక్రమానికి ఇతోధిక ప్రాముఖ్యత నివ్వడంతో పాటుగా, రక్షణ, పరిశ్రమల తక్షణావసరాలను దీర్ఘకాలికావసరాలను ఆదుకోవడానికి వీలుగా అంగబలగానికి ఎంత శీఘ్రంగా, పటిష్ఠంగా శిక్షణ ఇవ్వడానికి వీలవుతుందో ఇప్పుడు పరిశీలించబడుతున్నది. ఈ దృక్పథంతోనే సాంకేతిక విద్యా కార్యక్రమాన్ని రూపొందించడం జరిగింది.

### డిగ్రీ కోర్సుల శిక్షణా కార్యక్రమం

రాష్ట్రంలోని ఇంజనీరింగ్ కళాశాలల ప్రీ ఫైనల్, ఫైనల్ ఇయర్ తరగతుల కాలపరిమితిని తగ్గించే నిమిత్తం, పబ్లిక్ సెలవులు ఒనహా వేసవి తదితర సెలవులను చాలా వరకు తగ్గించడానికి నిర్ణయించడంజరిగింది. 1963 మే నుంచి రాష్ట్రంలోని అన్ని ఇంజనీరింగ్ కళాశాలల్లోనూ ఈ కార్యక్రమాన్ని అమలు పరుస్తున్నారు.

### సైన్సు పట్టభద్రులకు మూడు సంవత్సరాల కోర్సు

సమర్థుడైన ఇంజనీరుకు సైన్సు విషయాల అధ్యయనం అవసరంగా పరిగణించబడింది కాబట్టి ఇంజనీరింగ్ కోర్సుల సైన్సు విషయాలను అభివృద్ధి పరచవలసిన ఆవశ్యకతను గూర్చి అఖిలభారత సాంకేతిక విద్యామండలి విపులంగా చర్చించింది. ఈ ఉద్దేశంతో మండలి ఒకనిపుణుల సంఘాన్ని నియమించింది. సైన్సు పట్టభద్రులకు ఎయిరోనాటికల్, మారీన్, మెటలార్జీ, కెమికల్ ఇంజనీరింగ్ మొదలైన నిర్దిష్ట ఇంజనీరింగ్ శాఖలలో శిక్షణ ఇవ్వవచ్చునని ఈ సంఘం తన నివేదికలో సూచించింది. ఈ సంఘం సిఫార్సులను శాస్త్రీయ పరిశోధన, సాంస్కృతిక వ్యవహారాల మంత్రిత్వ శాఖ పరిశీలిస్తున్నది. ఈ లోగా జాతీయ అత్యవసర పరిస్థితి వల్ల కమిటీ సిఫార్సులనుచాలా శీఘ్రంగా అమలు పరచడమేగాకుండా సివిల్, ఎలక్ట్రికల్, మెకానికల్, వంటి సాంప్రదాయమైన ఇంజనీరింగ్ శాఖలకు కూడా వీటిని విస్తరింపజేయడం అవసరమైంది.

కనుక భారత ప్రభుత్వం ఎం.పి. సి.తో బి.ఎస్సి. ప్యాసైన విద్యార్థుల కొరకు సివిల్, ఎలక్ట్రికల్, మెకానికల్, టెలీకమ్యూనికేషన్ వంటి సంప్రదాయకమైన ఇంజనీరింగ్ శాఖలలో మూడు సంవత్సరాల డిగ్రీకోర్సులను ప్రారంభించడం అవసరమని భావించింది. ఈ విధానంవల్ల మూడు సంవత్సరాల వ్యవధిలోనే ఇంజనీరింగ్ పట్టభద్రులను సిద్ధం చేయవచ్చు. రక్షణ సేనల తక్షణావసరాలను ఆదుకోవడానికి ఇది అత్యావశ్యకమైంది.

అందుచేత రాష్ట్రప్రభుత్వం బి. ఎస్సి. ప్యాసైన విద్యార్థుల కొరకు సివిల్, ఎలక్ట్రికల్, మెకానికల్, టెలీకమ్యూనికేషన్ ఇంజనీరింగ్ శాఖలలో మూడు సంవత్సరాల డిగ్రీకోర్సులను ప్రారంభించే పథకాలను ఆమోదించి 1963 వ విద్యాసంవత్సరం నుంచి కాకినాడలోనే ప్రభుత్వ ఇంజనీరింగ్ కళాశాలలో 90 సీట్లు (ఎలక్ట్రికల్ 30, మెకానికల్ 30 టెలీకమ్యూనికేషన్ 30). హైదరాబాదులోని ఉస్మానియా ఇంజనీరింగ్ కళాశాలలో 100 సీట్లు (సివిల్ 30, ఎలక్ట్రికల్ 30, మెకానికల్ 30, టెలీకమ్యూనికేషన్ 10), వాల్తేరులోని ఆంధ్ర విశ్వవిద్యాలయ ఇంజనీరింగ్కళాశాలలో 30సీట్ల (సివిల్)తో ఈ కోర్సులను ప్రారంభించింది. సైన్సు పట్టభద్రుల తొలి జట్టును ఈ కోర్సులలో 1963 ఆగస్టులో చేర్చుకోవడం జరిగింది.

### ఇంజనీరింగ్ కళాశాలల విస్తరణ

ప్రవేశాల సంఖ్యను హెచ్చించడంద్వారా ప్రస్తుత ఇంజనీరింగ్ కళాశాలలను విస్తృతీకరించే కార్యక్రమంక్రింద ప్రభుత్వం అనంతపురంలోని ఇంజనీరింగ్ కళాశాలలో వార్షిక ప్రవేశాల సంఖ్యను 150 నుంచి 170 కి పెంచడానికి ఇదివరకే ఆమోదించింది. అదనంగా చేర్చబడిన 30 స్థానాలలో 15 స్థానాలను ఎలక్ట్రికల్ ఇంజనీరింగ్ శాఖకూ, 15 స్థానాలను మెకానికల్ ఇంజనీరింగ్ శాఖకూ కేటాయించడం జరిగింది.

### పార్ట్‌టైమ్ డిగ్రీకోర్సులు

డిగ్రీ స్థాయిలో సాంకేతిక నిపుణులను ఇతోధికంగా సిద్ధం చేయడానికై భారత ప్రభుత్వం చేసిన సూచనలలో డిప్లొమా పొందినవారికొరకు పార్ట్‌టైమ్ డిగ్రీకోర్సులను ప్రారంభించడం ఒకటి. ఈ పథకాన్ననుసరించి ఇంజనీరింగ్‌లో డిప్లొమా పొందిన

వారికొరకు వారు ఇంజనీరింగ్‌లో బి. ఇ. డిగ్రీ పొందగలగడానికి వీలుగా ఇతోధికంగా సంస్థాగత శిక్షణ గరుపుతారు.

ఉస్మానియా విశ్వవిద్యాలయం ఈ ప్రతిపాదనను ఆమోదించి, పాఠ్యప్రణాళికను రూపొందించి, ఉస్మానియా ఇంజనీరింగ్ కళాశాలలో 1963 జూలై నుంచి ఈ పథకాన్ని అమలు పరచడానికి తగు ఏర్పాట్లు చేసింది. సివిల్, ఎలక్ట్రికల్, మెకానికల్, టెలీకమ్యూనికేషన్ శాఖలను ప్రారంభించి ఒక్కొక్కదానిలో 20 స్థానాలు కేటాయించింది. ఈ కోర్సు కాలపరిమితి 4½ సంవత్సరాలు ఈ నాలుగున్నర సంవత్సరాల కాలాన్ని ఒక్కొక్కటి 1½ సంవత్సరాల చొప్పున మూడు సెషన్లక్రింద విభజించారు. ఈ కోర్సులో విద్యార్థుల తొలిజట్టును 1963 ఆగస్టులో చేర్చుకోవడం జరిగింది.

## రెండేళ్ళ టెక్నీషియన్ కోర్సులు

ప్రస్తుతఆత్యయికస్థితి, డిప్లొమాస్థాయిలో సాంకేతిక విద్యావిధానాన్ని గూర్చి పునరాలోచించుకొనే అవసరాన్ని కలిగించింది. పరిశ్రమలలో మరింతగా సహాయపడడానికి ప్రస్తుతం ఇంజనీరింగ్‌లో వున్న మూడు సంవత్సరాల పోస్టు - డిప్లొమా కోర్సులను పునర్వ్యవస్థీకరించాల్సిన అవసరాన్నిగూర్చి సలహా యివ్వడం ఉచితమని భావించబడింది. అందుచేత రాష్ట్రంలోని ఎన్నిక చేయబడిన కొన్ని పాలిటెక్నిక్ టెక్నీషియను కోర్సులను ప్రయోగ పూర్వకంగా ప్రారంభించాలని ఉద్దేశింప బడింది. ప్రస్తుతం వున్న మూడేళ్ళ డిప్లొమా కోర్సులకు బదులు రెండేళ్ళ టెక్నీషియను కోర్సులను ప్రవేశపెట్టడం జరుగుతుంది. ఈ కొత్త కోర్సులలో ప్రవేశానికి పి. యు. సి. ప్యాసు అయి వుండాలి. అంచెలవారీగా రాష్ట్రంలోని ఆరు పాలిటెక్నిక్కులలో యిట్టి టెక్నీషియను కోర్సులను ప్రారంభించాలని ఉద్దేశించబడింది. 1963 జూలై నుండి రెండుప్రభుత్వ పాలిటెక్నిక్కులలో — ఒకటి హైదరాబాదులోనిది, మరి ఒకటి కాకినాడలోనిది — యీ కోర్సులను ప్రారంభించారు.

## డిప్లొమా కొరకు పార్టుటైమ్ కోర్సులు

పరిశ్రమలలో పనిచేస్తున్నవారికి పార్టుటైము డిప్లొమా కోర్సులను ప్రవేశపెట్టడం యీ 1963—64 సం. పు కార్యక్రమంలోని మరొక ముఖ్యమైన విషయం. ఈ పథకం వల్ల నిజంగా పరిశ్రమలలో పనిచేస్తున్న వారికి తమ సాంకేతిక యోగ్యతలను మెరుగు పరచుకోవడానికీ, తద్వారా సర్వీసులలో తమ వునికిని స్థిరపరచుకొని, అభివృద్ధి పరచుకోవడానికీ వీలుకలుగుతుంది. ఈ కోర్సులలో ప్రవేశానికి సాధారణంగా మెట్రిక్యులేషను పరీక్ష ప్యాసయివుండాలి. కాని కొన్ని కొన్ని పరిస్థితులలో పరిశ్రమలో అతనికున్న అనుభవాన్ని పురస్కరించుకొని -అంటే 3—5 ఏళ్ళ అనుభవం వుంటే- యోగ్యతలు సడలించడం జరుగుతుంది. 1963 సం. సెప్టెంబరులో ప్రారంభించబడిన యీ పథకం క్రింద ఇంజనీరింగులో 4 సం. రాల పాటుజరిగే డిప్లొమా కోర్సులో విద్యార్థులకు శిక్షణ యివ్వడం జరుగుతున్నది. ప్రతిరోజు సాయంకాలం 6 గం. నుండి 9 గం. వరకు తరగతులు నిర్వహింప బడుతున్నాయి. ఈ రకంగా సంవత్సరానికి 48 వారాలు యీ శిక్షణ సాగుతుంది.

ఈ పథకంలో చెప్పుకోదగ్గ విషయం ఏమిటంటే విద్యార్థుల వద్దనుండి ఏ రకమైన ట్యూషనుఫీజు వసూలు చేయక పోవడం. 20 సీట్లు ఎలక్ట్రికల్ శాఖలోను, 20 సీట్లు మెకానికల్ శాఖలోను వుండేటట్టుగా ఒక్కొక్కచోటా 40 సీట్లతో హైదరాబాదు, విజయవాడలలోని ప్రభుత్వ పాలిటెక్నిక్కులలో యీ రకపు పార్టుటైము కోర్సులను ప్రారంభించడానికి ప్రభుత్వం అంగీకరించింది. హైదరాబాదు, వనపర్తి, తణుకులలోగల మూడు ప్రయివేటు పాలిటెక్నిక్కుల లోని సీట్లను 120 నుండి వరుసగా 170, 150, 150 లకు పెంచడం జరిగింది.

## చేతి పనివారల శిక్షణ తరగతులు

చేతిపనివారల శిక్షణలో ఎమ్. టి. డ్రయివర్లకు తక్కువకాలపు తరగతులలో, షైర్‌లెస్ నిర్వహణలో, రేడియో మెకానిక్కులో శీఘ్రతర శిక్షణ కార్యక్రమాన్ని యీ ఆత్యయిక సమయంలో ప్రారంభించడానికి ప్రభుత్వం అంగీకరించింది.

18 వృత్తులలో చేతిపనివారల శిక్షణ కోర్సులను 6 నెలలు, 3 నెలల చొప్పున యీ శాఖ ఆదిపత్యంలోవున్న 15 సంస్థలలో ప్రవేశ పెట్టడం జరిగింది. చేతిపనివారల శిక్షణ కోర్సులు 1—2—1963 నుండి ప్రారంభించబడి 1963 జూలై మాసాంతానికి ముగించబడ్డాయి. ఈ కాలంలో అనుమతించబడిన 1772 సీట్లకు 1380 మందికి శిక్షణ యివ్వబడింది. వీరిలో 197 మంది కంటెంటెంట్ శిక్షణ పొందినవారు, 1963 జూలై మాసాంతానికి మొత్తం 1172 మంది శిక్షణ పొందారు.

## మోటారు ట్రక్కు డ్రైవర్లు

హైదరాబాదులోని పోలీసు ట్రయినింగు స్కూలు, హైదరాబాదులోని ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర రోడ్డురవాణా సంస్థ, హైదరాబాదులో గల పి. డబ్ల్యు. డి. వర్కుషాపు వరుసగా 300,150,50 సీట్లతో ప్రస్తుతం మోటారు ట్రక్కుడ్రైవర్ల 2 నెలల శిక్షణ కోర్సులను నిర్వహిస్తున్నాయి. 1963 ఆగస్టు మాసాంతా

(మిగతా 33 వ పేజీలో)

# పారిజాత సౌరభము

యస్వీ జోగారావు

(గత సంచిక తరువాయి)

*అవస్థా చిత్రణము* : కవి కౌశలమునకు నికషోపలమైనదిది. ప్రాసంగికముగ పాత్ర స్వభావోన్మీలనమును నిందు గీతార్థమగును.

సత్యాగ్రహ సన్నివేశమొకటి యిందులకు పరమోదాహరణము.

ఒకనాఁడు తన శృంగారవనంబులోన ప్రియ వయస్యతో ఏకాంతముగా నేవో ముచ్చటలాడుచున్నది సత్యభామ. అంతలో నారదానీత పారిజాతము మొదట శ్రీకృష్ణార్పితమై పిదప రుక్మిణీదేవి సిగకెక్కి కూర్చున్న సన్నివేశమును కనులార జూచి వచ్చిన సత్యాసఖి మరియొకర్తు పరుగునవచ్చి "అమ్మా యేమనిచెప్పుదు!" నని యెత్తికొని జరిగిన సంగతియంతయు సవిస్తరముగ పూస గ్రుచ్చినట్లు వాక్రుచ్చినది. దాని ఆగమన ప్రసంగము లెంత ఆతురముగ నున్నవో అప్పటి సత్యభామ ప్రతీఘాతమంత ఆవేగ వ్యతికరమైనది :

"అన విని ప్రేటువడ్డ యురగాంగనయుం
బలె, నేయివోయ భ
గ్గన దరికొన్న భీషణహుతాశనకీల
యనంగలేచి హె
చ్చిన కనుదోయికెంపు దనచెక్కులఁ
గుంకుమ పత్త్రిభంగ సం
జనిత నవీనకాంతి వెదచల్లఁగ
గద్గద ఖిన్నకంఠియై"

అప్పటి యామె కోపమునకు ప్రేటువడ్డ త్రాచు, ఆజ్యధారోదీర్ణమైన అగ్ని జ్వాలయు తప్ప తక్కిన వెవ్వియు తగిన యుపమానములు గావు. అందును దుర్వాసోంశగదా ఆమెది. రచనలో గూడ ఆ రయోచ్చలనము వ్యక్తమగుటలో నున్నదా సొగసు. తదుపరి

"ఏమేమీ కలహాశనుం డచటికై
యేతెంచి యిట్లాడెనా ?
ఆమాటల్ చెవియొగ్గి తా వినియెనా
యా గోపికావల్లభుం,
డేమేమాడెను రుక్మిణీసతియు,
నీ వింకేటికిన్ దాఁచెదే
నీ మోమోటలు మాని నీరజముఖీ!
నిక్కంబెఱింగింపవే.
అతుల మహానుభావ మని యవ్విరిఁ
దా నొక పెద్దసేసి య
చ్యుతున నిచ్చకంబొదవ సూడిద
యిచ్చిన నిచ్చెఁగాక తా
నతఁడు ప్రియంబుగల్గునెడ
కర్పణచేసినఁ జేసెఁగాక యా
మతకరి వేలుపుందపసి మమ్ముఁ
దలంపఁగనేల యచ్చటన్ ?"

అని యిట్లామె రసనాగ్రమున మనసును బెట్టుకొని మాటలాడుచున్న సందర్భమున పరి పరివిధముల భావచిత్రముల కచటి ప్రతి పద్యము నొక ప్రస్ఫువ పటోపాధి యైనది. అప్పటి యామె మనోవస్థ కినుక, వగపు వలపు — ఇత్యాది వివిధభావ సమ్మర్దోజ్వలమైనని చిక్క కిలికించితముగ నున్నది. భావప్రతీకలగు వివిధానుభావములామె మానమ్లాన మనోజ్ఞకాయ కాయమానముపై విహంగములై విహారము చేసినవి.

"బిసరుహ పత్త్రిలోచనకుఁ బెల్లగు
మోహము సంఘటిల్లె, వె
క్కసమగు నెవ్వగవ్వొడమెఁ,
గంపముపుట్టెఁ, జెమర్చెమేను, మా
నసమున విన్నబాటొదవె, నాటఁ
గడుం బరితాపవేదనల్
మసఁపుఁబాము కాటుగతి
మచ్చరమన్విస మగ్గలింపఁగన్.
వెడవెడఁ గన్నుమూయుఁ, గనువిచ్చు,
నగుం, దలయూఁచు, బాన్పుపైఁ
బడు, నుసురంచు లేచుఁ, దడఁబాడును,
దత్తరముంజలంబులో
నడరఁగఁ గోపవేగమున
నగ్గలమైన మనోజబాధలం
బడి మదహస్తి హస్తగత
పద్మినియుం బలెసొంపు పెంపఱన్."

మనకపు పాముకాటువలె మాత్సర్య విషము, కోపవేగమున మనోజబాధయు ప్రోజ్వలములై ఆమె యవస్థ మదపుటేనుగ తొండమున జిక్కిన తామరవలె నున్నదట! అనగా ఆస్థితిలో వివిధభావము లొక్కపెట్టు పొందిన ఆవేగమెట్టిదో చట్టున స్ఫురించును. అంతేకాదు అచటి అల్పాల్ప వాక్య ప్రకల్పముతోడి రచనా విన్యాసమున్నదే లోతైన నూతినుండి బారలువైచి త్రాడు లాగగా లాగగా నీరు నిండుగ చేద చేతికి

నచ్చిట్లు బరువైన భావము సహృదయ పాఠక హృదయమును తాకును. అంత భావోద్విగ్నమైన యవస్థకు తర్కసహమైన పరిణామము నిర్వ్యాపారము. సత్యభామ భావతీవ్రతయట్లే నిర్వ్యాపారమున పర్యవసించినది. ఈ యవస్థాచిత్రణము తిమ్మనగారి నేర్పునకు మీసము దిద్దినట్లున్నది. మరి తాతగారు తక్కువవారా? ఆయన సులోచనములచూపు అంతరంగపు సొరంగములు జొచ్చిపోవునట్టిది.

అవతల సత్యభామ వాడలో నేమి కొంప లంటుకొన్నవో యని "అరదము నెక్కి కేతన పటాంచల చంచలమైన తాల్మితో" బయలుదేరినాడు భావజ్ఞుడు గోపాలచూడామణి. అక్కడ చిన్నబోయిన సత్యాగృహ వర్ణనము కవి తానై చేయక

"కనక పంజర శారికలకుఁ జెక్కెరవెట్టి
చదివింప రేలకో సకియలిపుడు!''

ఇత్యాదిగా అది ఆయన బాధ్యతే యను నట్లు కృష్ణుని చేతనే చేయించుటచే ఆ యవస్థకు నాటకీయతా స్ఫూర్తిగల్గినది.

అక్కడ నందనవనమున పారిజాతమునకై వనపాలకులతో సత్యభామ కచ్చ బిగించి కయ్యమునకు కాలుదువ్విన సందర్భము:

"వినుడు సురేశ్వరు వనపాలకులు! వార్ధిఁ
బొడమిన యీ దివ్యభూరుహమున
కింద్రాణి యెవ్వతె? ఇంద్రుడు నెవ్వఁడు?
తోడి యిందిరను గౌస్తుభము నెవ్వఁ
డధిపుఁడై ధరియించె నతఁడె చేకొనుగాక
తెకతేర యిదియేమి యొకరిసొమ్మె?
యిదె నాదువిభునిచే నీవదాన్యనగంబు
నొడియించుకొని యేగుచున్నదానఁ
బలుకుఁడేటికిఁ దా వీరపత్నియేని
మీ శచీదేవి తనదు ప్రాణేశుఁడైన
మఘవునిటఁ బంపి సత్యభామావిధేయు
వలన మరలంగ గొనుఁ బో వాసితనము"

ఆ నిర్లక్ష్యమైన సంబోధనము, పృచ్ఛ, వాదము, ప్రతిజ్ఞ అన్నియు ఆమెకు మీసము లేని లోటును దీర్చుచున్నవి. ఎట్లును ప్రక్కను మీసము దిద్దుకొనుచు పద్దెము వ్రాయుచున్న తాతగారుండనే యున్నారు. అప్పటికే నరకాసురునితో యుద్ధముచేసి ఆరితేరియున్న దది యొక ధీమా కాబోలామెకు. ఇంకను నయ మిందును యుద్ధము వచ్చినదిగాని, సురేశ్వరు నెదుర్కొనునట్లు చేయలేదామెను తాతగారు.

"మేళవించినవి సుమ్మీ దీని మెట్లని
మాంసలాంసంబున మహతిఁ జేర్చి''—

ఈవిధముగ నారదుడు పుణ్యకవ్రత ప్రతిగృహీతుడైన శ్రీకృష్ణునిచే నాతడిక సత్యభామా విధేయుడుగాడు స్వవిధేయుడనునట్లు నతని భక్తపరాధీనతను జాటునట్లును సత్యభామ చూచుచుండగానే పనులు గొనుచు నతనినొక యాటయాడించిన సన్నివేశ మదియు పాఠకుని ప్రేక్షకుని జేయునట్టిది.

ఇంకొక విషయము — అవతారిక మొదలు ఆశ్వాసాంత కృతిపతి స్తుతులవఱకు అనేక సందర్భములలో మహోజ్జ్వల ధ్వని ప్రాచుర్యము గోచరించును. వివిధోక్తి నైపుణ్యము విలసిల్లును.

ఉదా:—

(1) "మనుకొని కొండవీటికడ మూఢత
రుద్రుడు కృష్ణనందనున్
మనసిజునిన్ జయించె నది
మానుషమే? నరసేంద్రు కృష్ణరా
య నృపతి కొండవీటికడ
నాహవభూమిఁ బ్రతాపరుద్ర నం
దనుఁడగు వీరభద్రుఁ గరుణామతిఁ
గాచె జగత్ప్రసిద్ధిగన్."

ఇందు రాయలు తన కొండవీటి విజయమున శత్రువైన ప్రతాపరుద్ర గజపతి కొడుకగు వీరభద్ర గజపతిని చంపక విడిచిపుచ్చిన విషయము చమత్కారముగా చెప్పబడినది. రుద్రుడు (శివుడు) తన కొండవీటి కడ (కైలాసముకడ) కృష్ణుని కొడుకైన మన్మధుని భస్మము చేసినాడు. ఆ క్రోధము మనసులోన పెట్టుకొనక కొండవీటి కడ (పరితాప) రుద్రనందనుడగు వీరభద్రుని కాచినాడట కృష్ణరాయలు. అనగా శ్రీకృష్ణునకును కృష్ణరాయలకును అభేదము వ్యంగ్యము. అసలు మీద "కోరితొలుమేనఁ దనకైన కొడుకువలెల్ల! మాన్చుకొనవచ్చి భువనైక మాన్యలీల! నవతరించిన కృష్ణుఁడే నన(గమించె?" నని కృష్ణరాయలగురించి చెప్పనే చెప్పినాడు కవి. "చక్రవర్తి మహాప్రశస్తి నాడును నేడు! చెలఁగి ధర్మక్రమస్థితి ఘటించె" నని మరియొక పద్యము శ్లేషశయనమైనది. అయితే ఇందు ఆ అభేదమును వ్యంగ్యమొనర్చుటద్వారా అదనముగా నొక చమత్కారము సాధించినాడు. ఆ రుద్రుడు తన కొడుకును చంపగా, తానాతని కొడుకును గాచినాడు. ఇతడే ఉదారుడు అని చెప్పుట. ఆ ప్రతాపరుద్ర వీరభద్ర శబ్దములట్లు కలిసివచ్చినవి. అవి గుర్తించి వినియోగించుకొనుటయు నొక విదగ్ధతయే.

(2) కుపితయైన సత్యభామ కృష్ణునిగూర్చి 'గోపికావల్లభుడు', 'నరకాసుర దమనుడు', "పల్లవీ కింకరుడు" — అని దెప్పరమాడుటయు, ఆమె పాదతాడనము చేసినప్పుడు కవి తాను కృష్ణుని సౌకుమార్యమును గూర్చి ''లతాంతాయుధుఁ గన్న తండ్రి" అని యనుటయు సందర్భోచితముగను, సాభిప్రాయముగను నున్నవి.

(3) నారదుడు తెచ్చిన పారిజాతమును కృష్ణుడు రుక్మిణి కిచ్చుటగూర్చి సత్యభామ "అతడు ప్రియంబు గల్గునెడ కర్పణచేసిన జేసెఁగాక" అని యన్నదేగాని రుక్మిణిపేరు

చెప్పుట కిచ్చగించలేదు. రుక్మిణి యతని ప్రియురాలైతే కావచ్చునుకాని యట్లను కొనుటకామెకు మనస్కరించదు. తన స్వాధీన పతికాహంకార మంతయు నచట వెళ్ళ గ్రక్కినది. ఆ వెంటనే ఆ "మతకరి వేలుపుం దపసి" నుద్దేశించి "మమ్ముఁదలంపఁగనేల యచ్చటన్" అన్నది, 'నన్ను' అని యనక "మమ్మ" యను టలో (Royal we ప్రయోగములో) ఆమె స్వాతిశయము విశదమైనది. తదుపరి కృష్ణుడు తన్ను తియ్యారింప వచ్చినపుడు వామపాద సత్కారము చేసిన పిదప, ఓదార్చిన కొద్ది ఏడ్పు, బతిమాలిన కొద్ది నిక్కు నెక్కు వగునందు రా విధముగ, "ఉవిద యెవ్వతె నోచి యున్నదో యీ శమంతక రత్నమింక నౌదల ధరింప..." అని యిట్లు సాగిన దామె ధోరణి. ఇక తాను ప్రాణ త్యాగము చేయుట కుద్యమించు చున్నానని చతురముగా తన శబ్దశక్తిని సానపట్టినది. ఇట్టి స్వారస్యము లీ కావ్యమునిండ బోలెడు.

అంతయు బాగుగ నున్నది కాని తాతగారట్లు శ్రీకృష్ణుని శిర్ష మొకవంక "జలజాతాసన వాసవాది సురపూజా భాజనంబైతనర్చు" నట్టిదని చెప్పుచునే దానిచే సత్యభామ జోడు కాళ్ళకు జోత పెట్టించి. ఒంటి కాలిచేనైతే నేమి గాక, తాపుతినిపించుటేమి, తాపుతిన్నవా డాపె తోప రేగగొట్టక "నను భవదీయ దాసుని మనంబున నెయ్యపుఁగిన్కఁ బూని తాచినయది నాకు మన్ననయ" అని అతనిచే పేదయఅపు లఅపించుటేమి ఇది యెల్ల రసికు లందరును "రామ రామ" యనుకొన వలసిన విషయమని యొక ఆక్షేపము గలదు. అందులకు మా సమాధానము: ఇది లఘుసారులైన నీరుమజ్జిగ రసికులకుగాని అతి సారులైన గేదెపెరుగు రసికులకుగాని అవగతము కాని, నవనీత కోమల మైన అంతస్సారముగల సరసులకే అవగతమగు ఒకానొక రహస్యము. లేకపోతే, తాచిన తాపును మన్ననగా జమకట్టుకొనుటతో సరిపెట్టినాడా మాహాను భావుడు: "చెల్వగు నీ పదపల్లవంబు మత్తను పులకాగ్ర కంటక వితానము దాకిన నొచ్చునంచునే ననియెద" అనిగదా వ్యాఖ్యానము వెలిగించినాడు. అతనికి నుదురు బొప్పి కట్టవలెనని సంకల్పించి యామె తన్నలేదు. అంచుకట్టిన తనుకోపము నమాంతముగ ప్రదర్శించుటకే 'శిరమచ్చో తోలగంద్రోచి'నది. అది అతని కుపకారమే యైనది. అతనికి పులకలు లభించినవి. రామాయణమున దశరథుడు కైకేయికి ప్రణమిల్లినాడు. అభిజ్ఞాన శాకుంతలమున దుష్యంతుడు శకుంతలా పాదసంవాహనము చేయుటకు సిద్ధపడినాడు. "క్రోధవశాత్తస్య శిరసి పాదతాడనమపి న దోషాయ సౌభాగ్య చిహ్నం తదపి నాగరక వృద్ధాః" అని వాత్స్యాయన కామసూత్ర వ్యాఖ్యాత యశోధరుని వక్కణ. అమరుకములో కాబోలు— "సాలక్తకేన నవపల్లవ కోమలేన: పాదేన నూపురవీతా మదలాలసీన యస్తాడ్యతే దయితయా ప్రణయాపరాధాత్: సోఽంగీకృతో భగవతా మకరధ్వజేన ॥" అని యొక ప్రమాణ శ్లోకమును గలదు. (ఎవడైతే ప్రణయాపరాధము నిమిత్తముగా ప్రియురాలి పాదముచే తాపుతినగలడో వాడట మన్మథ భగవానునిచే "సెభాష్ నువ్వురా నాకు నచ్చినవాడివి" అని అనిపించుకొను వాడని తాత్పర్యము. ఆ పాదము యోగ్యత సరిలెండి, దానికేమి, ఎవని యదృష్టమును బట్టి వాని కొకటి లభించును) తాతగారికి గండము తప్పినది.

అయితే తాతగారిపై నాదేయొక అభియోగము గలదు, పారిజాత ప్రసవమును ధరించిన రుక్మిణితో కృష్ణుని సమక్షమున నారదుడు—

"అలినీలాలక: నీవు నీపతి రహస్యక్రీడ వర్తించువే
శలతాంతాయుధ సంగరంబునకు నుల్లాసంబు గల్పించును
జ్వల దీపాంకురమై, రతిశ్రమతనూ సంజాత ధారాళ ఘ
ర్మలవంబుల్ దొఁలగింపఁగా సురటియై రంజిల్లు నిచ్చాగతిన్"

అని పారిజాత ప్రశంస చేసినాడట: ఆడుపసి తగులని నారదుడేమిటి: అందును మహర్షి పరస్త్రీతో నట్లాడుటేమిటి: ఒకవేళ తానేదో తాతగారివరుస భావించుకొని పెద్దతనము నెత్తిని వేసికొనెనేమో అని యెంత అనుకొందమన్నను, లోకములో నెందరు తాతలు తమ మనుమరాండ్రతో మాట వరుసగా మోటసరసము లాడుట మనము చూచుచుండుటలేదు అని సరిపెట్టు కొందమన్నను నవియేమి మాటలు: తను పెద్దతనము సాకుపెట్టుకొని మాటలలో తమ ఆబతీర్చుకొనజూచుతాతలేఅనలేరామాటలు. అంత వాచ్యముగా, అంత పచ్చిగా, 'రహస్యక్రీడ', "లతాంతాయుధ సంగరంబు", "రతిశ్రమ" అనుమాట లానోట పలికించుట నారాయణ: నారాయణ: ఘోరమైన అనౌచిత్య మనక తప్పదు. అయితే తాతగారి పారిజాత పరిమళము నీ నీహారలేశమొకటి యాకట్టలేదు.

ఈ పారిజాత జాతకమునకు రాయలవారి రాణివాసపు కథ యొకటి మూల కారణ మందురు. ఏమైననేమి రసికశిఖామణి రాయలవారి ఆమోదపుముద్ర వైచుకొన్నది.

రాయలవారి సంస్థానమున పెద్దనగారి ప్రబంధ గంధగజేంద్రము పజ్జనిది యొక చక్కని ఆజానేయము. ఆంధ్రమునగల శృంగార కావ్యములకెల్ల నిది మకుటాయమానము, మార్గదర్శకము. భామకలాపము భవంతికి పునాది. రసికాంతరంగ నందనోద్యాన పారిజాతమిది. ★

# అభ్యుదయం

## వ్యవసాయం

*సవరించిన సాంద్రవ్యవసాయ కార్యక్రమం:*

తూర్పుగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కర్నూలు, నిజామాబాదు, వరంగల్లు, కరీంనగరం, మహబూబునగరం జిల్లాల్లోని 150 అభివృద్ధి కేంద్రాలలోనూ వరి, జొన్న, రాగులు, మొక్కజొన్న, చెఱకు, వేరుసెనగ, ప్రత్తి, అరటికూర గాయల యెకరా పంటను, మొత్తం పంటను హెచ్చించేందుకు సవరించిన సాంద్ర వ్యవసాయ కార్యక్రమాన్ని, ఆదిలాబాదు, అనంతపురం జిల్లాల్లో తీవ్రతర మెట్టసాగు పథకాన్ని ప్రవేశపెట్టడంతో, వాటిని గురించి రైతులకు తెలియచెప్పడం అతి ముఖ్యంగా పరిణమించింది. ఈ పథకాలను అమలులో పెట్టి యెక్కువ పండించవలసింది రైతాంగం కావడమే దీనికి కారణం. అభివృద్ధి కేంద్రం స్థాయిలో యీ పథకాన్ని విజయవంతంగా అమలు పరచవలసిన బాధ్యత వ్యవసాయ విస్తరణాధికారులకు అప్పగించబడింది. ఈ విషయంలో వారి విజయం, యీ పథకాలను గురించి వారికి గల పరిజ్ఞానం పైనా, వారు రైతులను ప్రబోధించే పద్ధతిపైనా ఆధారపడి వుంటుంది. ఈ పథకాలు అమలుజరిగే జిల్లాల లోని వ్యవసాయ విస్తరణాధికార్లకు తీవ్రతర శిక్షణ నిచ్చే వుద్దేశంతో, ప్రచార కార్యక్రమ మొకటి చేపట్టబడింది. ఇది మొదట మహబూబునగరం జిల్లాలో ఆరంభమైంది. తరువాత వరంగల్లు, కరీంనగరం, నిజామాబాదు, ఆదిలాబాదు జిల్లాల్లో కూడా అమలు పరచబడింది. 1963 డిసెంబరు మధ్యనాటికి అన్ని జిల్లాల్లోనూ దీనిని అమలు పరచడానికి సంకల్పించారు.

ఈ కార్యక్రమంలోని ముఖ్యాంశాలు యివి : బృందచర్చలు, సవరించిన సాంద్ర వ్యవసాయ కార్యక్రమం క్రింద ప్రదర్శన ఖండాలను యేర్పరచిన గ్రామాల సందర్శన, రైతులతో చర్చించి వారి అభిప్రాయాలను సేకరించడం, దృశ్యశ్రవ్య సాధనాల వుపయోగంలోనూ, పోస్టర్లు, చార్ట్సు, గ్రాఫ్‌లు, ఫొటోలు మున్నగు దృశ్యశ్రవ్య సాధనాల తయారీలోనూ విస్తరణాధికార్లకు శిక్షణ యివ్వడం.

## పబ్లిక్ వర్క్సు

*ఎగువ సీలేరు జలవిద్యుచ్ఛక్తి పథకం:*

విద్యుదుత్పత్తి యంత్రాలు, టర్బైన్లు, ప్రసారసాధనాలు మొదలైన ప్రధాన యంత్రాల నిర్మాణం కొనసాగుతున్నది. పవర్ హౌస్ మున్నగు వానికి సంబంధించిన అంశాలు 1963 ఆగస్టు నెలలో ఢిల్లీలో కేంద్ర జలవిద్యుచ్ఛక్తి కమీషన్‌తో చర్చించబడినవి.

*తుంగభద్రా జల విద్యుచ్ఛక్తి పథకం :*

ఆనకట్ట, హంపిల వద్దగల విద్యుదుత్పత్తి కేంద్రాలలో ఒక్కొక్కదానిలో, అదనంగా 9000 కి. వా. వుత్పత్తి శక్తిగల రెండు యూనిట్లను నెలకొల్పడానికవసరమైన యంత్రాలన్నీ వచ్చాయి. యంత్రాల స్థాపన చురుగ్గా, కార్యక్రమం ప్రకారం జరుగుతున్నది. ఈ రెండు కేంద్రాలలోను ఒక్కొక్క యూనిట్టు 1963 డిసెంబరు ఆఖరికీ, మిగిలిన రెండూ 1964 ఏప్రిల్ నాటికి పని ప్రారంభించేట్టు చేయాలని సంకల్పం.

*నెల్లూరు థర్మల్ కేంద్రం :*

బాయిలర్ హౌస్‌లో పరికరాల స్థాపన జరుగుతున్నది. బాయిలర్‌స్ట్రక్చర్ స్థాపన పూర్తి అయింది. ఆవిరి, నీటి డ్రమ్‌లకు సంబంధించిన పనులు కొన్ని ముగిశాయి. మరికొన్ని సాగుతున్నాయి. పొగగూళ్ళ నిర్మాణం జరుగుతున్నది. 1963 జూలైలో జపానునుంచి 238 ప్యాకేజీలలో యంత్ర విభాగాలు వచ్చాయి.

*కొత్తగూడెం థర్మల్ పథకం:*

బాయిలర్లకై జపానులోని టోకియోలో గల మెసర్సు మిట్సూయి అండ్ కంపెనీకి వ్రాయబడింది. టర్బో — జనరేటర్లకు సంబంధించిన వుత్తర్వులకు తుదిరూప మివ్వబడింది. కేంద్రప్రభుత్వంనుంచి విదేశ మారకం విడుదలకై నిరీక్షించబడుతున్నది. కొన్ని యంత్రాలకు టెండర్లు కోరబడినవి. హౌస్ జనరేటింగ్ సెట్లకై గ్లోబల్ టెండర్లు కోరబడినవి. టెండర్లు తీసుకోవడానికి 18-9-63 ఆఖరిరోజు. విద్యుదుత్పత్తి కేంద్రం కట్టడానికీ, కూలింగ్ టవర్లకీ, తదితర పనులకు గ్లోబల్ టెండర్లు కోరబడుతున్నవి. ప్రస్తుత కార్యక్రమం ప్రకారం మొదటి సెట్టు 1966 మార్చిలోనూ, రెండవది 1966 జూన్‌లోనూ పని ప్రారంభించవలసి వుంది.

*హైదరాబాదులో గ్యాస్ టర్బోసెట్లు :*

కేంద్ర జలవిద్యుచ్ఛక్తి కమిషన్ ఆంధ్రప్రదేశ్‌కు కేటాయించిన 10/12 మె.వా. గ్యాస్ టర్బో జనరేటింగ్ సెట్లు రెండూ భారత

(మిగతా 33 వ పేజీలో)

# నీవేనా...?

అరసాడ ధర్మారావు

నీవేనా మొనగాఁడ వీ పృథివిలో -
నిర్ఛిద్ర శౌర్యప్రతా
పావేశోజ్జ్వలతన్ ?— భళీ ! యొకఁడవే
పట్టమ్ముఁ గైసేసి కొ
మ్మీ విశ్వమ్ము సమస్త మీ పయినిఁ, బూ
ర్వీశుల్ గనన్ లేని సం
ప్రావీణ్యాద్భుత శాశ్వతప్రభుఁడవై
రాఁగోరు చవ్వెన్ను లే ! ॥

చైనా భారతహద్దు గృత్రిమముగా
సల్పంబడెం గ్రుడ్డిగా
నేనాఁడో, విపరీతనష్ట మొనగూ
డెన్ మా కటంచుం గడున్
హీనమ్మైన ప్రచారధోరణిని నూ
హించావు - నీ రాజ్య తృ
ష్ణా నాందీవచన మ్మిదే యనుచు నా
నాఁడే జగ మ్మెంచెరా ॥

కైజరు పుణ్యాని కారణంబునఁ దొలి
సంగ్రామ ముదయించి జగతి ముంచె
హిట్లరు ధర్మాన నేతెంచె సమరంబు
రెండవతూరి ప్రచండ మగుచు
నా రెండుయుద్ధాల నతిదారుణంబుగ
మారణహోమంబు మహిఁ జెలంగెఁ
జావఁగ మిగిలిన జనము లెట్టెట్టులో
పునరభివృద్ధినిఁ బూని రిపుడు
తీరనేలేదు భయములు వీరి కింక
వారసత్వంబు నీ పాల వచ్చెనేమొ
మఱల నయ్యదే యుద్ధతి, మత్తవాగ్వి
భవము నదె మఱియొకపోరు వరలునేమొ !॥

భూవలయమ్ము మా భుజవిక్రమార్చుల
నార్జించి మించెద మంచుఁ బల్కి
రానాఁ డలెగ్జాండ రావెన్కఁ జెంగీజుఁ
డాపయిం దైమూరుఁ డాగ్రహించి
ఇస్లాము భువి రుద్ద నెగిరిరి మూర్ఖులు
ప్రొద్దుగ్రుంకని నేలఁ బొంది రొకరు
పుడమీశ వాంఛ నెపోలియన్ కెయిజరు
హిట్లరు లాయుధా తెలమిఁ బూని
రెంతకాలము వారి త్రుళ్ళింత వెసఁగె ?
నెంతరాజ్యముఁ జేపట్టి రేమి తినిరి ?
చెడ్డపేరునకే గాఁక జెందిరేమి ?
చరిత గ్రహియించి మఱలుము చవనలయ్య ॥

సరిహద్దులు సంతృప్తిగ
సరిపోయిన దేశ మొకటి జగతిం గలదే ?
పరితృష్ణ కంత మెక్కడ ;
దురాక్రమణ తంత్రమునకు దూరము చనుమా ।

దురమున గెల్పు ఖాయ మని
త్రుళ్ళకు ! శాంతి యహింస దీక్షగా
వరలెడు భారతీయులు న
వక్రపరాక్రము లాహవంబె దాఁ
బోరసెడు వేళఁ ; బ్రాణముల
పోడిమి వీరికిఁ బాటిగాదు — చ
త్తు రుభయదేశ వీరులును —
తూరుపు నీతికి మచ్చఁ దెచ్చితే ॥

ఉన్నదానిన సంతుష్టిఁ గొన్నవాని
కధికుఁ డెవ్వఁడు లేఁ డిల — స్వార్థలాభ
మాత్మ నూహించి యతృప్తి మ్రగ్గు జనున
కఖిలజగమును గొలదియ యరసిచూడ ॥

మతములు మాత్రమే నరుల
మధ్య నగాధ విభేద సృష్టి సం
తత మొనగూర్చు నంద్రు — వివి
ధమ్ము లిజమ్ములు గూడ నంతకం
టె తెలుగు సాల గల్గునవి ;
డింభక తత్వము మాని బుద్ధివై
మతము లిజమ్ము లంటని సు
సుమానవ పృథ్విని జింత సేయుమా ॥

అర్థమందు, సమాజమునందు, మనసు
విప్పి చెలఁగుటయందు - వివేకభరిత
మైన స్వాతంత్ర్య సమత... జనైక మతము
గాఁగ — రూపొందుచుండె లోకమున నేఁడు ॥

నీ యేకాకితనంపు టూహలును, నీ
నిష్కారణ ద్వేషముల్,
నీ యున్మత్త ప్రలాప పౌరుషములున్,
నీ యస్త్రవిన్యాసముల్
నీ యూర్జస్వము లుజ్జగించి - చెలిమిన్
నీ తోడి దేశాధిపుల్
శ్రేయోరాజ్యము పొందెఁ గూడు సఫలన్
చీనాగ్రజా చేరుమా ॥

యుద్ధముల, రాజ్య సంపాదనోద్యమముల
సార్థకము గాదు పేరు - ప్రజావ్రజంబు
లేమిటను శాంతిఁ బోరలు, నాఁయుధ్వమందు
రాజిలు - వృథాప్రయాస దురాశ విడుము ॥

---

(27 వ పేజీ తరువాయి)

నికి 530 మంది శిక్షణ పొందారు. మరో 3822 మంది శిక్షణ పొందుతున్నారు. మోటారుట్రక్కు డ్రైవర్ల శిక్షణకు యితోధిక సౌకర్యాలను కల్పించడానికి, హైదరాబాదులోని పోలీసు శిక్షణ కేంద్రంలో సీట్లను పెంచడానికి ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

3 నెలల వైర్‌లెస్ ఆపరేటర్ల శిక్షణ కోర్సులు హైదరాబాదులోని ప్రభుత్వ పాలిటెక్నిక్కులోను, పోలీసు సిగ్నల్ స్కూలులోను వరుసగా 16,32 సీట్లతో ప్రస్తుతం నిర్వహించబడుతున్నాయి. 1963 జూలై నెలాఖరునాటికి 75 మంది సిపాయిలు శిక్షణ పూర్తిచేశారు. ఆగస్టు 1 వ తేదీనుండి పై రెండు కేంద్రాలలోనూ మూడవదశ శిక్షణ తరగతులు ప్రారంభించబడ్డాయి. ప్రస్తుతం యిక్కడ 48 మంది శిక్షణ పొందుతున్నారు.

రేడియో మెకానిక్కులు

రేడియోమెకానిక్కుల శిక్షణ హైదరాబాదులోని పారిశ్రామిక శిక్షణ కేంద్రంలో 16 సీట్లతో 1-4-63 నుండి ప్రారంభించాలని ఉద్దేశించబడింది కాని మిలిటరీ అధికారులు సిపాయిలను కేటాయించిన మేరకు శిక్షణకై పంపిన కారణంగా అది ప్రారంభించబడలేదు. రెండవదశ శిక్షణ తరగతులు 1963 అక్టోబరు 1 వ తేదీనుండి ప్రారంభింపబడ్డాయి.

1963-64 సం. కాలానికి సాంకేతిక విద్యక్రింద రూ. 50 లక్షలు, చేతిపనుల శిక్షణ పథకాలక్రింద రూ. 22.50 లక్షలు (40 శాతం రాష్ట్రంవంతు) కేటాయించడం జరిగింది.



(31వ పేజీ తరువాయి)

దేశానికి వచ్చాయి. బొంబాయి, మద్రాసు నౌకాశ్రయాలలో దింపబడుతున్నవి. పునాదుల పని, యీ సెట్లు నెలకొల్పబడే ఎఱ్ఱగడ్డ సబ్-స్టేషన్లో స్విచ్‌గేర్ స్థాపన పని పూర్తి కావస్తున్నది. ఈ సెట్లు 1963 నవంబరు మాసాంతానికి పని ప్రారంభించవచ్చు.

*గ్రామాలకు విద్యుచ్ఛక్తి :*

1963 జూన్‌లో 4 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడింది.

ప్రసారమార్గాలు, సబ్-స్టేషన్లు

*1. సీలేరు, పంపిణీ పథకం :*

ఎగువ సీలేరు-కొత్తగూడెం-నాగార్జునసాగర్ 220 కె. వి. లైన్ పరిశీలన చేపట్టబడింది. ఈ మార్గం నిమిత్తం వ్రాయబడిన సరుకులు రావడం ఆరంభమయ్యాయి.

వరంగల్లు-హైదరాబాదు 132 కె. వి. డి. సి. లైన్ ప్రాథమిక మార్గానికి తుది రూపమివ్వబడింది.

నాగార్జునసాగర్ 220 కె. వి. సబ్-స్టేషన్ స్థలం ప్రతిపాదనలకు తుదిరూపమివ్వబడింది.

*2. కొత్తగూడెం థర్మల్ పథకం :*

కొత్తగూడెం-వరంగల్లు-రామగుండం 132 కె. వి. డి. సి. మార్గం పరిశీలన చేపట్టబడింది. అవసరమైన సరుకులన్నిటికీ వ్రాయబడింది.

*3. తుంగభద్ర-నెల్లూరు హైడ్రో థర్మల్ పథకం :*

హంపినుండి గుత్తికి, కడపకు నిర్మించబడే 132 కె. వి. లైన్ 1963 నవంబరు నాటికి పూర్తి కాగలదని భావించబడుతున్నది.

హంపి, గుత్తి, కడపలలో 132 కె. వి. సబ్-స్టేషన్‌ల లేయౌట్లకు తుదిరూపమివ్వబడింది. సాధన సామగ్రి రవాణా ఆరంభమైంది.





మన ద్వితీయ రక్షణ శ్రేణి — జాతీయ కేడెట్ దళాలు, సహాయక కేడెట్ దళాలు, హోంగార్డులు, గ్రామీణ శ్రామిక దళాలు— శీఘ్రగతిని పటిష్ఠం చేయబడుతున్నవి.

# ఒకే బాట...

ప్రాదేశిక సమగ్రతకూ, దేశ గౌరవానికి భంగం రాకుండా వివాదాలను శాంతియుతంగా పరిష్కరించుకోడం, ప్రశాంత సహజీవనం యింతకుముందు కూడ భారత రాజకీయ విధానం ప్రధాన లక్ష్యాలైనప్పటికీ రక్షణ కృషి విషయంలో ఔదాసీన్యం ఎంతమాత్రం తగదు.

విదేశ దురాక్రమణను సమర్థవంతంగా ప్రతిఘటించడానికీ, సంసిద్ధం కాపడానికీ మన సాయుధదళాలు శాయశక్తులా కృషి చేస్తున్నాయి. మన సాయుధదళాలు శత్రువుయొక్క ఉనికినీ, శత్రువు కలిగించే ప్రమాదాన్ని కనిపెట్టేందుకై వారికి తగిన శిక్షణయిస్తున్నారు. సాయుధ దళాలకు శిక్షణ సౌకర్యాల విస్తరణా, పరికరాల సేకరణా, కమ్యూనికేషన్సు, యుద్ధ తంత్రశిక్షణా మొదలైన వాటిలో ఏ మార్పు కైనా ముందు అట్టి మానసిక పరిణామం అత్యంతావశ్యకం.

భారత సైనిక శాఖ మరో ఆరు సైనిక డివిజన్లను నిర్మించడానికి ప్రణాళికలుసిద్ధం చేసింది. వాటిలో మూడు డివిజన్ల నిర్మాణం పూర్తయింది. మూడు నిర్మాణంలో వున్నాయి.

సైనిక సామగ్రులలో కొన్ని యింకా కొరతగా వున్నప్పటికీ ఆయుధాలు, మందుగుండు సామగ్రి, పరికరాలు, దుస్తులు, కంబళ్ళు, కాలిజోళ్ళు మొదలైనవాటి ఉత్పత్తి చాలావరకు మెరుగైంది. అవసరమైన ఉత్పత్తి సామర్థ్యాన్ని దేశంలోనే నెలకొల్పడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి.

అత్యున్నత ప్రాంతాలలో సైనికులు తమ విద్యుక్త ధర్మ నిర్వహణలో ఎదుర్కొనే వివిధ సమస్యల పరిష్కారానికి ఒక చెంప తీవ్రతర పరిశోధనలు కొనసాగుతూనే వున్నాయి.

ప్రస్తుతం వున్న ఆర్డినెన్సు ఫ్యాక్టరీల ఉత్పత్తిసామర్థ్యాన్ని పెంపొందించడానికి అవసరమైన చర్యలు తీసుకుంటున్నారు. ఆ ఫ్యాక్టరీలలోని ప్రస్తుత ఉత్పత్తిస్థాయి, అత్యవసర పరిస్థితికి ముందువున్న ఉత్పత్తి స్థాయికంటె రెట్టింపు పెరిగింది.

శక్తివంతమైన తేలికరకం ఆయుధాలను సైన్యానికి సమకూర్చడం ముఖ్యావసరం. అట్టి ఆయుధాల తయారీకి కొత్తగా ఆరు ఆయుధ కర్మాగారాలు - అందులో రెండు బ్రిటను, అమెరికాల సహాయంతో నెలకొల్పుతున్నారు.

యం. ఐ. జి. విమానాల ఫ్యాక్టరీలను నెలకొల్పేందుకు స్థలసేకరణ, విద్యుచ్ఛక్తి, నీరు, సాంకేతిక సిబ్బంది శిక్షణ, రైల్వే సైడింగుల నిర్మాణం మొదలైన వాటికి సంబంధించిన ఏర్పాట్లు ముందుకు సాగుతున్నాయి.

అగ్రస్థావరాలలోని మన సైనికుల సంరక్షణకు అతిసమర్థవంతంగా కమ్యూనికేషన్లు అభివృద్ధికావాలి. ఆ ప్రాంతాలకు భూమార్గాన రాకపోకల సౌకర్యాలు మన సైనికులు అతి ప్రధాన అవసరాలను తీర్చడానికి వీలుగా ఏర్పాట్లు చేస్తున్నారు. సరిహద్దు రోడ్ల అభివృద్ధి సంస్థ దాదాపుగా ఆ రోడ్లన్నింటినీ నిర్మిస్తున్నది. ఈ సంస్థ 1963 జూన్‌నుంచీ 1600 మైళ్ళ దూరంమేరకు త్రవ్వకం పనినీ, 600 మైళ్ల

# ఒకే మాట...

మొత్తం పొడవుగల రోడ్ల నిర్మాణపు పనినీ నిర్వహించింది. 2,700 మైళ్ళ ప్రాంతాన్ని సర్వే చేసింది.

మొత్తం 3,000 మైళ్ళ పొడవుగల కొత్త రోడ్లు నిర్మించడానికి 3,000 మైళ్ల పొడవుగల పాతరోడ్ల బాగుసేత సంరక్షణలకూ, 300 మైళ్ళ పొడవుగల రోడ్లను పదును చేయడానికి ఆ సంస్థ యిటీవలే ఒక కార్యక్రమాన్ని ఆమోదించింది.

ద్వితీయ రక్షణశ్రేణి క్రింద జాతీయ సైనిక విద్యార్థి దళం, సహాయ సైనిక విద్యార్థి దళం, హోంగార్డ్సు దళం, గ్రామ శ్రామిక దళాల నిర్మాణ, నిర్వహణలు కొనసాగుతూనే వున్నాయి.

రక్షణ విషయకంగా దేశాన్ని సంసిద్ధం చేయడానికి జరిగే కృషిని ఆర్థికాభివృద్ధి కృషినుంచి వేరుచేయడానికి వీలులేదు. ఆర్థిక స్తోమత, సాంకేతిక సామర్థ్యం, వైజ్ఞానిక పురోభివృద్ధి, వీటన్నిటినీ మించి ప్రజాసామాన్యంయొక్క ధైర్యస్థైర్యాలూ రక్షణ కృషి పెంపుదుకు అత్యవసరం.

స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత యింతటి గడ్డు బడ్జెటును (1963-64) దేశం ప్రశాంతంగా, అమితోత్సాహంతో స్వీకరించడం, జాతీయ రక్షణకు సకల సాధన సంపత్తి సమీకరణకు జాతి కృత నిశ్చయంతో వున్న దనడానికి మంచి సూచన.

భారతదేశంమీద దురాక్రమణల చరిత్రే భారతదేశ చరిత్ర. అలెగ్జాండరు మొదలు మొగలాయీల వరకూ ఏ శత్రువు దండెత్తివచ్చినా, ఈ దేశం చిలికలతో తగాదాలతో నిండివుండేది. ఎవరో కొందరు దేశద్రోహులు శత్రువుకు సహాయం చేయటానికి సిద్ధంగా ఉంటూనే ఉండేవారు.

ఇదే చైనీయులు బాగా వొంటపట్టించుకున్నట్లు తోస్తుంది. చరిత్రకు పునరావృతమయ్యే గుణముందని వారెరుగుదురు. అయితే, చరిత్ర కుండే ఈ గుణాన్ని భారతీయులు విదిలించి వేశారు. భారతీయులంతా ఏకమై, రాయల్లే ఎదురు నిలబడి ఉండడం, చైనీయులకు దిగ్భ్రాంతి కలిగించి ఆశ్చర్యచకితుల్ని చేసింది. అదురు చెదురు ప్రతిఘటన వుంటుందనుకొన్నచోట్ల, అతి కఠినమైన ప్రతిఘటన ఎదురైంది. ఒక్కొక్క భారతీయ సైనికుడూ, ఆత్మార్పణ చేసే ముందు కనీసం ఐదారుమంది చైనా సైనికుల రక్తం చూసి గాని, తన ప్రాణాలు విడిచి పెట్టలేదు.

ఏమైనప్పటికీ, చైనీయులు, సిక్ రెజిమెంటుకు చెందిన సిపాయ్ కేవల్ సింగ్ ప్రదర్శించినటువంటి అద్భుత ధైర్యసాహసాలు మాత్రం ఊహించలేరు. వాలాంగ్‌లోని తన విభాగం తాలూకు కాపరా కేంద్రం నుంచి సిపాయ్ కేవల్ సింగ్ ఒక్క అంగలో బయటకొచ్చి శత్రు సైనికులను బాయ్‌నెట్‌తో పొడిచి చంపాడు. ప్రాణార్పణం చేసేటంత వరకూ అతడు శత్రువులపైన ఏకధాటిగా బాయ్‌నెట్ ప్రయోగించాడు. ఈశాన్య సరిహద్దు ఏజెన్సీ ప్రాంతంలో నామ్ కాఛా నదివద్ద కంపెనీ హవల్దార్ సౌదాగర్ సింగ్ (రాజ్‌పుట్ రెజిమెంట్) గూడా ఈ విధంగానే అత్యంత సాహసాన్ని ప్రదర్శించాడు.

ఈశాన్య సరిహద్దు ప్రాంతంలోనూ, లడఖ్‌లోనూ చాలా ప్రదేశాలలో భారత

సమధికోత్సాహంతో సైన్యంలో స్వచ్ఛందంగా చేరిన యువకుల శిక్షణాసక్తి.



తీయ జవాన్లు తుదివరకూ పోరాడిగాని, తమ ప్రాంతాన్ని ఖాళీచేసి వెళ్ళలేదు. మేజర్ సైతాన్ సింగ్ ఉదంతమే యిందుకు చక్కని ఉదాహరణ. గాయాలు తగిలిన ఆఫీసరును సురక్షిత ప్రాంతానికి తీసుకుపోతుండగా, "నన్నిక్కడే దించివేసి, చావనివ్వండి. ఇంకా కొంతమంది చైనీయుల్ని చంపుతూ నన్ను చావనివ్వండి" అంటూ తన వారికి ఆదేశించాడు. అమిత ధైర్యసాహసాల ప్రదర్శనకు రైఫిల్మన్ బఖీసింగ్ ఉదంతం మరొక నిదర్శనం. ముఖ్యమైన ఒక పని మీద వెళ్ళి తన విభాగపు ప్రధాన కార్యాలయానికి నిశిరాత్రివేళ తిరిగి వస్తున్నపుడు చైనీయులు యితన్ని పట్టుకున్నారు. బఖీసింగ్ పనిమీద వెళ్ళిన సమయంలో నీఫాలోని కిబిటూ శత్రువశమైంది. చైనా సైనికులు ముగ్గురు వెంటరాగా యితడు ప్రశాంతంగా నాలుగడుగులు ముందుకి వేసి, అకస్మాత్తుగా శత్రు సైనికులపై లంఘించి, వారిని తబ్బిబ్బుచేసి, తప్పించుకు పారిపోయాడు. శత్రువులు అగ్ని వర్షం కురిపించారు. కాని అతను ఖాతరు చేయలేదు.

యుద్ధ ఖైదీలుగా చిక్కిన భారతదేశ సైనికుల ప్రవర్తనగూడా చైనీయులను ఆశ్చర్యపరిచింది. వారిని తమ వైపుకు త్రిప్పుకోటానికి చైనీయులు ఎంత ప్రయత్నించినా లాభం లేకపోయింది. మనో ప్రక్షాళనానికి ఎన్ని ప్రయత్నాలు చేసినా ఫలితం శూన్యమైంది.

నేఫాలోని చాలాచోట్ల చైనీయులకు ఆదిమవాసులు మచ్చుకైనా ఒక్కరు గూడా వారివారి గ్రామాలలో కనిపించలేదు. ఈ అనుభవం చైనీయుల కంతగా రుచించలేదు. అందరూ అడవుల్లోకి పారిపోయినారు. అల్లావుద్దీన్ ఖిల్జీకి చిత్తోడ్‌లో ఎటువంటి అనుభవం కలిగిందో వీరికి అటువంటి అనుభవమే ఈ నీఫాలో కలిగింది. ధాష్టికం చెలాయించేందుకు పిట్టమనిషి లేడు. వీధులన్నీ నిరామయం. ఇళ్ళన్నీ నిర్జనం. ఈ దెబ్బతో చైనీయులు నిజంగా స్తబ్ధులైనారు. తాము రాగానే, ఆదిమవాసులు ఆప్యాయంగా స్వాగతమిస్తారని ఆశించిన చైనీయులు, హాస్యాస్పదులైనారు.

(తరువాయి 88 వ పేజీలో)

భారత నౌకాదళం ఓడలు మన సముద్ర తీర ప్రాంతాన్ని జాగ్రత్తతో కాపలా కాస్తున్న దృశ్యం.



# నిత్యా

క్రిందటేడు అక్టోబరు 20న జరిగిన ఒక విషయాన్ని గురించి చాలామందికి తెలియదు. భారత నౌకాదళానికి చెందిన నౌకలన్నీ ఆరోజున తెల్లవారేటప్పటికల్లా యుద్ధానికి పూర్తిగా సన్నద్ధమై కోస్తావెంట బారులు తీర్చి నిలిచాయి.

"అందరూ సర్వసన్నద్ధులై మెలకువతో వుండాలి" అన్న వార్త న్యూఢిల్లీలోని నౌకాదళ ప్రధాన కార్యాలయం నుంచి అందగానే నౌకాదళ తీరస్థావరాలు నిర్వహించవలసిన పనులలోనూ, నౌకల కార్యకలాపాలలోనూ ఒక్కసారిగా మార్పు వచ్చింది. నౌకా స్థావరాలలోని నౌకలు సూర్యోదయానికి ముందే సర్వసిద్ధమై, రేవులనుంచి బయట కొచ్చి ముందు నిలబడ్డాయి.

ఒకచెంప రాడారు యంత్రాలు నిరంతరం గగన మార్గాన్ని, సముద్రం ఉపరితలాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తూవుండగా, ఈ నౌకలు తుపాకులనూ, టార్పిడోలనూ నింపుకొని అరేబియా మహాసముద్రంలోనూ, బంగాళాఖాతంలోనూ తమ స్థానాలను చేరుకోటానికి వేర్వేరు రేవుల నుంచి బయలుదేరి వెళ్ళాయి.

ప్రతి నౌకలోనూ "కార్యనిర్వాహణ" గది ఒక నాడీకేంద్రంగా తయారైంది. నౌకాదళ ప్రధాన కార్యాలయానికిగాను సమాచారాన్ని సేకరించటం, దాన్ని విమర్శించి పరిశీలించటం, ఈ పనులు యిక్కడ చురుగ్గా జరిగేవి. నావికులు రాత్రింబవళ్ళు సిగ్నల్ మార్గాలను నిర్వహిస్తుండేవారు. శత్రు విమానాలు, నౌకలకొరకు ఆకాశమార్గాన్నీ,



భారత విమాన దళానికి చెందిన ఒక విమానం, లడక్‌లోని పర్వత ప్రాంతాల గుండా మన అగ్రస్థావరాలలో ఒకదానికి సరఫరాలను చేరవేస్తున్న దృశ్యం.

# జాగృతిలో...

సముద్ర ఉపరితలాన్ని జాగ్రత్తగా పరిశీలించేవారు.

రాత్రిపూట పీరు నౌకలలో దీపాలను ఆర్పి అంతా చీకటి వుంచేవారు. నక్షత్రాల కాంతిలో మసగ మసగ్గా కనిపిస్తూ ఈ నౌకలు ఒయ్యారంగా ఊగిసలాడుతూ ఆ సముద్ర తరంగాలపైన ప్రయాణం కొనసాగించేవి. 800 మైళ్ళ పొడుగు కోస్తానూ, దేశంలోని రేవులనూ, నౌకాశ్రయాలనూ, ఎగుమతులు దిగుమతుల మార్గాలనూ, శత్రుబారినుంచి రక్షించటమే వీటి కర్తవ్యం.

ఈ విధంగా ఈ నౌకలు నిరుడు అక్టోబరు 20 నాటినుంచీ భారత దేశపు సముద్రతీరాన్ని, అరేబియా సముద్రం, బంగాళాఖాతంలోని భారత దేశపు దీవులనూ కాపలా కాస్తున్నాయి.

నౌకాదళానిది "మౌన సేవ" అని రివాజు. ఈ విధంగా ప్రజల కంటబడకుండా, సముద్ర దేవతనూ, ఆకాశ దేవతలనూ సాక్ష్యాధారాలుగా వుంచుకొని, రాత్రింబగళ్ళు సముద్రంపై కాపలా కాస్తూ దేశ రక్షణలో ప్రముఖ పాత్ర వహిస్తున్నది. మన నౌకాదళం నిరాడంబరంగా "మౌన సేవ" కే ప్రఖ్యాతి వహించింది.

ఇదేవిధంగా గత సంవత్సరం భారత విమాన దళం నిర్వహించిన వివిధ కార్యకలాపాల గురించి మహాఅయితే ఏకొద్ది మందికో తప్ప, చాలా మందికి తెలియదు. అసాధ్యమనుకొనే విషయాలను సాధించడానికే భారత విమాన దళానికి చెందిన విమాన చోదకులు ప్రయత్నిస్తుంటారని ప్రసిద్ధి. మన జవాన్లకు వీరు అందచేసిన సహకారం ఇంతా అంతా కాదు. వీరి మద్దతు లేకపోతే మన జవాన్లు అక్కడకు చేరడందాదాపు అసాధ్యమే అయ్యేది. నివాస యోగ్యంకాని, అధిగమింప వీలు కాని లడఖ్ ప్రాంతంలో యుద్ధచర్యల వల్ల ఏర్పడ్డ పరిస్థితుల ఒత్తిడి మూలంగా విమానాల సర్వీసు ప్రారంభించడం జరిగింది. 1948 లోనే విమాన దళానికి చెందిన కీ॥ శే॥ మెహర్ సింగ్ తమ హార్వార్డ్ విమానంలో 'లే' విమానాశ్రయంలో దిగారు. అసాధ్యమనుకొన్నది సాధించారు. విమానయాన చరిత్రలోనే ఇదొక ఘనవిజయం. పదివేల నుంచి 16 వేల అడుగుల ఎత్తున ఉన్న ఈ హిమవత్పర్వత ప్రాంతానికి చైనాలో యుద్ధం వచ్చిన సమయంలో డకోటాల వంటి మన రవాణా విమానాలు తప్పనిసరై అవసరం కొద్దీ వెళ్ళి రావటం జరిగింది. ఇది నిజానికి ఎంతో కష్టమైన పని. ఎన్నో వింత ప్రయోగాలతో కూడుకున్న ప్రయాణం ఇది. ఈ ప్రయాణ కాలంలో రాగల ప్రమాదాలు ముందుగా ఊహించి అందుకు ప్రమాద నివారణకు సన్నాహాలు చేసుకొన్నప్పటికీ ఏదో ప్రమాద అవకాశం ఉండనే ఉంటుంది. ఈ విమానాలను తయారు చేసినవారు కూడా కలలోనైనా ఊహించని అసాధారణ వాతావరణ భౌగోళిక, పరిస్థితులలో వీటిని నడపవలసి రావడమే ఇందుకు కారణం. ధైర్య సాహసాలుగల కొద్ది మంది విమాన చోదకులు అత్యంత జాగరూకతతో దృఢ సంకల్పంతో కృషిచేసి, ఉత్తర సరిహద్దులలో ఇంత ఎత్తైన మారుమూల ప్రాంతంలో విమానాల సర్వీసు ప్రారంభించడమే కాకుండా, భద్రత కల్పించి ఇతర విమాన చోదకులకు మార్గదర్శకులయ్యారు. ఈ సందర్భంగా 14000 అడుగుల ఎత్తున ఉన్న విమానాశ్రయాలలోనుంచి గ్రూప్ కెప్టెన్ ఎల్. ఎస్. గ్రెవాల్ జరిపిన విమానాల

నిర్వహణ కృషి గణుతింప తగ్గది. ఈ సందర్భంగా పేర్కొన వలసిన మరో సంఘటన కూడా ఉన్నది. యుద్ధ సమయంలో మన జవాన్లను అక్కడకు చేరవేయడానికిగాను గ్రూప్ కెప్టెన్ పి. ఎల్. ధవాన్ (పూర్వపు వింగ్ కమాండర్) తన డకోటా విమానాన్ని 16000 అడుగుల ఎత్తున ఒక ప్రాంతంలో దించి, విధి నిర్వహణ కాగానే వెంటనే విమానాన్ని బయలుదేరదీశాడు. రవాణా విమానంతో ఇంతటి ఘనకార్యం సాధించడం ఇదే ప్రథమం. విమానాల చరిత్రలోనే ఇది అపూర్వం.

దేశ ఉత్తర సరిహద్దున ఇది మరి ఎత్తైన పర్వత ప్రాంతము [illegible] ప్రాంతమూ కావడం చేత ఆపత్సమయంలో సంరక్షణ సాధనాలుగా హెలీకాప్టర్ విమానాల అవసరం క్రమంగా పెరిగింది. ఈ వాతావరణానికి సరిగ్గా ఏరకం విమానాలు అనుగుణంగా ఉంటాయో తెలుసుకొనేందుకు అనేక ప్రయోగాలు జరిగాయి. భారత విమాన దళానికి చెందిన చోదకులు ఈ ప్రయోగాలనూ, ప్రయత్నాలనూ ఎప్పటికప్పుడు శ్రద్ధగా పరిశీలిస్తూ వచ్చారు. ఈ ప్రయత్నాలుకూడా చాలా ప్రమాదభూయిష్టమైనవి. అందుకు కారణం ఈ విమానాలను ఉత్తుంగ హిమవత్పర్వత ప్రాంతాల వాతావరణానికి అనుగుణంగా రూపొందించకపోవడమే. ఈ రంగంలో స్క్వాడ్రన్ లీడర్ వి. కె. సహగాల్ ప్రశంసనీయమైన ప్రారంభకృషి జరిపారు. యుద్ధకాలంలో తప్పిపోయిన భారత వైమానిక దళానికి చెందిన ఆఫీసరు ఈయన ఒక్కరే. హిమాలయాలలో చాలా ఎత్తైన ప్రదేశాలలో హెలికాప్టరును దింపడానికీ, అక్కడినుంచి మళ్ళీ బయలుదేరి రావ [illegible] ప్ర[illegible] నిర్వహించారు.

ఇటువంటి అపూర్వ కృషి, సాహసోపేతమైన ఉత్సాహం ఏ కొద్దిమందికో పరిమితం కాలేదు. దళంలో కొంతమంది వీరుల సాహచర్యంమూలంగా ఇటువంటి ఉత్సాహం అందరికీ కలిగింది. ఇటీవలి యుద్ధకాలంలో విమాన చోదకులు ప్రదర్శించిన ధైర్యసాహసాలూ, ప్రావీణ్యం, విధ్యుక్తధర్మంపట్ల సేవానిరతీ ఇందుకు నిదర్శనాలు. ఇటువంటి సమరోత్సాహంతోనే వింగ్ కమాండర్ చందన్ సింగ్ అత్యంత ధైర్యసాహసాలు ప్రదర్శించి శత్రువుల శతఘ్ని కాల్పులకు లెక్కచెయ్యకుండా రణరంగంలోకి వెళ్ళి మన దళాలకు సరఫరాలు అందచేసి వచ్చాడు. ఛుషూల్‌లో ఆయన హెలికాప్టర్ విమానం దెబ్బతిన్నది. ఆస్కార్ వద్ద ఈ విమానాన్ని చుట్టుముట్టిన చైనా ముష్కరుల కళ్ళలో కారంకొట్టి తప్పించుకొని రావడానికి స్క్వాడ్రన్ లీడరు బధ్వార్, ఫ్లైట్ లెఫ్టినెంటు నారాయణ్ ప్రదర్శించిన సమయస్ఫూర్తి, ప్రావీణ్యం అపూర్వమైనవి.

ఇదేవిధంగా రాత్రివేళ, దారికూడా బాగా కన్పించని సమయంలో తీవ్రంగా గాయపడిన ఒక జవానుని సురక్షిత ప్రాంతానికి చేరవేయడానికిగాను స్క్వాడ్రన్ లీడరు విలియమ్సు ప్రాణాలకే తెగించి ప్రదర్శించిన సాహసం నిజంగా సాటిలేనిది. ఇటువంటి ఉత్సాహంతోనే మన హెలికాప్టర్ విమాన చోదకులు పశ్చిమ, తూర్పు రంగాలలో ఎటువంటి వాతావరణానికీ, శీతోష్ణస్థితులకూ లెక్కచెయ్యకుండా యుద్ధరంగంలో మన జవాన్లకు అవసరమైన సరఫరాలు చేరవెయ్యడంలోనేమి జవాన్లలో జబ్బుపడినవారినీ, గాయపడినవారినీ వెనుక ఉన్న సురక్షిత స్థావరాలకు, ఆసుపత్రులకు చేరవెయ్యడంలో అయితేనేమి, ఎంతో కృషి చేశారు. ఈ విమానాలను తయారు చేసినవారుకూడా ఎన్నడూ ఊహించనివిధంగా వీరు చదును చేసిన అడవి మధ్యప్రాంతాల నుంచీ, లోయలనుంచీ, అతి ఎత్తైన పర్వత శిఖరాలపైనుంచీ మనుష్యులను, సరఫరాలను సురక్షిత ప్రాంతాలకు చేరవెయ్యగలిగారు.

మాతృదేశ సరిహద్దుల రక్షణకై ఎన్నో త్యాగాలు చేసి, ప్రాణాలను



(36 వ పేజీ తరువాయి)

చైనీయుల పరిపాలన క్రింద వుండేకన్నా, ఆకలితో మాడి, అష్టకష్టాలతో చావడానికైనా సిద్ధపడ్డారు ఆదివాసులు.

భారతదేశంలో చరిత్ర నిజంగానే పునరావృతం కాలేదు. ఆంతరంగిక విభేదాలను విస్మరించి భారతీయులందరూ శత్రువును ప్రతిఘటించాలని కృతనిశ్చయులై ఐక్యతతో నిలబడ్డారు. ఈ విధంగా దేశప్రజయావత్తూ ఏకమై ఆంతరంగిక విభేదాలు విస్మరించి, శత్రువుని ప్రతిఘటించాలనే దీక్షతో, ఒక్క మనిషిగా నిలబడటం బహుశా యిదే తొలిసారి. భారతజాతి అంతా ముక్తకంఠంతో చైనా దురాక్రమణను నిరశించింది. జాతీయ రక్షణనిధికి సామాన్య ప్రజ కోట్లకొలది ధనాన్ని నగదు రూపంలోనూ, ఆభరణాల రూపంలోనూ యిచ్చారు.

చైనా దండయాత్ర మొదటి వార్షికోత్సవ సందర్భంలో ఈ నాడు — నిరుడు జరిగిన యుద్ధంలో మన సైనికులు ప్రదర్శించిన అద్భుత ధైర్యసాహసాలను గుర్తుచేసుకొని వారికి కృతజ్ఞతాచిత్తులై అంజలి ఘటిస్తున్నది ఈ జాతి.

ఎన్నో కష్టాలకు లోనవుతూ, సరిహద్దులను పరిరక్షిస్తున్న మన సైనికులకు నైతికంగాను, వస్తుసామగ్రులను సప్లయ్ చేయటంద్వారా మద్దత్తు యివ్వటంలో అన్నివిధాలా పాటుపడగలమని మళ్ళీ యిప్పుడు భారతప్రజలు పడుతున్న శపథం.

జాతీయ సమైక్యతా దినోత్సవాలను మొన్న అక్టోబరు 20న జరపటం ఎంతైనా సమంజసం. భారతీయుల జీవిత చరిత్రలో క్రొత్త అధ్యాయం ప్రారంభమైన రోజు వార్షికోత్సవం యిది. భారతదేశం తన జాతీయ సమైక్యతను ప్రపంచానికి రుజువుచేసిన రోజుకూడా ఇదే.

సహితం అర్పించిన వీరుల మూలంగానే మన సైనికదళాల ప్రతిష్ఠ ఇనుమడించింది. ధైర్యసాహసాలు, ప్రావీణ్యం, సమయ స్ఫూర్తి, దూరదృష్టి కల యోధుల మూలంగానే, మన సైనిక దళాలలో కొన్ని ఉత్తమమైన సత్సంప్రదాయాలు కూడా ఏర్పడ్డాయి.

ఈశాన్య సరిహద్దు ప్రాంతాలలో కడవలపోతగా కురిసే వర్షాలు, అక్కడ మన జవాన్లకు అనేక సమస్యలూ, ఇబ్బందులూ తెచ్చిపెడతాయి. వారు ఎన్నో కష్టాలను యెదుర్కోవలసి వస్తుంది. జూన్‌నుంచి సెప్టెంబరు నెలవరకూ ఆ ప్రాంతాలలో విధీ విరామం లేకుండా కుండపోతగా వర్షాలు కురుస్తుంటే పల్లపు ప్రాంతాలన్నీ జలమయమౌతాయి. కొండ అంచులు విరిగి రోడ్డుకు అడ్డంగా పడి రవాణాలకు అంతరాయం కలుగుతుంది, జవాన్ల జీవితం దుర్భరమవుతుంది.

వర్షాలు వుండనీ, లేకపోనీ, జవాన్లు మటుకు చక్కగా దుస్తులు ధరించి చురుగ్గా వుండాల్సిందే. ఆహారపదార్థాలు, ఆయుధాలు, మందుగుండుసామగ్రి మొదలైన అవసర సప్లయిలన్నీ, మారుమూలలోవున్న సైనిక కావలా కేంద్రాలకుగూడా, సక్రమంగా రవాణా కావలసిందే. సరిహద్దులవెంట అంతటా సైనికులు ఎప్పుడూ కళ్ళల్లో ఒత్తులు వేసుకొని కావలా కాస్తుండవలసిందే.

వర్షాకాలంలో రోడ్లమీద ప్రయాణం చాలా యిబ్బందిగా వుంటుంది. వర్షం పడ్డతర్వాత రోడ్డుమీద మట్టి పేరుకొని జారుగా వుంటుంది. కొన్నిచోట్ల రోడ్డు మరీ దెబ్బతిని రాకపోకలకే ప్రమాదకరమవుతుంది. కొండప్రక్కలనుంచి అంచులు విరిగిపడ్డాయి. అట్టి సందర్భాలలో ముందుకు పోవటానికి వీలుగాక గంటల తరబడి అక్కడ ఆగవలసి వస్తుంది. అత్యవసర పదార్థాలు తీసుకుపోయే శకటాలు అటువంటి స్థలాలవద్ద ఆగకుండా ప్రయాణం కొనసాగించాలంటే, ఈ ఆటంకాలు తొలగించడానికి పట్టుదలతో పని చేయవలసి వుంటుంది.

సైన్యం తాలూకు ఒక పరిశీలకుడు యిటీవల ఈ ప్రాంతాలలో పర్యటించాడు. అతడు ప్రయాణం ఆరంభించినపుడు వర్షం కురుస్తున్నది. పర్యటన జరిగినంత కాలం వర్షాలు జోరుగానే కురుస్తున్నాయి. కొన్ని రోజులు పర్యటన జరిగింది. పర్యటన పూర్తయిందిగానీ వర్షాలు ఆగలేదు. ఒక ప్రదేశంలో కొండ ప్రక్క మట్టి విరుచుకుపడి 30 గజాల రోడ్డు మూసుకుపోయింది. సైనిక శకటాలు ముందుకు కదలటానికి వీలుకాలేదు. గంటలమీద మరమ్మతులు చేయాల్సివచ్చింది. శకటాలను ఆపటం మంచిదికాదనీ, మట్టిమీదగానే వాటిని తీసుకుపోవటానికి ప్రయత్నించడం మంచిదనీ, డ్రైవర్లు నిశ్చయం చేసుకున్నారు. పెద్ద ఫిరంగిని ఈడ్చుకుపోతున్న శకటాన్ని ముందుకు నడిపారు. ఇంజనును స్టార్టు చేశారు. బండి ముందుకు కదల లేదు. మట్టి అడ్డమొచ్చింది. రెండో సారి ప్రయత్నించారు. ఊఁహూఁ! లాభం లేకపోయింది.

అయితే జవాన్లు నిరుత్సాహం చెందలేదు. బండికి తగిల్చిన ఫిరంగిని తీసేశారు. బండి వెనుక చక్రాలకింద యినప రేకులు పెట్టారు. వెంటనే బండి బయలుదేరింది. మట్టిమీద వెళ్ళి నిలబడింది. అయితే ఆ ఫిరంగి యింకా వెనకనే వుండిపోయింది. దాన్ని లాక్కొచ్చి ఆ శకటానికి తగిల్చారు. మరి కొద్దిసేపటిలో ఆ బండి ఆ మట్టిని దాటి ముందుకొచ్చి నిలబడింది.

ఎన్ని జాగ్రత్తలుపడ్డా, వర్షాకాలంలో ఏదో కొంత నష్టం జరుగుతునే ఉంటుంది. కొన్ని సమయాలలో శకటాలు మట్టిలో కూరుకుపోతాయి. వాటిని బయటకు లాగాల్సి వుంటుంది. మరొకప్పుడు మనుష్యులకే దెబ్బలు తగలవచ్చు. వెంటనే వారికి చికిత్స చేయాలి. ప్రమాదం ఏదైనా సంభవిస్తే, వెంటనే చర్యలు తీసుకుంటారు. రోడ్లు యింక ప్రమాదభూయిష్టంగా వుండి, వాతావరణం అనుకూలంగా లేకపోయినప్పటికి ప్రమాదాలు ఎక్కువగా జరగటం లేదంటే, ఇందుకు డ్రైవర్ల సామర్థ్యాన్ని ప్రశంసించవలసి వున్నది.

గుడిశలు, గుడారాలు, బంకర్లలోనే సైనికులు వుంటారు. వాటిలోనే అత్యవసర సప్లయిలను గూడా వుంచుతారు.

ఈ వర్షాకాలంలో ఆ గుడారాలూ, వాటిలో నేలా, తడిసిపోకుండా, ఈ వర్షాలకు అవి తట్టుకునేట్టుగా జాగ్రత్త పడటం అవసరం. ఈ వర్షాకాలం పొడుగునా జవాన్లు పలుగులూ, పారలూ పట్టుకొని కాలిబాటను యేర్పరచటం, నీళ్ళు లోపలికి రాకుండా ప్రక్కకు మళ్లించటం, మట్టి పెళ్లలు విరిగిపడకుండా జాగ్రత్తపడడం, నీళ్ళు నిలవకుండా శ్రద్ధ వహించడం, యీ విధంగా ఏవో పనులు చేస్తూనే వుంటారు.

దేశం నలుమూలలనుంచి వచ్చిన సైనికులు, వర్షం కురుస్తున్నా మంచు పడుతున్నా లెక్కచేయక కలిసిమెలిసి పనిచేస్తూ, ఎవరి విధులను వారు నిర్వర్తిస్తూ, అయితే ఎవరికి వారు ఒంటరిగా గాక పెద్ద యంత్రంలో ఒక భాగంగా కృషిచేస్తూ, శత్రు దురాక్రమణ జరగకుండా దేశాన్ని రక్షించటం చూస్తే ఉత్సాహం కలుగక మానదు. సరిహద్దు ప్రాంతాలలో పనిచేయటమంటే చాలా కష్టమైన పని. అయితే మన జవాన్లు వారికి సహజసిద్ధమైన పట్టుదలతో ధైర్యసాహసాలతో ఆ సవాలును యెదుర్కొంటున్నారు.



వర్షాలవల్ల యేర్పడిన తీవ్ర ప్రతికూల పరిస్థితుల్లో కూడా పట్టుదలతోమన జవానులు వార్తా సౌకర్యాలు ఏర్పర్చుకుంటున్న దృశ్యం.

# రామన్న

— జి. రామకృష్ణ

ఎడ్లను గురించి తండ్రి చెప్పిన మాటలు నరసన్నకు బాగా గుర్తున్నాయి. 'ఒరే నర్సా! అవి నోరులేని బసవన్నలురా. వాటిని వుసురుపెత్తే మనకే కీడురా. ఎద్దును అదిలించు–అంతేకాని ఒళ్ళూపైనా తెలియకుండా కొట్టమోకు' అనేవాడు తండ్రి–నరసన్న కోపంతో ఎద్దును కొట్టబోతున్నప్పుడు.

ఎప్పుడో జరిగిన సంఘటన ఒకటి నరసన్నకు బాగా జ్ఞాపకం. అప్పుడతను ఇంకా కుర్రతనంలోనే వున్నాడు. భూషమ్మతో తన కింకా పెళ్ళి కాలేదు. ఒకనాడు పొలంలోకి పెంటతోలడానికి బండి కట్టాడు నరసన్న. పొలం యింటికి రెండు మైళ్ళకుపైగా వుంది. అయిదుసార్లు తిరిగింది బండి. ఆరోబండి నింపాడు. ఇల్లు దాటిం తర్వాత ఎర్రెద్దు కదల్లేదు. అదిలించాడు. లాభం లేకపోయింది. చిన్నదెబ్బ వేశాడు. కదల్లేదు. గట్టిగా రెండు తగిలించాడు ఎద్దును తిడుతూ. ఎర్రెద్దు ముందుకు అడుగు వేయ లేదు. నరసన్న వుగ్రుడైపోయాడు. బండి దిగాడు. ఎద్దును చెర్నాకోలుతో డొక్కలో పొడిచాడు అరుస్తూ. ఎర్రెద్దుకు పోవాలని లేదు. త్రాళ్ళుపుచ్చుకొని గుంజాడుముందుకు. ఫలితంలేకపోయింది. వెనక్కువచ్చి మళ్ళా ఎర్రెద్దును బాదటం మొదలుపెట్టాడు.

ఈ గొడవ విన్న తండ్రి పరుగెత్తు కొచ్చాడు అక్కడికి. వీరనరసింహ స్వామిలా వున్నాడు అతడు. కొడుకువంక వురిమి చూశాడు. కళ్ళు నిప్పులు చెరుగుతున్నాయి. ముఖం కందగడ్డలా మారింది.

'ఏం చేస్తున్నావురా' అన్నాడు గర్జిస్తూ. తండ్రి అంత భయంకరంగా మాట్లాడటం నరసన్న యింతవరకెన్నడూ వినలేదు.

నరసన్న నోటివెంట మాటరాలేదు. తండ్రివచ్చి ఎర్రెద్దును నిమిరాడు.

'దానికి నోరులేకపోతే నీకున్న బుద్ధి ఏమయింది?' అతనికంఠం వణికి పోతున్నది. 'ఇలాగేనా గొడ్డును బాదేది. కసాయిపుటక పుట్టావ్... ఈదఫా ఎద్దుమీద దెబ్బపడనీ చెప్తా' అని బండి వెనక్కి మళ్ళించుకుని దొడ్లోకి తీసుకుపోయాడు.

ఇది జరిగి పదిహేనేళ్ళయింది. నరసన్న ఒక యింటివాడయ్యాడు. ఇంటి యజమాని కూడా తనే. తండ్రీ, తల్లీ ఇద్దరూ పోయారు.

ఎడ్ల విషయంలోమాత్రం తండ్రిమాటలు మర్చిపోలేదు.

పొలం పనిలోనూ, గొడ్ల పెంపకం లోనూ తండ్రి లక్షణాలే వచ్చాయని వూళ్ళో అంతా నరసన్నను మెచ్చుకొంటారు. ఎడ్లకు ఏలోటూ రానీడు. గొడ్లంటే వెర్రి అభిమానం. పాలేరు వున్నా వాటి సంగతి ఎప్పటికప్పుడు చూస్తూవుంటాడు. భూషమ్మ కూడా అంతే.

నరసన్నకు పొలంపని యిబ్బందయింది. తన దగ్గరున్న జతఎడ్లు పొలంపనికి తట్టుకో లేకపోతున్నాయి. అవి పెద్దవైపోయాయి. అంతకీ చాలాఏళ్ళు సాయపడ్డాయి.

ఆ జతని అమ్మేసి ఖరీదుగల జత కొన్నాడు. ఒకటి సంతలోకొన్నాడు. రెండో దాన్ని ఏటి అవతలనుంచి తెచ్చాడు. రెండిం టికీ జత బాగాకుదిరింది. ఎడ్లు మంచి బలంగా వున్నాయి. అన్నివిధాలా నాణెంచేయించి మరీ కొన్నాడు.

అవిరెండూ అన్నదమ్ముల్లా వున్నాయి. భూషమ్మ ముచ్చటపడింది. నరసన్న గర్వ పడ్డాడు. వాటికి ముద్దుగా రామన్న, లచ్చుమయ్య అని పేర్లుపెట్టాడు.

మునసబుగారి పెద్దబ్బాయి పట్నం వెళ్తుంటే వాటికోసం చక్కటి కుచ్చుతాళ్ళు, మెళ్ళోకి మువ్వలు తెప్పించాడు.

రామన్నని దాపల, లచ్చుమయ్యని వలపల కట్టాడు. భూషమ్మ దిష్టితీసింది. రచ్చబండ పక్కనుంచి నరసన్న బండి వెళ్తుంటే అక్కడ చేరిన ఆసాములు ఆజతను ఎంతో మెచ్చుకొన్నారు. నరసన్న వుబ్బిపోయాడు.

లచ్చుమయ్యే మంచి చురుకైందిగా కన్పించింది. లాగటంలో రామన్న కూడా తీసిపోదు. ఆయేడు నరసన్న పొలం చాలా సులభంగా దున్నాడు. పంటకూడా ఏపుగా వచ్చింది. నూర్పులయ్యాక వడ్లు కొలుచు కుంటే ఏటాకన్న ఆరుబస్తాలెక్కువ పండాయి.

ఎడ్లను మేపటంలో భూషమ్మకి మహాశ్రద్ధ. పచ్చిగడ్డి వేసి వూరుకోదు. మంచి దానాపెడుతుంది. ఉలవలు రుబ్బి కుడితిలో కలుపుతుంది.

నరసన్న గడ్డివామితోపాటు, జనపకట్టలు కూడా నిల్వవేసి వుంచుతాడు.

మళ్ళా పొలంపనులు ప్రారంభమయ్యాయి.

అసలు మొదటినుంచీ రామన్న లచ్చుమయ్యకన్నా లాగుడులో తక్కువే. ఈ మధ్య కొంచెం వెనకడుగు వేస్తోంది. అదో తరహా ఎద్దది. యిది పోట్లమారిది కాదు. అప్పుడప్పుడు కొంచెం మొరాయిస్తుంది. ఈ మధ్య ఎలాగైనా పేచీగానేవుంది దాంతో నరసన్నకు. నలతగానూ లేదు; మేత అదీ బాగానే తింటోంది. సుస్తిగావున్నట్టు తోచదు.

ఒకనాడు పొలంనుంచి బండి తోలుకొచ్చి పాకలో ఎడ్లను కట్టేశాడు. అప్పుడేదో గొణుక్కోవడం విన్నది భూషమ్మ. భర్త ఆలా ఎడ్లపైన చిరాకుపట్టం ఎప్పుడు చూడలేదు.

'ఏంటయ్యా అది!' అని అడిగింది కారణంతెలియక.

'ఆఁ ఏమీలేదే...ఈ మధ్య రామన్నతో పేచీగా వుందే' అన్నాడు ఎండుగడ్డి, జనప కట్టలూ ఎడ్లముందు వేస్తూ.

'బండి లాగటంలేదా?'

'లాక్కేం! లాగుతోంది. పేచీ ఎక్కువయింది. పని చురుగ్గా సాగటంలేదు'

భూషమ్మ ఒకనిమిషం ఆలోచించి 'దాని వంట్లో ఏమన్నా నలతగావుందేమో? అయినా ఒకసారి ఆ పశువుల డాక్టర్కి చూపించకూడదూ?' అని సలహాయిచ్చింది.

ఇది బాగానే వున్నట్లు తోచింది 'రేపు ఆపని చేయాలి' అన్నాడు నరసన్న.

మర్నాడు రామన్నను పశువుల డాక్టరు దగ్గరకి తీసుకువెళ్ళాడు. డాక్టరు వివరాలన్నీ తెలుసుకున్నాడు. రామన్నను బాగా పరీక్ష చేసి దోషమేమీ లేదన్నాడు.

ఏం చేయాలో తోచక రామన్నను ఇంటికి తోలుకొచ్చేశాడు.



సంగతంతా భూషమ్మతో చెప్పాడు. రామన్నకు జబ్బేమీ లేనందుకు సంతోషించింది.

ఏదోవిధంగా పొలం దున్నకం పూర్తి చేశాడు నరసన్న. బండి కదదామంటే భయంగా వుంది. మధ్యదార్లో ఎక్కడో ఆగిపోతుంది రామన్న. కదలదు. అతి కష్టంమీద ఒక అరగంటకు బండి కదులుతుంది.

ఎన్నో విధాల ప్రయత్నించి చూశాడు రామన్నను దార్లోకి తేవాలని. ఉపయోగం కన్పించలేదు. పొలంపనులు దెబ్బతింటున్నాయి.

'మరి, ఎలాగే దీంతో' అన్నాడు భూషమ్మతో ఒకనాడు.

భూషమ్మకు వుపాయమేమీ తోచలేదు.

నరసన్న మనసులో ఒక మాట వున్నది. భూషమ్మ ఏదైనా అందిస్తే అది బయట పెడదామనుకున్నాడు. భూషమ్మ మాట్లాడలేదు.

'మొన్న కొత్తపాలెం రత్తయ్య కన్పించాడు...' చెప్పటానికి సందేహిస్తున్నాడు నరసన్న.

'ఏమన్నాడు' అని అడిగింది భూషమ్మ.

'ఆఁ' ఏమీలేదు. మంచి ఎద్దొకటి బేరానికి వచ్చిందిట. మనూళ్ళో ఎవరికైనా కావాలేమో వాకబు చేయమన్నాడు.'

'అంతేగదా!' అంది భూషమ్మ.

'నాకొకటి అనిపిస్తోందే' అన్నాడు నరసన్న మనసులోనిమాట బయట పెట్టబోతూ.

'ఏమిటది?' అడిగింది భూషమ్మ కుతూహలంతో.

నరసన్నకు జంకుగా వుంది.

'మనకేఅవసరముందిగదాఅని చుస్తున్నా' భూషమ్మకు అర్థంకాలేదు.

'మన కెందుకు? ఒక జత చాలదా పనికి' అని అడిగింది.

రామన్ననుగురించి వివరంగా చెప్పాడు. ముందు భూషమ్మ ఒప్పుకోలేదు. నచ్చ చెప్పాడు.

'నాకు మటుకు సుతరామూ ఇష్టంలేదయ్యా. నువ్వేమో రామన్నను మార్చేయాలని పట్టుపడుతున్నావ్' అందిభూషమ్మ మనస్సు ఎంతో కష్టంచేసుకుని.

'ఓసి వెర్రిదానా! నాకుమటుకు ఇష్టమనుకున్నావా. పొలంపని మరీ దిగజారిపోతోంది. యీ మధ్య రెండింటికీ సరిగ్గా కుదరటంలేదు. పంట దెబ్బతింటుంది. అందుకని యిలా చేయవలసి వచ్చింది' అన్నాడు.

భూషమ్మ తన నోటితో కాదనలేకపోయింది.

నరసన్న కాసేపాగి 'మన రామన్నను ఒంటెద్దుబండి కోటయ్య అడిగాడు. అతనికిద్దామనుకుంటున్నా' అన్నాడు.

తన వూళ్ళోనే రామన్న వుంటున్నందుకు భూషమ్మ సంతోషించింది కొంతలో కొంత.

అనుకున్న ప్రకారం నరసన్న కొత్త ఎద్దును తోలుకొచ్చాడు. రామన్నను కోటయ్యకు అమ్మాడు.

రామన్న లేని పాకబోసిపోయింది. ఆనాడు భూషమ్మ అన్నం తినలేదు. లచ్చుమయ్య మేత ముట్టలేదు. నరసన్న పాకలోకి పోయి ఎవ్వరూ చూడకుండా కళ్ళు తుడుచుకున్నాడు.

కొత్త ఎద్దు పొలంపాటుకు బాగా అలవాటు పడింది. సులభంగానే లచ్చుమయ్యకు జత కుదిరింది.

కోటయ్య యింటికి చేరిన రామన్నకు అంతా కొత్తగావుంది. ఇదివరకు మాదిరి మేతలేదు. కుడితిలేదు. కాసిని పచ్చిగడ్డి పరకలు, ఎండుగడ్డి, చెరువులో నీళ్ళు — వీటితో కడుపు నింపుకోవాలి.

రెండు మూడు రోజులు రామన్నకు అవేమీ సహించలేదు. కడుపులో కాలుతోంది. తినక తప్పలేదు. అది అలవాటు చేసుకోవటం తప్పనిసరి అయింది.

ఇకపని సంగతి చెప్పనక్కరలేదు. ఎంతబరువైనా తానే మోయాలి. ఆ బండి కూడా పాతడొక్కు. ఒక వూరూ, ఒకదారీ అంటూ లేదు ఆ ప్రయాణాలకు. నడక రకరకాలుగా సాగాలి బండిలోని వాళ్ళనుబట్టి.

కోటయ్య కర్కోటకుడు. జాలి అనేది ఏకోశానా లేదు. రామన్నను తెగకొడుతున్నాడు ఏ బరిక పడితే ఆ బరికతో. నాడాలు వేయించడానికి అతని దగ్గర డబ్బులే మిగలవు.

రామన్నకు కంటిమీద సరిగా నిద్ర వుండటం లేదు. ఏ క్షణాన కోటయ్య వచ్చి లేవకొడతాడో తెలియదు. ఊళ్ళో ఎవరికి అవసరం వచ్చినా కోటయ్య దగ్గరికే వస్తారు.

ఒకనాటి సాయంకాలం నరసన్న పొలం నుంచి వస్తున్నాడు. ఎదురుగా కోటయ్య బండి వస్తోంది. రామన్నను చూశాడు నరసన్న. గుండె చివుక్కుమంది. ఎద్దు సగం అయింది. బండిలో అయిదుగురు మనుషులున్నారు. సామానుకూడా వుంది; లాగలేక లాగుతోంది. తోకమెలిపెట్టి తోలుతున్నాడు కోటయ్య.

బండి దగ్గరికి వచ్చాక 'పొద్దుపోయి బయల్దేరావే కోటయ్యా' అని పలకరించాడు.

'పట్నం పోతున్నానండి. కరణంగారి చుట్టాలు మెయిలు కెళ్తారంట' అన్నాడు బండి పోనిస్తూ.

నరసన్న ఆనాడు చాలా బాధపడ్డాడు. తాను చాలా పొరపాటు చేశానేమో

ననుకున్నాడు. తండ్రి మాటలు గుర్తుకొచ్చాయి. ఆ నోరులేని బసవన్న-అలా చిక్కిపోవడానికి తానే ముమ్మాటికి కారణమని గట్టిగా తోచింది నరసన్నకు. అందుకే అతని బాధ.

భూషమ్మతో చెపుదామనుకున్నాడు రామన్న సంగతి. కాని చెప్పలేక పోయాడు తప్పుచేసినవాడిలా.

రామన్న నరసన్నను గుర్తుపట్టింది. తన బాధనంతా అతనితో వెళ్ళబోసుకుందామనుకున్న ప్రయత్నాలన్నీ గొంతులోనే వుండిపోయాయి. కళ్ళతో ఏవేవో చెప్పింది. కాని అప్పటికే నరసన్న కళ్ళు చెమ్మగిల్లటం వల్ల ఆ కళ్ళను చూడలేకపోయాడు.

ఆ రాత్రి కోటయ్య బండి యింటికి తిరిగి వచ్చేటప్పటికి పదకొండు దాటింది. రామన్నకు చాలా అలసటయింది. పాకకూడా లేదు. ఆరుబయటే కట్టుకొయ్యకు కట్టేసి ఇంట్లోకి పోయాడు కోటయ్య. రామన్న కళ్ళలో నరసన్న మెదిలాడు. దిక్కులు దద్దరిల్లేటట్లు నరసన్నను పిలవాలనుకుంది. చేతకాలేదు. కన్నీళ్ళు జారి క్రింద గాటిలో వున్న నాలుగు ఎండుగడ్డి పరకల మీద పడినాయి.

రామన్నకు కాళ్ళు బాగా నొప్పులుగా వున్నాయి. పడుకోలేక పోయింది. అతి కష్టం మీద నడుం వాల్చింది. ఆదమరిచి ఒక కునుకు తీయడానికి ప్రయత్నించింది. మగత నిద్రపట్టింది.

ఇంకా తెల్లవారలేదు. తొలికోడి కూడా కూయలేదు. కోటయ్యని ఎవ్వరో పెద్దగా పిలుస్తున్నారు. ఆ కేక రామన్న చెవిని పడింది. బేజారెత్తింది రామన్నకు. మరో పది నిమిషాలకు కోటయ్య చర్నాకోలుదెబ్బ రామన్న వీపుమీద ఛెళ్ళుమంది. తనకీ యమచెర తప్పదా అని వగచింది రామన్న.

షావుకారు కనకయ్య రెండో కోడలు పుట్టింటికి వెళ్తున్నదట. ఆనాడు రామన్న వీపుమీద పడ్డ దెబ్బలకు లెక్కలేదు. వాతలు తేలాయి వీపునిండా.

మధ్యాహ్నానికి బండి తిరిగివచ్చింది. రావి చెట్టు దగ్గరికి వచ్చేటప్పటికి రామన్న బండిని నరసన్న యింటి వైపు మళ్ళించింది. కోటయ్య బండిదిగి రెండు బాది తన యింటి దారి పట్టించాడు. చెట్టుదగ్గరవున్న ఇద్దరు ముగ్గురు చూశారు దీన్ని. తర్వాత నరసన్న అటు వచ్చినప్పుడు చెప్పారా సంగతి. అతని మనస్సు కలుక్కుమంది. ఏం చేయటానికి తోచలేదు. రామన్న అలా చేయడం యిది మొదటిసారి కాదు. అది కోటయ్య యింటికి వెళ్ళిన దగ్గర్నుంచి ధ్యాసంతా యిటే నని నరసన్నకు తెలుసు.

రామన్న యిల్లు చేరుకున్నాక గడ్డి ముట్ట లేదు. కుడితి త్రాగలేదు. పోనీ లెమ్మనుకున్నాడు కోటయ్య. ఆనాడు అతనిరాబడి బాగా వుంది. అతనికి కావలసింది డబ్బు. అంతే.

మర్నాడు ప్రొద్దున్నే కోటయ్య భార్య వాకిట్లో నీళ్ళు జల్లుతోంది. దొడ్లో ఏదో చప్పుడయితే వెళ్ళింది. అప్పటికి ఎంత సేపటినుంచో పెనుగులాడుతున్న రామన్న మెడ త్రాడు తెంచుకుంది. ఎక్కడలేని శక్తి తెచ్చుకుంది. పరుగు లంకించుకుంది. ఇంతలో కోటయ్య భార్య వెళ్ళి భర్తను లేపి యీ సంగతి చెప్పింది. కోటయ్య రామన్న వెనక పరుగెత్తు కొస్తున్నాడు.

అప్పుడే పొలాలకు బయలుదేరిన ఇద్దరు ముగ్గురు రైతులు రామన్నను ఆపుదామని చూశారు. కాని రామన్న వారికి అందలేదు. ఉరకలు పరుగులతో నరసన్న యిల్లు చేరుకుంది. 'అంబా' అని అరిచింది. అది విన్న వాళ్ళ గుండెలు దద్దరిల్లాయి. దొడ్లో ముగ్గు వేస్తున్న భూషమ్మ తనను ఎవరో 'అమ్మా' అని పిలుస్తున్నట్లు అనిపించింది. ఆ ధ్వని తనకు ఎంతో పరిచితమైనది. ఎంతో ప్రియమైనది. గబగబా వచ్చింది. పొలానికి బయలు దేరబోతున్న నరసన్న రామన్న వేసిన రంకె విని అదిరిపడి పరుగెత్తు కొచ్చాడు.

ఆ దంపతులను చూసి రామన్న వాళ్ళకు దగ్గరగా వచ్చింది శరణు వేడుతున్నట్లు. కళ్ళనుంచి నీరు కారుతోంది.

నరసన్న, భూషమ్మ ఆశ్చర్యపోయారు. రామన్న వీపుమీద పులిచారలమాదిరి వున్న దెబ్బలను చూశారు. వాళ్ళ గుండెలు చెరువులై పోయాయి. ఇద్దరూ రామన్నను కావిలించుకుని వెక్కి వెక్కి ఏడుస్తున్నారు.

కోటయ్య పరుగుతో అక్కడకు వచ్చి యీ దృశ్యం చూసి విస్తుపోయాడు. చిన్నబుచ్చుకున్నాడు. మనస్సు కరిగిపోయింది.

నరసన్న సంబాళించుకుని భార్యను ప్రక్కకు తప్పించి రామన్నను తీసుకెళ్ళి తన పాకలో కట్టేసి వచ్చాడు.

'కోటయ్యా! ఇప్పుడే వచ్చి మాట్లాడుతాను. ఇంటిదగ్గరుండు' అని కోటయ్యను పంపేశాడు.

భూషమ్మ ఆనందానికి మేరలేదు. ఆమె ఆప్యాయంగా వేసినగడ్డి రామన్న కడుపు నిండా తింది.

నరసన్న భార్యతో సంప్రదించాడు.

కోటయ్య యింటికి వెళ్ళాడు నరసన్న. తాను అమ్మిన ధరకంటే పాతిక రూపాయలు ఎక్కువ యిస్తాను, రామన్నను తిరిగి యిచ్చేయమన్నాడు. కోటయ్యను మరో ఎద్దును కొనుక్కోమన్నాడు.

అప్పటికే కోటయ్యలో చాలా మార్పు వచ్చింది. తనలోని రాక్షసత్వం గ్రహించాడు. నోరులేని ఆ బసవన్న మూగభాష యిప్పుడర్థమయింది. ఎక్కువ డబ్బు ఇవ్వక్కర్లే దన్నాడు. కొన్న ధరకే తిరిగి యిచ్చేశాడు.

ఆరోజు పాలెంనుంచి మరో ఎద్దును కొనుక్కొచ్చాడు. ఎద్దును దయతో చూడటం నేర్చుకున్నాడు కోటయ్య.

నరసన్న దంపతులకు ఆనాడు పెద్ద పండుగ. లచ్చుమయ్య ఆనందంతో గంతు లేసింది. కొత్త ఎద్దు రామన్నతో నేస్తం కలిపింది.

రామన్నను తిరిగి లచ్చుమయ్యతో కలిపి బండి కట్టాడు నరసన్న. చక్కగా లాగింది. రామన్నలో వచ్చిన మార్పు చూసి నరసన్న సంతసించాడు.

ఇంకో ఎద్దును కొందామని చూస్తున్నాడు నరసన్న యిప్పుడు రెండో బండికి. కొంత పొలం మక్తాకి కూడా తీసుకున్నాడు. పని బాగా పెరిగింది.

రామన్న తిరిగి వచ్చింది కాబట్టి యీ యేడు పంట బాగా పండుతుం దని నరసన్న నమ్మకం.



### రాష్ట్ర రవాణాసంస్థ పునర్నిర్మాణం:

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం రాష్ట్రరవాణా సంస్థను దిగువ సభ్యులతో పునర్నిర్మించింది. ట్రాన్స్‌పోర్ట్ కమీషనరు (అధ్యక్షుడు). పోలీసు కమీషనరు (అధికార సభ్యుడు), రహదార్లశాఖ అదనపు చీఫ్ ఇంజనీరు (అధికార సభ్యుడు), శ్రీ కొత్తపల్లి పున్నయ్య, శాసనసభ్యుడు, న్యాయవాది, శ్రీకాకుళం (అనధికార సభ్యుడు). ప్రాంతీయ రవాణా సంస్థలను కూడా ప్రభుత్వం పునర్నిర్మించింది.

### నగరంలో దూరశ్రవణ యంత్రాల వాడకం:

1963 వ సం. పు హైద్రాబాదు నగరం దూరశ్రవణ యంత్రాల (వాడకం క్రమబద్ధం, లైసెన్సింగ్)నియమావళి, ఇది 1963 జూలై 18 వ తేదీ ఆంధ్ర ప్రదేశ్ గెజెటులో ప్రచురింపబడిన నాటినుంచి అమల్లోకి వచ్చింది.

ఈ నియమావళిలోని కొన్ని ముఖ్యాంశాలు ఇవి : పోలీసు కమీషనరునుంచి నిర్ణీత ఫారంలో లైసెన్సు పొందిన మీదటనే ఏదైనా బహిరంగ స్థలంలోగానీ ఏ సమయంలోనైనా దూరశ్రవణ యంత్రాలను నెలకొల్పుకోవాలి. లేదా సరఫరా చేయాలి. ఏదైనా ప్రార్థనాస్థలం, ఆసుపత్రి, సైలెన్సు జోన్, పబ్లిక్ కార్యాలయం లేదా విద్యాసంస్థనుంచి చుట్టూరా 200 మీటర్ల లోగా ఆఫీసు వేళల్లో ఈ యంత్రాలను ఉపయోగించరాదు. వీటి వాడకంవల్ల ఆ చుట్టుప్రక్కల నివసించే ప్రజలకు ఇబ్బంది కలగకూడదు. రాత్రి గం. 11 లు మొదలు ఉదయం. గం 6 ల వరకు వీటిని ఉపయోగించకూడదు.

దూరశ్రవణ యంత్రాలను ఉపయోగించదలిచిన రోజుకు కనీసం ఒకదినం ముందు దరఖాస్తుచేత లైసెన్సు పొందవచ్చు. దరఖాస్తులో దిగువ వివరాలను పొందుపరచాలి : దరఖాస్తుదారు పూర్తి పేరు, చిరునామా; సందర్భం; స్థలం; దూరశ్రవణ యంత్రాన్ని ఉపయోగించే కాలం.

దరఖాస్తుతో పాటుగా దిగువరేట్లలో ఫీజు చెల్లించాల్సి వుంటుంది : బహిరంగ సభకు




కానీ, సభలు, సమావేశాలు గురించిన ప్రచారానికి కానీ : ఒక రోజుకు ఒక్కొక్క దూరశ్రవణ యంత్రానికి రూ 2/-; వ్యాపార సంబంధమైన ప్రచారానికి : ఒక రోజుకు ఒక్కొక్క దూరశ్రవణ యంత్రానికి రూ. 4/-; ఇతర ఉపయోగాలకు : ఒక రోజుకు ఒక్కొక్కదానికి రూ. 1/-. హైద్రాబాదు మునిసిపల్ కార్పొరేషన్, ప్రభుత్వ కార్యాలయాలను లైసెన్సు ఫీజు చెల్లింపునుంచి లైసెన్సు ఇచ్చే అధికార్లు మినహాయించవచ్చు. ఇదే విధంగా ధర్మ కార్యాలకు ప్రజాసంస్థలు నిర్వహించే కార్యక్రమాల విషయంలో కూడా ఈ ఫీజును మినహాయించవచ్చు.

### ఎన్. సి. సి. కేడెట్లకు అల్పాహార భత్యం:

ఎన్.సి.సి., ఎన్.సి.సి. రైఫిల్ కేడెట్లకు అల్పాహారం నిమిత్తం ప్రతి రెండు గంటల పెరేడుకూ ప్రతి కేడెట్‌కూ 19 న. పై. ల చొప్పున భత్యం చెల్లించడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఉత్తర్వుచేసింది. ఇది 1963 అక్టోబరు మొదటితేదీనుంచి అమల్లోకి వస్తుంది. పాలు, రొట్టె, వెన్న, పండ్లు, బిస్కట్లు మొదలైనవాటిని కేడెట్లకు అల్పాహారంగా ఇస్తారు.

### వైద్యసహాయానికి ఏర్పాట్లు:

ఆంధ్రప్రదేశ్, మైసూరు, కేరళ ప్రభుత్వాలు ఆయా ప్రభుత్వోద్యోగులకు పరస్పరం వైద్యసహాయంచేసే విషయంలో ఏర్పాట్లు చేసుకున్నాయి. ఈ ఏర్పాట్లననుసరించి ఆంధ్రప్రదేశ్‌లోడ్యూటీమీదవుండే లేదా ఈ రాష్ట్రంగుండాప్రయాణంచేసే మైసూరు, కేరళ ప్రభుత్వాలకు చెందిన ఉద్యోగులకు రాష్ట్ర ప్రభుత్వం వైద్యసహాయం అందిస్తుంది. ఇదేవిధంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వోద్యోగులకు కూడా పై రెండురాష్ట్ర ప్రభుత్వాలు వైద్యసదుపాయాలు కల్పిస్తాయి.

### హైద్రాబాదు నగరం

హైద్రాబాదు నగరంపేరు చివరన "దక్కన్"అని చేర్చడంద్వారా హైద్రాబాదు

సింధ్ నుంచి దీనిని ప్రత్యేకంగా పేర్కొనడం జరుగుతున్నది. అయితే దేశవిభజనానంతరం హైద్రాబాదు — సింధ్ పాకిస్థాన్‌లో చేరిన ఫలితంగా ఇప్పుడు భారత దేశంలో హైద్రాబాదు అనే నగరం ఇది ఒక్కటే వుంది కాబట్టి దీని చివరన "దక్కన్" అని ఉదహరించడం అవసరమా అనే ప్రశ్న ఉదయించింది.

హైద్రాబాదు నగరం పేరు చివరన "దక్కన్" అని చేర్చడం ఇప్పుడు నిరుపయోగం కనుక ఆ విధంగా వ్రాయనవసరం లేదని ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం భావించింది.

## వేతనాలలో మినహాయింపు

తమ యజమానుల నుంచి ఈ క్రింద పేర్కొన్న సౌకర్యాలను, సర్వీసులను పొందే ఉద్యోగుల వేతనాలలో కొన్ని షరతులకు లోబడి మినహాయింపులు చేయడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అనుమతించింది. ఆ షరతులేమిటంటే అట్టి సౌకర్యం లేదా సర్వీసును ఉద్యోగ నిబంధనగా గానీ, ఇతరత్రాగానీ ఉద్యోగిపొందగోరే పర్యంతం అతని వేతనంలో మినహాయింపు చేయకూడదు. ఆ విధంగా చేసే మినహాయింపు యజమాని అందజేసే సౌకర్యం లేక సర్వీసు విలువకు సమానమైన మొత్తాన్ని మించరాదు. సౌకర్యాలు, సర్వీసులు ఇవి : ఖరీదు వెలకు ఆహార పదార్థాలు ఇతర జీవితావసర వస్తువుల సరఫరా లాభాపేక్షతో నిర్వహించబడని కాంటీన్లు, హోటళ్లు; అస్వస్థత సౌకర్యం నిధులు లేక ఇతర ప్రయోజనకరమైన నిధులు; చట్టం ప్రకారం రక్షిత వస్త్రాలు సరఫరా చేయాల్సిన అవసరమున్న సందర్భాలలో తప్ప ఇతరత్రా ఖరీదు వెలకు వస్త్రాల సరఫరా, యజమానులచే గృహ వసతి సమకూర్చ బడిన ఉద్యోగులకు సరసమైన రేట్లకు నీరు, విద్యుచ్ఛక్తి సరఫరా.

## భూమిశిస్తు రెమిషన్

కృష్ణా జిల్లా బందరు, దివి, గుడివాడ, కైకలూరు, గన్నవరం, విజయవాడ తాలూకాలలో వరద తాకిడికి గురైన గ్రామాలలో 1372 వ ఫసలీకి చెల్లించ వలసిన భూమి శిస్తులకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం దిగువ విధంగా రెమిషన్లు ప్రకటించింది : దిగుబడి నాలుగు అణాలకు పైన ఆరు అణాలు అంతకు లోపు వున్న తరీ భూములకు నీటి రేటు, శిస్తుల పూర్తి రెమిషన్.

## ఖాదీ, గ్రామీణ పరిశ్రమలకు వర్కింగ్ గ్రూప్

ఆంధ్ర ప్రదేశ్‌లో ఖాదీ, గ్రామీణ పరిశ్రమలకొరకు ప్రభుత్వం దిగువ సభ్యులతో వర్కింగ్ గ్రూపును నియమించింది :

శ్రీ సి. నరసింహం, ప్రణాళికా శాఖ కార్యదర్శి (అధ్యక్షుడు); స్వామీరామానంద తీర్థ, హైద్రాబాదు ఖాదీసమితి అధ్యక్షుడు, హైద్రాబాదు (సభ్యుడు); శ్రీ ఎస్. ఆర్. వెంకటేశం, ఖాదీబోర్డు సభ్యుడు (సభ్యుడు); పరిశ్రమలు వాణిజ్య శాఖ డైరెక్టరు, హైద్రాబాదు, (సభ్యుడు); ఆర్థిక గణాంకములశాఖ డైరెక్టరు, హైద్రాబాదు(సభ్యుడు), ఖాదీ గ్రామీణ పరిశ్రమల కమిషన్ జోనల్ డైరెక్టరు (సభ్యుడు); ఆర్థిక సలహాదారు (పరిశ్రమలు) (సభ్యుడు); ఆంధ్రప్రదేశ్ ఖాదీ పరిశ్రమలబోర్డు చీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, హైద్రాబాదు (సభ్యుడు — కన్వీనర్).

ఈ వర్కింగ్ గ్రూప్ విధులు ఇవి : తృతీయ ప్రణాళికా కాలంలో ఖాదీ, గ్రామీణ పరిశ్రమలకు సంబంధించిన కార్యక్రమాలు పథకాల ప్రగతిని సమీక్షించడం; ప్రస్తుత పరిస్థితులు తదితర లభ్యమైన బోగట్టా ఆధారంగా తృతీయ ప్రణాళికాంతం నాటికి సంభవించగల పరిస్థితులలోమదింపు, నాల్గవ ప్రణాళికకొరకు సాధ్యమైన సందర్భాలలో వచ్చే 15 సంవత్సరాలను (1966—81) దృష్టిలో పెట్టుకుని — ప్రతిపాదనలను రూపొందించడం.

1963 డిశంబరు—31 నాటికి నివేదిక సమర్పించవలసిందిగా ఈ వర్కింగ్ గ్రూప్‌ను అభ్యర్థించటం జరిగింది.

## రాష్ట్ర ప్రణాళికా సలహాసంఘం:

రాష్ట్ర ప్రణాళికా సలహాసంఘం 2, 3 ఉపసంఘాల సభ్యులుగా డాక్టర్ కె. ఎల్. రావు స్థానే వరుసగా శ్రీ కె. రామకృష్ణారెడ్డి, శ్రీమతి యశోదారెడ్డి గారలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నియమించింది. శ్రీ రామకృష్ణారెడ్డి మునుగోడు పంచాయతీ సమితి అధ్యక్షుడు, శ్రీమతి యశోదారెడ్డి పార్లమెంటు సభ్యురాలు.

## అమ్మకం పన్ను సలహాసంఘం పునర్నిర్మాణం

1957 వ సం. పు ఆంధ్రప్రదేశ్ సాధారణ అమ్మకం పన్ను చట్టం, ఇతర వాణిజ్య పన్నుల చట్టాల నిర్వహణ, విధానాలకు సంబంధించిన అంశాలపై ప్రభుత్వానికి సలహాల నిచ్చే నిమిత్తం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం దిగువ సభ్యులతో అమ్మకం పన్ను సలహా సంఘాన్ని పునర్నిర్మించింది. ఈ సంఘం రెండు సంవత్సరాల పాటు పని చేస్తుంది. అధ్యక్షుడు : వాణిజ్య పన్నుల శాఖ మంత్రి, కార్యదర్శి : వాణిజ్య పన్నులశాఖ కార్యదర్శి, సభ్యులు : శ్రీ పి. సుందరయ్య, శాసన సభ్యుడు; శ్రీ సి. రామయ్యా చౌదరి,

(మిగతా 46 వ పేజీలో)

# కాశ్మీరు బాధితులకు ఉదారంగా తోడ్పడండి

బక్షి గులాం మహమ్మద్
జమ్మూ, కాశ్మీరు ప్రధాన మంత్రి

ఒకదానివెంట ఒకటిగా మూడు సార్లు సంభవించిన ప్రకృతి సిద్ధమైన దుర్ఘటనల వల్ల కాశ్మీరులోయ తీవ్ర నష్టానికి గురయ్యింది. 1963 జూలై 20వ తేదీన పహల్గామ్ యాత్రాస్థలంలో విపరీతమైన వర్షాల కారణంగా సుమారు ముప్పయి మంది మరణించారు. ఎంతోమంది ఆస్తులకు నష్టం వాటిల్లింది. శ్రీనగర్ నుండి సరిగ్గా తొమ్మిది మైళ్ళ దూరంలోవున్న బెడ్‌గాం తాలూకాలో సెప్టెంబరు 2వ తేదీన 165 గ్రామాలను ఆవరిస్తూవున్న 60 చ. మై. ప్రాంతంలో భయంకరమైన భూకంపం సంభవించి 80 మంది చనిపోయారు. వేలకొలది ప్రజలు నిరాశ్రయులయ్యారు. దేశం నలుమూలల నుండేగాక వెలుపలినుండికూడా ఎంతో సహాయం అందుతున్నప్పటికీ యీ సహాయం ప్రస్తుత పరిస్థితిని అధిగమించడానికి చాలడం లేదు.

వీటికితోడు తిరిగి సెప్టెంబరు 13వ తేదీన శ్రీనగర్‌కు 36 మై. దూరంలో బండిపోరె పట్టణంవద్ద మరొక దురదృష్టకరమైన సంఘటన సంభవించింది. అగ్ని ప్రమాదంలో యించుమించు మూడింట రెండు వంతులు వూరంతా తగలబడి బూడిదై పోయింది. వందలకొలదీ యిళ్ళు, దుకాణాలూ పరశురామప్రీతి అయిపోయాయి. అదృష్టవశాత్తూ ప్రాణాపాయమేమీ సంభవించలేదు. సుమారు ఒక కోటి రూపాయల ఆస్తి ధ్వంసమై పోయింది. రాష్ట్ర ప్రభుత్వం చేతనైనంత వరకూ పునరావాస సౌకర్యం, యితర సహాయాలను అందజేస్తున్నది. వీరందరికీ పునరావాస సౌకర్యాన్ని కల్పించాలంటే అధికసంఖ్యలో సాధన సంపత్తులు అవసరమౌతాయి. దీనితో పోల్చి చూస్తే యిప్పుడు లభించిన సహాయం చాలా తక్కువనే చెప్పాలి.

కాశ్మీరు లోయలో చలికాలం ప్రవేశించింది. వీరందరికీ సాధ్యమైనంత త్వరలో గృహవసతి, వస్త్రాలు మొదలయిన సౌకర్యాలను కల్పించవలసిన అవసరమెంతయినా వుంది. అందుచేత దురదృష్టవంతులయిన మనతోటి ప్రజల బాధలను తొలగించి తోచిన మేరకు సహాయపడవలసిందిగా దేశ ప్రజలకు, యితరులకు విజ్ఞప్తి చేస్తున్నాను. సాధ్యమైనంత త్వరలో యీ సహాయం లభించవలసివుంది. లేకపోతే వేలకొలది ప్రజలు తీవ్రమైన చలికి గురికాక తప్పదు. గతంలో జమ్మూ, కాశ్మీరు రాష్ట్రంలో అనేక ప్రకృతి సిద్ధమైన దుర్ఘటనలు సంభవించినప్పుడు ప్రజలు ఆర్థికంగా, యింకా అనేక యితరవిధాలా సహాయపడి తమ ఉదారతను, త్యాగగరిమను ప్రదర్శించినట్టుగానే యిప్పుడుకూడా ప్రదర్శించగలరని నేను నమ్ముతున్నాను.

(శ్రీ బక్షి ప్రధాని పదవీ విరమణ చెయ్యకముందు చేసిన విజ్ఞప్తి.)

---

(45 వ పేజీ తరువాయి)

శాసన సభ్యుడు; శ్రీ పి. వీరభద్రరావు, శాసన సభ్యుడు; శ్రీ వాసుదేవ నాయక్, శాసన సభ్యుడు; శ్రీ టి. రంగారెడ్డి, శాసన సభ్యుడు; శ్రీ లక్ష్మికాంత రెడ్డి, శాసన సభ్యుడు; శ్రీ ఎన్. వి. గంగరాజు, శాసన మండలి సభ్యుడు, శ్రీ ఎం. ఆనందం, శాసన మండలి సభ్యుడు; శ్రీ ఎం. వెంకట నారాయణ, శ్రీ ఎస్. నారాయణప్ప, ఉరవకొండ, అనంతపురం జిల్లా, శ్రీ మొహిసిన్ ఎస్. మెహిదీ, మెసర్స్ రుబే హార్డ్‌వేర్ స్టోర్స్ ప్రొప్రైటర్, హైద్రాబాదు; ఆంధ్ర ప్రదేశ్ వాణిజ్య, పరిశ్రమల సమాఖ్య ప్రతినిధి, హైద్రాబాదు; ఆంధ్రప్రదేశ్ ధాన్యం, గింజల వర్తకుల సంఘం ప్రతినిధి, హైద్రాబాదు; ఆంధ్ర బియ్యంమిల్లు యజమానుల సంఘం ప్రతినిధి, విజయవాడ; వరంగల్ వాణిజ్య సమాఖ్య ప్రతినిధి. భారత వాణిజ్య సమాఖ్య ప్రతినిధి, గుంటూరు.

వాణిజ్య పన్నులశాఖకు చెందిన దిగువ అధికార్లుకూడా ఈ సంఘం సమావేశాలకు హాజరవుతారు : రెవిన్యూబోర్డు సభ్యుడు. (వాణిజ్య పన్నులు); రెవిన్యూబోర్డు సంయుక్త కార్యదర్శి (వాణిజ్య పన్నులు); వాణిజ్య పన్నుల డిప్యూటీ కమీషనర్లు. ★

# చైనా పోకడ...

— వాఙ్మయ మహోధ్యక్ష

[“బిచ్చం” చెరువులో చేపలు పడుతూ పాడతాడు ]

తకిటతద్ధిమి యెంత సిత్రము
కొంగ యేమన్నాదిరా ?
దొంగ జపములు చేసి చేపలు
మింగి వేస్తానందిరా !

స్నేహమంటూ చల్లచల్లగ
“చౌ ఎ” నేం చేశాడురా ?
హద్దుమీరి కొంతప్రాంతం
ఆక్రమించేశాడురా !

తకిటతద్ధిమి యెంత సిత్రము
కోడ లేమన్నాదిరా ?
చిలకపచ్చచీర తెస్తే
పలకరిస్తా నందిరా !

పోరెకూడని సుద్ది చెప్పే
“చైన” యేమన్నాదిరా ?
ఆటంబాంబుల అంతు చెబితే
ఆడతానన్నాదిరా - ఆ
టాడతా నన్నాదిరా !

తకిటతద్ధిమి యెంత సిత్రము
కుక్క యేం చేస్తుందిరా ?
కూడువేసిన కొంపకావలి
కాచి చూపిస్తుందిరా !

మంచిమన్నన - మద్దతులిస్తే
“మావు” ఏం చేశాడురా ?
పంచశీలను త్రుంచి యింటికె
చిచ్చు పెట్టేశాడురా !

తకిట తద్ధిమి యెంతసిత్రము
“మల్లి” యేమన్నాదిరా ?
గాలికెగిరిన పేలప్పిండి
కుష్టార్పణ మన్నాదిరా !

చావుతప్పి కన్నులొట్టై
“చైన” యేమన్నాదిరా ?
దిమ్మతిరిగి పోరునిలిపి
“శాంతి కోరా” నందిరా !

తకిటతద్ధిమి యెంత సిత్రము
“రత్తి” యేమన్నాదిరా?
పరుని చూచి మగనిచూస్తే
మొత్త బుద్ధన్నాదిరా !

దూరపుకొండలు నునుపు లనుకునె
ద్రోహి యేంచేస్తాడురా ?
కన్నుగప్పి కన్నతల్లికె
“గన్ను” గురిపెడతాడురా !

తకిటతద్ధిమి యెంత సిత్రము
‘నాగి’ యేమన్నదిరా ?
మగని మొత్తి యెదురు మొగసా
లెక్కుతానన్నాదిరా !

[యింతలో “బిచ్చం” భార్య ‘ఆదెమ్మ’ ప్రవేశించి పాట అందుకుంటుంది.]

ఆ :- మెల్లిమెల్లిగ మేరమీరి
చైన యేమన్నాదిరా ?
దాడిచేసి భారతీయులె
పాడి తప్పారందిరా !

బి :- తకిటతద్ధిమి యెంత సిత్రము
“వెంక” డేమన్నాడురా ?
తాను పట్టిన చెవులపిల్లికి
మూడెకాళ్ళన్నాడురా !

ఆ :- మంచిలోరి మాట చెబితే
“మావు” యేమన్నాడురా ?
యెవరు చెప్పిన - యెంత చెప్పిన
యెదురు మతమన్నాడురా - నా
దెదురు మతమన్నాడురా !

బి :- తకిట తద్ధిమి యెంత సిత్రము
నక్క యేమన్నాదిరా ?
యెంత యెగిరిన అందని ద్రాక్ష
పుల్ల రొడ్డన్నాదిరా !

ఆ :- ఊరు కెడమో ఉలపికట్టై
చైన యేమన్నాదిరా ?
దేశదేశాల్ కలిసి మనడం
“దేబె” బ్రతుకన్నాదిరా !

బి :- ఊఁ..పాట పాడతంటే దీనితస్సాదియ్యా “ ఆది ” అడుగులో అడుగేసుకుంటూ నక్కినక్కొచ్చింది కాక మాటకు మాటగా పాడతాందిరా ! దీనిపని యిట్టావుందేం !

తకిటతద్ధిమి యెంత సిత్రము
“ఆది” యేమన్నాదిరా ?
కొసరి కొసరి కూరమింగి
అసలె లేదన్నాదిరా !

ఆ :- ఎకరమైనా కొంప్రలేని
“బిచ్చ” మేం చేశాడురా ?
“రచ్చనకు” అని ఆలి సొమ్ములు
అరణ మిచ్చేశాడురా !

[ఆలిండియా రేడియో హైదరాబాద్ కేంద్రంవారి సౌజన్యంతో.]

# ఆధునిక భారతావనిలో ఆరాధ్య చిహ్నం

**పంజాబులోని భాక్రా నంగల్ ప్రాజెక్టులోని ప్రధాన భాగమైన భాక్రా ఆనకట్ట నిర్మాణం పూర్తి అయ్యింది. దీనిని అక్టోబరు 22 వ తేదీన భారత ప్రధాన మంత్రి శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ జాతి శ్రేయస్సుకు అంకితం చేశారు.**

**ఈ ఆనకట్ట ఆసియాలో ఆనకట్టలు అన్నిటికంటె పెద్దది. దీని ఎత్తు 740 అడుగులు. దీనిమూలంగా 3.6 మిలియన్ల ఎకరాలకు అదనంగా నీటి పారుదల సౌకర్యం కలుగుతుంది, ఇక్కడ నిర్మించిన జల విద్యుచ్ఛక్తి కేంద్రాలలో మొత్తం 800,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పాదన అవుతుంది.**

ఏ దేశమైనా కానివ్వండి, ఆర్థికాభివృద్ధి, సాధన సంపత్తుల అభివృద్ధి అక్కడి సహజ వనరులపైనా వాటిని అత్యుత్తమమైన పద్ధతిలో వినియోగంలోకి తీసుకొని రావడంపైనా ఆధారపడి ఉంటాయి. భారతదేశంలో నీటి వనరులు సమృద్ధిగా ఉన్నాయి. వీటిని వినియోగంలోకి తీసుకొని రావడంవల్లనే వివిధ రంగాలలో అభివృద్ధి సాధించటానికి వీలవుతోంది. అందువల్లనే ఈ నీటి వనరుల ప్రాముఖ్యాన్ని గుర్తించి నదీలోయ ప్రాజెక్టులను రూపొందించి పంచవర్ష ప్రణాళికలలో అనులు పరుస్తున్నాయి.

ఇటువంటి నదీలోయ ప్రాజెక్టులలో ఒకటి భాక్రా నంగల్ ప్రాజెక్టు. పంజాబు రాజస్థాన్ రాష్ట్ర ప్రభుత్వాలు రెండూ కలిసి ప్రారంభించిన ప్రాజెక్టు ఇది. అంతే కాదు ఆసియాలో ఇటువంటి ప్రాజెక్టులలో అన్నింటికంటె ఇది పెద్దది. సట్లెజ్ నదీ జలాలను నీటి పారుదలకు, విద్యుచ్ఛక్తి ఉత్పాదనకు పూర్తిగా వినియోగంలోకి తీసుకొని రావాలనే లక్ష్యంతో ఈ బ్రహ్మాండమైన ప్రాజెక్టు 1948 లో ప్రారంభించబడింది.

## భాక్రా ఆనకట్ట

ఈ బ్రహ్మాండమైన ప్రాజెక్టులో అతి ప్రధానమైనది భాక్రా ఆనకట్ట. ఈ ఆనకట్ట కట్టకముందు పంజాబులో ఇతర నదులలాగానే సట్లెజ్ కూడా వర్షకాలంలో వరదలు వచ్చి నానా భీభత్సం చేస్తూ వచ్చింది. ఇప్పుడు ఆనకట్ట నిర్మాణం పూర్తి కావడంతో పరిస్థితి అదుపులోకి వచ్చింది. ఆనకట్ట నిర్మాణంతో ఇక్కడ 55 మైళ్ళ పొడవున సువిశాలమైన ఒక సరస్సు ఏర్పడింది. ఇందులో 80,00,000 ఎకరపు అడుగుల నీరు నిలవచేయవచ్చును. ఇలా నిలవ అయ్యే నీటిలో 68,35,000 ఎకరపు అడుగుల నీరు ఇరిగేషనుకు, విద్యుచ్ఛక్తి ఉత్పాదనకు అందుబాటులో ఉంటోంది.

ఎడమవైపున విద్యుదుత్పాదన కేంద్రం భవనంతో సహా ఈ ఆనకట్ట నిర్మాణానికి షుమారు రూ॥ 72 కోట్లు ఖర్చు అయ్యింది. సిమెంటు కాంక్రీటుతో నిర్మించిన ఈ ఆనకట్ట ఎత్తు 740అడుగులు.

ఈ ఆనకట్ట నిర్మాణం ఇంజనీరింగు రంగంలో ఒక ఘన విజయమే అనవచ్చును. ప్రపంచంలో కల్లా పెద్ద మళ్ళింపు కాల్వలు, సొరంగాల ద్వారా నదీ జలమంతా మళ్ళించి ఆనకట్టకు కాంక్రీటు పని చేశారు. ఈ కాంక్రీటు పొయ్యడానికి ముందు 7.4 మిలియన్ల ఘనపు గజాల మట్టి, రాయి త్రవ్వి ఎత్తి పొయ్యవలసి వచ్చింది. ఈ ఆనకట్ట ఆక్రమించిన స్థల వైశాల్యంలో 1,00,000 గదులతో 60 అంతస్తుల ఆకాశాన్నంటుకునే మహా సౌధం నిర్మింప వీలవుతుంది.

## బహుళ ప్రయోజనాలు

భాక్రా నంగల్ ప్రాజెక్టు విజయవంతం కావడానికి ప్రధాన కారణం దీనివల్ల పెట్టిన పెట్టుబడిమీద ఎక్కువ ఆదాయం రావడమే. ఈ ఆదాయం సుమారు రూ॥ 175 కోట్ల మేరకు ఉంటుందని అంచనా. ఈ ప్రాజెక్టు మూలంగా వచ్చే ప్రత్యక్ష ఆదాయంలో నీటి పన్ను

పెంచిన భూమి శిస్తు, భూమి అభివృద్ధి పన్ను విద్యుచ్ఛక్తి అమ్మకంవల్ల వచ్చే ఆదాయం కూడా చేరి ఉన్నాయి. ఇలా ప్రత్యక్ష ఆదాయం ఉండడంచేత ఇది మంచి లాభదాయకమైన ప్రాజెక్టు అయ్యింది. దీనివల్ల పరోక్ష ప్రయోజనాలు అనేకం. ప్రజల భాగ్య సంపద పెరగడం, కరువు కాటకాల నివారణ, ఆహారపు పంటలు, వాణిజ్య పంటల అభివృద్ధి మూలంగా వ్యవసాయోత్పత్తి పెరుగుదల, పారిశ్రామికాభివృద్ధి, బంజరు భూములు వ్యవసాయం క్రిందకు రావడం, శరణార్థులకు పునరావాస కల్పన వంటివి ముఖ్యమైన పరోక్ష ప్రయోజనాలుగా పేర్కొన వచ్చును.

ఈ ప్రాజెక్టు మూలంగా అదనంగా మరో 6.7 మిలియన్ల ఎకరాలకు నీటి పారుదల సౌకర్యం కలుగుతుంది. ఇది కాక మరో 3.6 మిలియన్ల ఎకరాలలో ఈ ప్రాజెక్టు నుంచి అందే సాగునీరు మూలంగా ఇరిగేషను మెరుగు అవుతుందని ఆశింపబడుతోంది.

భాక్రా ప్రాంతంలో ఇప్పుడు గోధుమ, అమెరికా ప్రత్తి, చెరుకు పంటలు పండించడానికి వీలవుతున్నది. ఇక్కడ 11 లక్షల టన్నుల ఆహార ధాన్యాలు, 8 లక్షల బేళ్ల ప్రత్తి, 5 లక్షల టన్నుల చెరుకు పండగలదని అంచనా వేశారు.

ఈ ప్రాజెక్టు మూలంగా అంతిమంగా షుమారు 800,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అవుతుంది. ఈ ప్రాంతంలో పారిశ్రామికాభివృద్ధికి ఈ విద్యుచ్ఛక్తి ఎంతో తోడ్పడడమే కాకుండా అనేక ఇతర సమస్యలు పరిష్కారం అవుతాయి.

చెరుకు, చమురు విత్తులు, ప్రత్తివంటి ముడి సరుకు సమృద్ధిగా ఉత్పత్తి కావడంతో దానికితోడు తక్కువ ధరకు విద్యుచ్ఛక్తి లభ్యం కావడంతో ఈ ప్రాంతంలో తప్పకుండా అనేక రకాల ఫ్యాక్టరీలు అభివృద్ధి చెందుతాయి. షుమారు 5000 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యం కలుగ చెయ్యడం ఫలితంగా ఇక్కడ చిన్న తరహా కుటీర పరిశ్రమలు అనేకం ప్రారంభం అవుతాయి. విద్యుచ్ఛక్తి రావడంతో ఈ గ్రామాలలో స్త్రీ పురుషులకు పనిభారం తగ్గి కావలసినంత విశ్రాంతి కూడా లభిస్తుంది.



భాక్రానంగల్ ప్రాజెక్టు ప్రారంభోత్సవం తరువాత...

## ప్రాజెక్టులో ప్రధాన భాగాలు

ఈ ప్రాజెక్టులో మొత్తం ఎనిమిది యూనిట్లు ఉన్నాయి. అవి ఇవి: భాక్రా ఆనకట్ట, భాక్రా విద్యుదుత్పాదన కేంద్రం. విద్యుదుత్పాదన కేంద్రాలలో ఒకటి నది కుడిగట్టున రెండోది ఎడమ వైపు గట్టున ఉన్నాయి. నంగల్ ఆనకట్ట, గంగావాల్ కోట్లాలవద్ద జలవిద్యుచ్ఛక్తి ఉత్పాదన నిమిత్తం కాలువ, రూపర్ హెడ్ వర్క్సు, సిర్హింగ్ కాలవల పునర్నిర్మాణం, భాక్రా కాల్వలు, బిస్త్ దోయాబు కాలువ, ట్రాన్స్మిషన్ లైన్ల నిర్మాణం.

1954 లో నంగల్ ఆనకట్ట నిర్మాణం పూర్తి అయినప్పటినుంచీ ఈ ప్రాజెక్టు మూలంగా ప్రయోజనాలు సిద్ధించడం ప్రారంభమైంది. 1954 జూలైలో జల విద్యుదుత్పాదన నిమిత్తం నంగల్ కాలువకు, ఇతర కాలవలకు ప్రారంభోత్సవం జరిగింది. గంగావాల్ విద్యుత్కేంద్రం 1955 లోనూ, కోట్లా విద్యుత్కేంద్రం 1956 లోనూ విద్యుచ్ఛక్తి ఉత్పాదన ప్రారంభించాయి. రూపర్ హెడ్ వర్క్స నిర్మాణం, సిర్హింట్ కాలువ పునర్నిర్మాణం, బిస్త్ దోయాబ్ కాలవల త్రవ్వకం కూడా పూర్తి అయ్యింది.

ఎడమ వైపు గట్టున విద్యుచ్ఛక్తి

ఉత్పాదన కేంద్రం నిర్మాణం కూడా పూర్తి అయ్యింది. ఇక్కడనుంచి విద్యుచ్ఛక్తి సరఫరా కూడా ప్రారంభించారు. ఈ కేంద్రంలో నెలకొల్పబడిన ఒక్కొక్కటి 90,000 కిలోవాట్ల విద్యుదుత్పాదన శక్తి గల అయిదు యూనిట్లలో మూడు యూనిట్లనుంచి విద్యుచ్ఛక్తి నయా నంగల్‌లోని రసాయన ఎరువుల ఉత్పత్తి ఫ్యాక్టరీకి సరఫరా చెయ్యాలనీ, మిగతా రెండు యూనిట్లనుంచి ఇతర అవసరాల నిమిత్తం విద్యుచ్ఛక్తి సరఫరా చెయ్యాలనీ ఉద్దేశిస్తున్నారు.

## భాక్రా ఆనకట్ట, విద్యుత్కేంద్రాలు

నది పర్వత ప్రాంతాలనుంచి మైదానాలలోకి ప్రవేశించే చోట ఈ బ్రహ్మాండమైన భాక్రా ఆనకట్ట నిర్మింపడం జరిగింది. ఎడమ గట్టున నిర్మించిన జల విద్యుచ్ఛక్తి ఉత్పాదన కేంద్రం దేశంలో విద్యుదుత్పాదన కేంద్రాలలో అన్నింటి కంటె పెద్దది. సుదూర ప్రాంతాలలో ఇండ్లకు క్షేత్రాలకు, ఫ్యాక్టరీలకు, గొట్టపు బావులకు విద్యుచ్ఛక్తి అందచేసేందుకు భాక్రా ఆనకట్టవద్ద నుంచి అన్ని వైపులకు హైటెన్షన్ ట్రాన్స్మిషన్ లైన్లు నిర్మించారు. తృతీయ ప్రణాళిక ఆఖరులోగా నది కుడి గట్టున విద్యుదుత్పాదన కేంద్రం నిర్మాణం పూర్తి కాగలదని ఆశింపబడుతోంది. ఇక్కడ మరింత విద్యుదుత్పాదన శక్తి గల యంత్రాలు అమర్చడం జరుగుతుంది. కుడి గట్టున నిర్మించే విద్యుత్కేంద్రంలో ఒక్కొక్కటి 120,000 కిలోవాట్ల విద్యుదుత్పాదన శక్తి గల అయిదు విద్యుదుత్పాదన యూనిట్లు నెలకొల్పడానికి వీలవుతుంది.

## నంగల్ ఆనకట్ట

నదీ ప్రవాహాన్ని దిగువన భాక్రా ఆనకట్టకు ఎనిమిది మైళ్ళ దూరంలో నంగల్ ఆనకట్ట నిర్మించారు. దీని ఎత్తు 95 అడుగులు. దీని మూలంగా 350,000 క్యూసెక్కుల వరద నీరు నిలిపి ఉంచడానికి అవకాశం కలిగింది.

సట్లెజ్ నదీ జలాన్ని విద్యుదుత్పాదనకూ, ఇరిగేషనుల నిమిత్తం నంగల్ కాలవలోకి మళ్ళించేందుకు ఈ ఆనకట్ట ఉద్దేశించబడింది. దీని మూలంగా 24000 ఎకరపు అడుగుల నీరు నిలవ చెయ్యవచ్చును. ఈ నంగల్ కాలువ సట్లెజ్‌నది ఎడమ గట్టు వైపున సరిగ్గా నంగల్ ఆనకట్ట ఎగువ నుంచి త్రవ్వారు. సిమెంటు పని చేసిన ఈ కాలువ పొడవు 39.6 మైళ్ళు. దీని నుంచి 12,500 క్యూసెక్కుల నీరు విడవ వచ్చును.

## గంగవాల్, కోట్లా విద్యుత్కేంద్రాలు

జల విద్యుచ్ఛక్తి ఉత్పాదన నిమిత్తం త్రవ్విన కాలువ గట్టున రెండు విద్యుత్కేంద్రాలు ఒకటి నంగల్ నుంచి మైలు దూరంలో గంగవాల్ వద్ద, రెండోది ఆరుమైళ్ల దూరంలో కోట్లావద్ద నిర్మించారు. వీటిలో ఒక్కొక్క కేంద్రంలో ఒక్కొక్కటి 24,000 కిలోవాట్ల విద్యుదుత్పాదన శక్తిగల రెండు యూనిట్లు, 29,000 కిలోవాట్ల విద్యుదుత్పాదన శక్తి గల ఒక యూనిట్టు ఏర్పాటు చేస్తారు. ఈ రెండు విద్యుత్కేంద్రాలు కలిసి మొత్తం 1,54,000 కిలోవాట్లవిద్యుచ్ఛక్తి ఉత్పాదన అవుతుంది.

## ట్రాన్స్మిషన్ లైన్లు

ఇక్కడ ఉత్పత్తి అయ్యే విద్యుచ్ఛక్తి వాడకందారులకు అందజేసేందుకు గాను అనేక ట్రాన్స్మిషన్ లైన్లు వేశారు. ఢిల్లీకి విద్యుచ్ఛక్తి సరఫరా చేసేందుకు ఒక డబల్ సర్క్యూట్ 220 కె. వి. ట్రంక్ ట్రాన్స్మిషన్ లైను, లూధియానాకు విద్యుచ్ఛక్తి సరఫరా చేసేందుకు మరో డబల్ సర్క్యూట్ 132 కె. వి. ట్రంక్ ట్రాన్స్మిషన్ లైను వేశారు. ఈ లైను లూధియానా వద్ద రెండు సింగిల్ సర్క్యూట్ లైన్లుగా చీలుతుంది. ఒకటి జలంధర్‌కూ, రెండోది మోగా, ముక్తసాల్ విద్యుచ్ఛక్తి గ్రిడ్ తాలూకు ఉప కేంద్రాలకూ విద్యుచ్ఛక్తి సరఫరా చేస్తాయి. ఒక సింగిల్ సర్క్యూట్ 312 కె. వి. లైను పానిపట్టు నుంచి హాన్సీ, హిస్సార్, రాజగర్హ్, రత్నగర్‌లకు వెళుతుంది.

అంబాలా, పానిపట్, లూధియానా, జలంధర్ వంటి ముఖ్యమైన ప్రదేశాలలో విద్యుచ్ఛక్తి గ్రిడ్ తాలూకు ఉప కేంద్రాలు ఏర్పాటు చేశారు.

---

# గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

కృష్ణా జిల్లా కైకలూరు తాలూకా పెరువూరు గ్రామానికి, అనంతపురం జిల్లా పెనుకొండ తాలూకా బుచ్చయ్యగారిపల్లి గ్రామానికి గత ఆగస్టు నెలలో విద్యుచ్ఛక్తి సౌకర్యం కల్పించబడింది.

# ఆంధ్రుల పండుగలు

ఓ. నీలకంఠశాస్త్రి

జనులకు ఆనందమును కలుగజేయు ఉత్సవ దినములనే పండుగలని అందురు. ఈ యుత్సవములు ప్రపంచమునం దంతటను సామాన్యముగ ఉన్నవే అయినను ఆ యుత్సవముల నిర్ణయము మాత్రము ఆ యా మతములనుబట్టిగాని దేశకాలపరిస్థితులను బట్టిగాని ఆ యా జాతుల మనస్తత్త్వములను బట్టిగాని వేరువేరు స్వరూపముల వెలయు చుండును. ప్రతి దేశమునందును ఆ దేశము నందలి మహాపురుషుల జన్మమునకు సంబంధించి గూడ కొన్ని ఉత్సవములు ఏర్పడు చుండును.

భారత దేశమునందలి హిందువుల కందరకును చాల పండుగలు సమానములే యైనను శైవ వైష్ణవాది మతములలో వారి వారికి గల స్వల్పము లగు భేదములను బట్టి కొన్ని పండుగలు మాత్రము భేదించు చుండును. ఉదాహరణమునకు — దేశమున సామాన్యముగ ఆచరింపబడు "వినాయక చతుర్థి" అను ఉత్సవమును శైవమునకు సంబంధించిన దను ఆశయముతో వైష్ణవులు ఆచరింపకపోవుట కూడ కలదు. ఏది ఎట్లున్నను భారతదేశమునంతటను పరికించినచో భారతము నంతకును సంబంధించిన పండుగలే విశేషముగ నగపడుచుండును గాని ప్రత్యేక రాష్ట్రమునకు సంబంధించిన ఉత్సవములు సామాన్యముగ గానరావు. అట్టివి చాల స్వల్పము లనియే చెప్పవచ్చును. అట్టి వానిలో ఉత్తర దేశమునందు ప్రధానముగ నాచరింపబడు "హోళికోత్సవము" ఒకటి. ఇయ్యది ఔత్తరాహుల చేతనే గాని దాక్షిణాత్యులచే ఆచరింపబడదు. ఫాల్గుణ శుక్ల చతుర్దశి దినమున కామదహన మనెడి ఒక ఉత్సవమును జరిపి ఆ మరుసటి పూర్ణిమ దినమున ఈ హోళికోత్సవమును జరుపుదురు.

ప్రధానము లగు పండుగలు భారతదేశము నందంతటను ఆచరింపబడుచునే యున్నను అవి అన్ని చోటులయందు ఒకే రీతిగా ఆచరింపబడుచున్న వని చెప్పుటకు వీలులేదు. ఆ యా దేశాచార భేదముచే వారి ఆచరణము నందు కొంత కొంత విశిష్టత అగుపడు చుండును. దానిని పరిశీలించినచో ఆ యా దేశవాసుల మనస్తత్త్వములు గూడ మనకు గోచరించుచుండును.

భారత దేశమునందు ఆచరింపబడు ఉత్సవములు మూడు విధములుగా నున్నవి. అందు మొదటివి — చైత్ర — ఆశ్వీన మాసారంభమున ఆచరింపబడు నవరాత్రములు, శ్రీ రామాదిజయంతులు మున్నగునవి. ఇయ్యవి దేశమునందంతటనూ ఇంచుమించు ఒకే విధముగా ఆచరింపబడునట్లు చెప్ప వచ్చును. ఇక రెండవ తరగతికి చెందినది వినాయకచతుర్థి మున్నగు వ్రతములు. ఇవియును దేశమునందంతట తుల్యముగనే ఆచరింపబడుచుండును. ఇక మూడవ తరగతికి చెందినవి గ్రామదేవతలు మున్నగు వారికి సంబంధించిన "జాతరలు". ఇవి ఆ యా దేశములకు ఆ యా గ్రామములకు మాత్రమే సంబంధించి యుండుటచే వీని ఆచరణము మాత్రము ఆ యా దేశభేదముచే మిక్కిలి భేదించు చుండును. కాని దేశము నందు నవరాత్రాద్యుత్సవములను వ్రతములను ఈ జాతరలనుకూడ పండుగలనియే జనులు వ్యవహరించుచున్నారు. సర్వసామాన్యములగు పండుగలనుగూర్చి మనము చర్చించునపుడు ప్రతి గ్రామభేదముచేతను భిన్నభిన్నములయిన ఈ జాతరలను గూర్చి మనము చర్చింపబనిలేదు. మిగిలిన రెండు విధము లగు పండుగలనే మనము విచారింప వలసియుండును. కావున ఈ నిర్ణయముతోడనే ఆంధ్రదేశమున ఆచరింపబడు పండుగుల స్వరూపము విచారింతము.

ఈ పండుగులకు మూలము నాలోచించినచో కొన్ని వైదికములుగాను మరి కొన్ని స్మార్తములుగాను వేరొక కొన్ని పౌరాణికములుగాను తాంత్రికములుగాను గానవచ్చు చున్నవి. ఈ యుత్సవములనాడు జనులు అవలంబింపవలసిన ధర్మములు. ఓర్మి — సత్యభాషణము—దయ—దానము—శుచిత్వము— ఇంద్రియ నిగ్రహము — దేవపూజనము — హోమము — సంతోషము — ఇతరుల సొత్తు నాశింపకుండుట యని స్మృతులయందు పేర్కొనబడినది. వ్రతపరులగు జనులం

దరును నిజముగా ఈ ధర్మముల నవలంబించియే యుందురు.

### ఉగాది:

చంద్ర నక్షత్రముల సంబంధమును బట్టి యేర్పడిన చైత్రాది మాసములను బట్టి యీ తెలుగు సంవత్సర వ్యవహారము ఏర్పడుట వలన దీనిని "చాంద్రమాన సంవత్సరాది" అని యందురు. ఇది ఆంధ్ర దేశమునఁ గల విశిష్టతయే. ఈ దినము జ్యోతిర్గణిత శాస్త్ర ప్రకారము ఒక కల్పాది యగుటచే దీనిని "యుగాది"యని వ్యవహరించిరి. ఆ 'యుగాది'యే "ఉగాది" అయినది.

భారత దేశమునందు కాల వ్యవహారము ఆయా రాష్ట్రభేదములచే అనేక విధములుగా నున్నది. అందు సూర్యగమనముచే నొప్పు మేషాది సంక్రాంతులకు ప్రాధాన్యము నొసగి తన్మూలకములగు మేషాది మాసములనే(సౌర మాన ప్రకారము)వ్యవహారమున నుపయోగించుట ద్రవిడ దేశమున నగపడుచున్నది. అటులనే ఉత్తర దేశమున బార్హస్పత్యాది మాసములకుఁ బ్రాధాన్యము నొసగుటచే వాని వాని విశేషములనుబట్టి వారల సంవత్సరారంభములు వేఱగుచుండును. కాని సకలకర్మలకు చాంద్రమాసము ప్రధానమగుటచే హిందువు లందఱు తమ తమ మానములతో పాటు ఈ చాంద్రమానమునుగూడ మిగుల నాదరింతురు. ఈ సంవత్సరా ద్యుత్సవము ఏనాటినుండి యారంభమై యుండునో మన-మూహింప నలవికాదు. వైదిక కర్మల నాచరించుటకు సంకల్పమును చేయవలయును. సంకల్పమున సంవత్సరపరికీర్తన మావశ్యకము. కావున సంవత్సరారంభ దివసము తమ జీవితారంభ దివసముగా నెన్ను కర్మపరులు సంవత్సరాదిని తప్పక యుత్సవ దివసముగా బరిగణింతురనుటకు సందేహములేదు. కావున కర్మారంభ మప్పుడారంభమై యుండును.

ఉగాది దినమున హిందువు లగు నాంధ్రులలో ప్రతివాడును పైనిదెల్పిన వ్రత లక్షణము నవలంబించుచు తమ సంవత్సర జీవితమును నిర్ణయించు నదీ దినమే యని తలంచుచు పవిత్రముగాను ఉత్సాహముగాను ఉండును. ఉదయముననే లేచి ఆబాలవృద్ధము తలగడుగు పోసికొని నూతన వస్త్రములను ధరింతురు. శిష్టులగువారు దాన ధర్మాదుల నొనర్చి దేవపూజనములను గావించుకొందురు. గృహస్థులు తమ పుత్రికలను అల్లురను ఆహ్వానించి తొట్టతొలుత ఆమ్రఫల నింబకుసుమ మిశ్రిత నూతనగుడయుత తింత్రిణీ రసమును ప్రథమ కబళముగా స్వీకరింతురు. ఇద్దానిని పవిత్ర భక్ష్యముగా పరిగణింతురు. కాని ఆంధ్రులకు ప్రధాన రుచియగు కారము ఇందు మిశ్రితము చేయక పోవుటకు గారణము గానరాకున్నది. దీనినే "ఉగాది పచ్చడి" అని యందురు. తరువాత పిండివంటలతో భుజింతురు. మధ్యాహ్నము మూడు నాలుగు గంటలు మొదలు క్రొత్త పంచాంగములను దీసికొని పురోహితులు జ్యోతిర్విదులు దేశముయొక్కయు జనుల యొక్కయు సంవత్సర ఫలితములను గుంపులుగాఁ జేరిన జనులకు వినిపించుచుందురు. అద్దానిని వినుటకు జనులొకచోఁ జేరి తమ భావి భాగ్యోదయము నిర్ణయించుకొనుటకు ఉత్సాహపడుచుందురు.

దీనితోపాటు శ్రీ దేవ్యుపాసకులు ఈ సంవత్సరాదియందే వసంత నవరాత్రముల నాచరించుటకు సంకల్పించి పరదేవతావాహనముచేసి పూజల నారంభింతురు.

అట్లేకొందఱు ధార్మికులు చలివేంద్రములను(ప్రప) ఈ దినముననే ఆరంభించి వేసవి నాల్గునెలలును అవ్వానిని నిర్వహింతురు.

కావున నీ యుగాది తెలుగువారి జీవితమునకే అభ్యుదయారంభమై అత్యుత్సాహముతో ఆంధ్రదేశమున నంతటను నిర్వర్తింపబడుచు వారల జీవిత మనస్తత్వములకు ప్రతిబింబరూపమున నొప్పుచున్నది.

### శ్రీరామ నవమి:

ఆంధ్రదేశమున భద్రాద్రి మున్నగు రామ క్షేత్రములు శ్రీరామాలయములు పెక్కులు గలవు. కావుననే ఇందు రామభక్తులు అగణితముగ నుందురు. చైత్ర శుక్లనవమి నాడు పురుషోత్తము డగు శ్రీరామచంద్రమూర్తి యవతరించుటచే ఈ దినమునుజనులు పవిత్రదినముగా భావించి ఈ దినమున ఉపవాసములు భజనలు .హరికథలు మున్నగు పవిత్ర కృత్యముల నొనరించి తమ భక్తిని ప్రకటింతురు. ఏ పట్టణములో గాంచినను పల్లెలలో గాంచినను పందిళ్ళు పాకలు వేయించి అందు సీతా రామ లక్ష్మణ హనుమద్విగ్రహములనుంచి పూజనములను చేయుచు వడపప్పు పానకములను పంచుచు బీదల కన్నదానములు చేయుచు ప్రజలు మిక్కిలి యుత్సాహవంతులుగా నుందురు. ఈ యుత్సవములను ఆ యొక్క దినమేగాక యథాశక్తిగ తొమ్మిది దినముల వఱకుగూడ జేయుచుందురు. ఈ వినోదములను గాంచుటకై పల్లెప్రజలు వేలకొలంది పట్టణములకువచ్చి యీ యుత్సవములలో బాల్గొనుచుందురు. ఈ యుత్సవము ఇతర దేశములకంటె ఆంధ్రదేశమునందే మిగుల సాటోపముగా జరుగునని చెప్పవచ్చును.

ఈ యుత్సవము ఆదర్శభూతుఁడగు మహాపురుషుని జీవితము నాధారముగా బయల్వెడలుటచే ఇద్దాని యారంభకాలమును గూర్చి విచారింప బనిలేదు.

### కర్కాటక సంక్రాంతి:

సూర్యుడు పంద్రెండు రాసులయందును నెలకొక్కొకటి చొప్పున సంక్రమించు

చున్నను దక్షిణోత్తరాయములకు ఆరంభకము లగుటచే ఈ కర్కాటక మకరసంక్రాంతులు మిక్కిలి పవిత్రములుగా నెన్నబడుచున్నవి. వీనిలోగూడ హిందువుల మత సిద్ధాంతమునుబట్టి యుత్తరాయణము మిగుల పవిత్రమైన దగుటచే ఈ దక్షిణాయనారంభ మగు కర్కాటకముకంటె మకర సంక్రాంతియే మిగుల ప్రధాన మగుచున్నది. అయినను ఈ కటక సంక్రాంతి యందుగూడ సంక్రమణమునకు ముందుగా ఇరువది గడియలవఱకు పుణ్యకాలముగ పరిగణించి ఆ సమయమున దానధర్మాదులను శ్రాద్ధాదులను గూడ జను లాచరింతురు. ఇయ్యది ఆషాఢ మాసమున వచ్చుచుండును. ఈ సంక్రాంత్యుత్సవములు స్మృతులందు కీర్తింప బడుటచే ఇయ్యది స్మృత్యారంభకాలము నుండియు బయల్వెడలినట్లు మనము చెప్పవచ్చును.

## ఆషాఢ పూర్ణిమ :

దీనినే గురుపూర్ణిమ — వ్యాస పూర్ణిమ యని వ్యవహరింతురు. ఈ దినము గురు శిష్య సంప్రదాయము గలవారలకు మిక్కిలి ప్రధానము. ఇందున సంప్రదాయముగ నధ్యయనము గావించు శిష్యులు గురువుల కడకేగి వారల పాదపూజలొనర్చి వారి యాశీస్సుల నందుట భారతీయ సంప్రదాయ మగుచున్నది. ఈ యాచారము ఆంధ్రదేశము నందుగూడ మిక్కిలి పవిత్రముగా ఎన్నబడు చుండెను. కాని శిష్యానుగ్రహమును గోరుకొని తమ జీవితమును వెళ్ళబుచ్చు నీ కాలమునందు ఈ యుత్సవము క్రమముగా నశించుచున్నదని చెప్పినచో ఆశ్చర్యములేదు.

మఱియు సన్యాసులుగూడ ఈ దినమున "వ్యాసపూజ" యనుపేరిట తమశిష్యగణములతో గూడి తమ గురుపరంపరను మండపము నందావాహనము గావించి పూజించుట ఆంధ్రదేశమునందుగూడ సంప్రదాయసిద్ధ మగు చున్నది

## శ్రావణ మాసము :

ఈ మాసమునందలి మంగళవారములును శుక్రవారములును ఆంధ్రదేశమున పర్వ దినములుగా భావింపబడు చున్నవి. ఈ దినము లందు నూతన వధువులేగాక సామాన్యులగు ముత్తయిదువులును నోములు నోచికొని నూతనవస్త్రాలంకరణములతో నలంకరించుకొని మహోత్సాహములతో నొప్పుచుందురు. ఆ రెండు వారములందును గ్రామ నగరముల యందలి వీధులు సౌభాగ్యదేవతలకు నిలయమైనట్లుకలకలలాడుచు చూచుట కెంతోయో ఆనందమును కలుగజేయుచుండును.

ఇట్టి యుత్సవములు సంఘోత్సాహ మూలకములై ప్రాచీన గ్రంథములయందు గానరాక పోవుటచే అర్వాచీనములే యైనట్లు మన మూహింప వచ్చును.

## శ్రావణ పూర్ణిమ :

శ్రావణ పూర్ణిమ చాల పవిత్రదినముగ పరిగణింప బడుచున్నది. ఈ దినమునందు ద్విజుడు ఉపాకర్మయనెడి యొక పవిత్ర మగు కర్మను ఆచరించి అద్దానికి అవసరము లగు హోమాదికృత్యములను నెరవేర్తురు. నూతన వటువులకు ముంజసంస్కారము నొకదానిని జేయుదురు. దీనినే సాధారణముగా "ముంజపౌర్ణమి" జందెముల పూర్ణిమ అని గూడ వ్యవహరింతురు. వైదిక కర్మలకు అనుబంధముగా సర్వ స్మృతులయందును ఇయ్యది విధింపబడుటచే ఈ స్మార్తమగు నుత్సవము చాల ప్రాచీనమైనదనియే చెప్పవలయును.

## కృష్ణాష్టమి :

ఇయ్యది శ్రీకృష్ణ భగవాను డవతరించిన నది పవిత్రదినము. ఇది శ్రీరామనవమివలె మహాసంరంభముతో ఆంధ్ర దేశమున నాచరింపబడక పోయినను ప్రధానోత్సవములలో నియ్యదిగూడ పరిగణింప బడుచున్నది. శ్రీ రామ నవ మ్యుత్స వము సు పామర జనులుసైతము ఆచరించుచుండ నిది మాత్రము విజ్ఞులకే ఆదరణీయ మగుచున్నది. దీనినిబట్టి తెలుగు వారలకు శ్రీరామునివలె శ్రీకృష్ణుడు ఆదరపాత్రుడు కాలేదా యనిపించును. ఇయ్యది శ్రావణ బహుళాష్టమి దినమున వచ్చుపండుగ. దీనినే గోకులాష్టమి-జన్మాష్టమి- శ్రీ జయంతి యని గూడ వ్యవహరింతురు. ఈ దివసమున ఆంధ్రదేశమున కృష్ణభక్తు లందరు పగలంతయు నుపవసించి నడిరేయియందు శ్రీకృష్ణపూజను యోగమాయార్చనములను గూడ గావించి శ్రీకృష్ణ మాహాత్మ్యమును గీర్తించుచు మహానందముతో నా రాత్రిని గడుపుదురు. స్త్రీలు పాలను వెన్నముద్దలను శ్రీకృష్ణునికి నివేదించి ఆంధ్రజాతికి విశిష్టములును సుమనోహరములు నగు భావములతో మేళవించిన పాటలను భక్తితో పాడుదురు.

## వినాయక చతుర్థి :

ఇయ్యది భాద్రపద శుక్ల చతుర్థీదివసము నందు ఆచరింపబడును. ఇది భారతదేశము నందంతటను ఆచరింపబడు చున్నను ఆంధ్ర దేశమునందాచరింపబడు నిద్దాని యందొక విశేషము గలదు. ఈ దినమున గృహయజమాని తన కుటుంబముతోగూడి శ్రీ గణేశుని పూజించును. హిందువులకు ప్రతి కార్యారంభమునందును గణేశపూజ యవశ్య కర్తవ్యమగుటచే గణేశుడు ప్రధానదైవ మగుచున్నాడు. ఈ దేవతామూర్తి సిద్ధి—చింతామణి — లక్ష్మి భేదముచే ప్రధానముగ మూడు రూపములతో భక్తులచే భావించబడుచున్నాడు. ఆంధ్రదేశమునందలి పాఠశాలల యందును ఇతర సంస్థలయందునుకూడ నీ గణేశమూర్తి నవరాత్రి సంకల్ప పురస్సరముగ తొమ్మిదిదినములర్చింపబడును. ఈ నవరాత్రములయందు వివిధములగు

శాస్త్ర చర్యలు, వీణామృదంగాది విద్యవిశేషపాండిత్య ప్రదర్శనములు కావ్యనాటకాలంకారాది సాహిత్య గోష్ఠులు మున్నగునవి అనేక విధములుగా జరుగుచుండును. కాని నేటికి ఆంధ్ర దేశమున ప్రాచీన విద్యాసంస్థలు క్రమముగా లుప్తప్రాయము లగుచుండుటచే వానితోపాటియుత్సవములుగూడ నట్టి స్థితినే గనుచున్నవి. ఈ దినమున పల్లెబాలలు గూడ సూర్యోదయముననే అభ్యంజనస్నానమాచరించుకొని గణేశ పూజసామగ్రీ సంపాదనవ్యగ్రులగుచుందురు. తరువాత పూజ గావించుకొని భుజింతురు. ఈ నాటి భోజనమున "ఉండ్రాళ్ళు— జిల్లేడుకాయలు" అనుపిండివంట ఆంధ్ర దేశమున నొక విశిష్టత గాంచినది. ఈనాడు చంద్రదర్శనము చేసినచో మిథ్యాపవాదములు గల్గునను భీతితో తమ ప్రియతముడగు చందమామను సైతము జనులు చూడనొల్లరు. అట్టియపవాదు గలుగకుండుటకై భాగవతమునందలి స్యమంతకోపాఖ్యానమును పఠింపవలయునని జనశ్రుతియు పౌరాణిక గాథయు నుండుటచే నవ్వానిని బఠించియు నీ కథను వినియు నా యక్షతములను శిరమున ధరింతురు. పసిబాలురు తాము శిరములందక్షతలను ధరించి కొన్నింటిని చేత నిడికొని ప్రతిగృహమునకేగి యచట పూజింపబడిన గణేశుని దర్శించి దానిపై గూడ గొన్నియక్షతల నుంచి క్రమముగ తమగృహములకు వత్తురు. కొందఱు బాలురు ఈ దినమున ఇతరులచే శాపములనందుట చాల యవసరమని భావించి ప్రతిగృహమునకు ముందును ప్రతిమార్గమునందును పల్లేరు కాయలను చల్లి దాని వలన దమకు గల్గిన శాపలాభమును సోత్సాహముగ చెప్పుకొనుచుందురు.

యోగదృష్టితో జూచినను ఈ యుత్సవము చాల ప్రధాన మగుచున్నది. శరీరగతములగు షట్చక్రములయందును ప్రథమచక్రమగు మూలాధార రూపమే యీ గణేశుడగుటచేతను, తక్కిన చక్రముల పరిశుద్ధికి మూలచక్రపరిశుద్ధి మిగుల యవసర మగుటచేతను మూలాధార రూపమగు ఈ గణేశోపాసనము ఉపాసనముల నన్నింటను ప్రాధాన్యమును ప్రాథమ్యమునుగూడ వహించుచున్నది. దీనిని బట్టియే "ఆదే పూజ్యోగణాధిపః" అను సూక్తి వెలువడినది.

భారతదేశమునందంతటను ఇంతవ్యాప్తముగా మహోత్సవము వేరొకటి కానరాకపోవుటచేతను ఇది సర్వకర్మలకు ముందు ఆచరింప బడవలసినదిగా శాస్త్రములందు విధింపబడియుండుటచేతను ఈ గణనాథుడు వైదికమూర్తియే యగుట చేతను ఈ యుత్సవము వైదిక యుగముననే ఆరంభమై యుండునని చెప్పవచ్చును.

## దసరా

ఇయ్యది ఆశ్వీన శుక్ల పాడ్యమి మొదలు దశమివఱకు (విజయదశమి) గల పది దినములలో జరుగు ఉత్సవము. ఇది దశరాత్రి పరిమితిగల కాలమున జరుగుటచే ఈ పండుగ ''దసరా'' గా వ్యవహరింపబడుచున్నది. వీనిని శరన్నవరాత్రములని గూడ అందురు. ఈ యుత్సవములు గూడ ఆదిశక్తియొక్క యుపాసనమును బ్రధానముగా జేసికొని బయల్వెడలినట్లు గానవచ్చుచున్నది. ఈ పది రాత్రులయందును మూలానక్షత్రముతో గూడిన దినము మొదలు శ్రవణా నక్షత్రమువఱకుఁగల దినములలో సరస్వతీపూజల నొనర్తురు. ఇవిగాక దుర్గాష్టమి, మహర్నవమి, విజయదశమి యనునవి గూడ ప్రధానములగు పండుగ దినములుగా బరికీర్తింప బడుచున్నవి. ఈ దినములందు ఏయిల్లు చూచినను కలకలమని శోభతో నొప్పుచుండును. ఆంధ్ర దేశమున చదువు నారంభించిన పసిబాలురందఱు ధనుర్బాణముల చేత ధరించి కుమార రతీపతి ప్రతిబింబములై కుసుమ గుచ్ఛముల ధనువులందు అనుసంధించుచు తమగురువుల యాజ్ఞానువర్తులై మనోహరములగు కీర్తనలను బాడుకొనుచు వీధులవెంట దిరుగుచుందురు. అట్టిశోభను మరేదేశమునందును గానము. ఆదినములానందమే మూర్తీభవించిన ట్లుండును.

పరదేవతారాధన ప్రధానములగు నీ యుత్సవములు తంత్రగ్రంథ ప్రథితములగుటచే నీ యుత్సవము తాంత్రిక మని చెప్పవచ్చును.

## నరక చతుర్దశి - దీపావళి

ఆశ్వీన బహుళ చతుర్దశి నరకచతుర్దశి. లోకకంటకుఁడగు నరకుఁడు శ్రీకృష్ణప్రియతమ యగు సత్యచే నీదినమున మడియుటవలన జగత్తునకు క్షేమముగల్గినది గావున ఇయ్యది పర్వదినముగ బరిగణింపబడుచున్నది. ఈ దినము శత్రుమారణనిమిత్తముగ గల్గిన పర్వమగుటచే ఆబాలవృద్ధము వేకువననే భీషణములగు మందుగుండు సామాగ్రి ధ్వనులతో లేచి అభ్యంజనాదులను గావింతురు. ఈ నరక యుద్ధసామగ్రిని సిద్ధముచేయుటకు బాలురు అత్యాసక్తితో వారము పది దినముల ముందునుండి ఈ యాయుద్ధములను స్వపరహస్తములతో తయారుచేసికొని తమ కృతకృత్యతను పరస్పరము వెల్లడించుకొందురు. ఇయ్యది నామమునుబట్టియే పౌరాణికోత్సవముగా బేర్కొనుటకు దగు నర్హత గల్గియున్నది.

సమనంతరమగు నీ యమావాస్యయే దీపావళి పండుగదినము. ఈ దినమున నందఱును నూతన వస్త్రాలంకారమును ధరించి రాత్రి బాలురు జరుపబోవు ఉల్కాపాతాది ప్రదర్శనములకు అనువగు నేర్పాటులను

గావించుచుందురు. బాలురుగూడ రాత్రి సమయమునకై అత్యాసక్తితో నిరీక్షించుచుందురు. దీపావళి అందమైన పండుగ. దీపలక్ష్మితో ప్రతి గృహముగూడ జాజ్వల్యమానమగుచుండును. అముదవు గొమ్మలకు గోగుమొక్కలకు చిన్న చిన్న నువ్వుల మూటలను గట్టి వానిని నూనెతో తడిపి సాయంకాలము పడినవెంటనే వెలిగించి తమ సంతానములచే తల్లులు ధరింపజేయుదురు. ఇది ఆంధ్రదేశమున గల విశిష్ట దీపారాధనము.

జగమునకు మహాలయము గల్గిన వెంటనే శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వతీ రూపములగు ఇచ్ఛా-జ్ఞాన-క్రియాశక్తులుద్భవించి అనతికాలములో వెలుగబోవు జీవచైతన్యజ్యోతికి నెట్టి విపత్తులు గలుగకుండ నారకశక్తుల-నణచివేసిన సమనంతరము ఉదయించిన ఉల్లాసకరములగు జీవజ్యోతిశ్శక్తులే ఈ దీపావళీ రూపమున కల్పింపబడుచున్నవని జగత్తత్త్వోపాసకుల పరిశీలనము. నరకచతుర్దశీవ్రతము పౌరాణికమైనను దీపావళి మాత్రము భారతదేశవ్యాప్తముగా నుండుటచే ఇయ్యది వినాయకచతుర్దశివలెనే చాల ప్రాచీనమైయుండ నొప్పును. ఇయ్యది మార్వాడీల వత్సరాది.

కార్తీక మాసము:

ఈ మాసమంతయు భారతదేశమున మహాభక్తి ప్రపత్తులతో ప్రదీపించుచుండును — ఇది కేవల శైవభక్తి ప్రపూర్ణమగు మాసమగుటచే ప్రతి శైవాలయము గూడ నొక విశిష్ట దృశ్యముతో నలరారుచుండును. ఈ మాసమున సోమవారవ్రతములు ప్రధానములు. ప్రతి సోమవారమునందును స్త్రీ పురుషులందఱు నుపవసించి పగటివేళ శివధ్యానతత్పరులై సహస్ర లింగార్చనాది పవిత్ర కృత్యములందు నిమగ్నులగుచుందురు. కొందఱు ప్రతి దినము పగటివేళ ఉపవసించి శివపూజ పరులగుచు కేవల నక్తవ్రతముల నాచరించుచుందురు. ఏ శివాలయమును జూచినను "హర హర మహాదేవశంభో" అనెడి పారమేశ్వర సంబోధనములతో మారుమ్రోగుచుండును. బహువిధ ద్రవ్యములతో శివాభిషేకములు వైదికమంత్ర పురస్సరముగ నొనర్పబడుచుండును.

ఇదే సమయమున ఏనాడో మఱచిన కానన నివాసమును మఱల దలపించు వన సమారాధనములు లౌకిక వైదికవృత్తుల నవలంబించువారలలో సర్వత్రా గానిపించుచు జగత్సౌభ్రాత్రుత్వమును ప్రతిబింబింపజేయుచుండును. రాత్రి సమయములందు జ్యోతిర్లింగరూపములతో ఆకాశదీపములు, బ్రాహ్మముహూర్తముననే లేచి శీతబాధను గూడ లెక్కసేయక స్త్రీ పురుషులొనర్చు కార్తీక స్నానములు, గోదవర్యాది పవిత్రోదకములలో స్నానసమయాన ప్రవాహములలో వదలునట్టి జ్యోతిరుడుపములు, ఆ సమయాలయందు ముదుసలి యవ్వలచే కీర్తింపబడు త్రిపురాసుర సంహార హాలాహల భక్షణాది శివలీలలు, వీని నన్నింటిని గాంచినచో ఆంధ్ర దేశమునందలి శైవదీప్తి ఎంతగా వెలుగొందుచున్నదో ఎవరు వర్ణింపగలరు?

"పోలి" యనెడి యొక చండాల కన్యక కార్తీకమాసమంతయు మహాభక్తితో కార్తీక స్నానములను శివపూజలను ఒనర్చి ఉత్తమ భక్తురాలై ఆ యమవసనిశియందే శివైక్యము పొందెననితెలుపు "పోలిస్వర్గ" మనెడి ఇతిహాసములను విన్నపుడు ఆంధ్రుల సర్వజాతి సమాదరణదృష్టి సర్వత్ర వ్యక్తమగుచుండును. వేయేల! తెలుఁగు దేశమునకు గల "త్రిలింగ" దేశనామము చేతనే తెలుగువారికిఁ గల యుత్తమ శైవదీక్ష వ్యక్తమగుచున్నపుడు శైవ మాసములో తెలుగు దేశమునందలి శైవప్రతిపత్తివేఱుగా వర్ణింప నవసరములేదు.

నాగచతుర్థి:

ఇయ్యది కార్తీక శుక్ల చతుర్థి. దీనినే "నాగులచవితి" యని యందురు. భారత దేశమున నాగపూజ అనాదికాలమునుండి వచ్చుచున్నది. నాగస్తుతి నాగపూజాదులు వేదమునందు గూడ బేర్కొనబడియుండుటచే ఇయ్యది అనాగరకాచారమని చెప్పుటకు అవకాశము లేదు. భారతీయుల దృష్టిలో సర్వశక్తులు చాల పవిత్రములైనవి. అయ్యెగి పరస్పర-విరోధ దృష్టిలో చాల క్రూరములు భయంకరములు అయినను వస్తుస్థితిలో అయ్యవి జనుల కత్యంతోపకారకములనియు అవ్వాని యనుగ్రహమువలన అసమాధేయ వ్యాధులు వంధ్యాత్వము మున్నగు మహానర్థములు నివర్తించుననియు చెప్పుదురు. కావుననే వీరు వీనిని సామాన్య జనులు దలంచు క్రూర విషజంతువులుగా గాక స్కందరూపముతోడను, సుబ్రహ్మణ్య రూపముతోడను భావింతురు. ఈ భావనా విశేషము అన్ని రాష్ట్రములకంటె ఆంధ్ర రాష్ట్రమున చాల హెచ్చుగా గలదు. కావుననే ఇచట నాగ ప్రతిష్ఠలు నాగ నామధారులు విశేషముగ నగపడుచుందురు. నాగవ్రతములు గూడ విశేషముగ జరుగుచుండును. ఈ నాగచతుర్థీవ్రతము ఇంచుమించుగా ఆంధ్రదేశమున ప్రత్యేకత గల వ్రతముగా నెన్నదగియున్నది. ఈ దినమున అశేష జనులును తత్రాపి స్త్రీలు పాముపుట్టలకడకు పోయి వానిని ధూపదీప నైవేద్యాది షోడశోపచారములతో పూజించి ఆనాడుపవసించి చాల దీక్షతోడను విశ్వాసముతోడను సర్పములను దేవతలనుగా గొలుతురు. ఈ దిన

ముపవసించి మరుసటి దినము బ్రహ్మచారికి భోజనము పెట్టి ఎఱ్ఱగిన్నెతో గూడిన యంగ వస్త్రములను సమర్పింతురు. ఇట్టి వస్త్రములనే "నాగులగావంచాలు" అని యందురు.

## మకర సంక్రాంతి :

ఈ పండుగ పుష్యమాసమున వచ్చుచుండును. సూర్య సంక్రాంతుల నిమిత్తముగా నియ్యది కల్గుచుండుటచే దీనికి తిథులతో నెట్టి సంబంధమును లేదు. దీనినే "పెద్ద పండుగ" అని యందురు. దీని కింత ప్రాధాన్యము ఉత్తరాయణారంభ మగుటచేం గల్గినది. ఈ సంక్రమణమునకు ముందు దినమును "భోగి" పండుగ యనియు, పరదినమును "కనుమ" పండుగ యనియు వ్యవహరింతురు. ఈ తీరున ఈ మకర సంక్రాంతి దినము తాను పండుగ దిన మగుటయే గాక తనకు పూర్వ పరములందు గల దినములను గూడ పండుగ దినములుగా జేయుటచేతనే ఈ పర్వదినము యొక్క అతిశయము మనకు దెలియుచున్నది. ఈ దినమునకు ముందుగానే అనగా భోగిపండుగ నాటికే గృహముల నలంకరించి గృహస్థు తన అల్లురను దుహితృ దౌహిత్రులను రావించి నూతన వస్త్రాలంకారధారణాదులచే సోత్సాహముగా నుందురు. ఈ పుష్యమాసము నాటికి సస్యము లన్నియు పండి పంటలు ఇంటికి వచ్చుచుండుటచేతను దీనికి తోడుగా పాడి గూడ విశేషముగ నుండుటచేతను జను లందరును ఉత్సాహభరితులై యుందురు. ఈ సమయమున పగటివేషములు కోళ్ళ, పొట్టేళ్ళ పందెములు జూదములు మున్నగు వినోదములు ఆంధ్రదేశమున విశేషముగ గానవచ్చుచుండును. మకరరాశి యందు సూర్యుడు ప్రవేశించిన గడియ మొదలు తరువాత ఇరువదిగడియలవరకు పుణ్యకాల మందు నని శాస్త్రములు దెల్పుటచే పూర్వాచార పరాయణులు ఆ పుణ్యకాలమునందే స్నాన—దాన—జప—దీప—శ్రాద్ధ దేవపూజాది వివిధములగు కర్మల నాచరింతురు. ఈ కర్మల నాచరించుటకై పుణ్యకాల మెప్పుడు వచ్చునా యని యతి శ్రద్ధతో ప్రతీక్షించు చుందురు. ఈ సంక్రమణము ఒకప్పుడు రాత్రియందు జరుగుచుండును. అట్లయ్యు అప్పుడు గూడ శీతబాధకు నోర్చి తమ తమ విధులను నెరవేర్చుచునే యుందురు. ఈ తీరున సంక్రాంతి పండుగ దినముల యందు ఆంధ్రదేశ మంతయు మహోత్సాహ భరితముగాను మహా కోలాహలముగాను కన్నుల పండువుగాను నుండును. ఇదే సమయమున పెక్కుతావులందు తిరునాళ్లు గూడ జరుగుచుండును.

ఈ మకర సంక్రమణమునకు ముందుగానే ధనుస్సంక్రమణము గల్గును. దీనినే ధనుర్మాసమని యందురు. ఇయ్యది కేవల వైష్ణవ సంప్రదాయ ప్రధానమగుటచేత కొన్ని ధర్మ సామ్యములచేతను దక్షిణదేశమునుండి క్రమముగా నాంధ్రదేశమునకు సంక్రమించిన యుత్సవమని చెప్పవలయును. కార్తీక మాసమున శివాలయముల వలె ఈ ధనస్సంక్రమణమున వైష్ణవాలయములన్నియు మహా వైభవముతో ప్రకాశించుచుండును. సూర్యోదయమునకే ప్రతి విష్ణ్వాలయమును పలువిధము లగు భోగములతో సర్వేంద్రియ తృప్తి నొనరించుచుండును. త్రిపుండ్రధారులు గండభేరుండ వస్త్రధరులు నగు వైష్ణవోత్తములను గాంచినచో ఆలయభూము లన్నియు వికుంఠ నగరములే యను తలంపు జనింపక మానదు. భోగానుభవమును బట్టి శివాలయములకంటె విష్ణ్వాలయములు ఎన్నియో మడుంగులు ఆకర్షకము లని చెప్ప వచ్చును.

ఇది యిట్లుండ తెల్లవారు జామున నే మాలదాసరులు ఊర్ధ్వ పుండ్రధారులై కంఠములందు పూలమాలలను శిరమున అక్షయపాత్రమును కాళ్ళకు గజ్జెలను చేత తంబురాను ధరించి మనోహరములగు కంఠములతో విష్ణుసంకీర్తనము గావించుచు ఒక చేతితో చిరుతలను వేఱొక చేతితో తంబురాను వాయించుచు చిందులు ద్రొక్కుచున్నప్పుడు అట్టి దృశ్యమును గాంచినవారలు తన్మయు లగుచుండును.

ఇట్టి దృశ్యములచే మన యాంధ్రదేశము భూమికాభేదమున నొకప్పుడు కైలాసముగాను వేఱొకప్పుడు పరమేశ్వరీ నివాసమగు శ్రీనగరముగాను మఱియొకప్పుడు వికుంఠ నగరముగాను భాసించుచుండును.

## శివరాత్రి :

మాఘబహుళ చతుర్దశీ దివసము శివరాత్రి పర్వదినము. దీనిని గూర్చిన ఇతిహాసములు పలువిధము లున్నవి. ఈ పర్వదినము నందలి ప్రధాన సమయ మగు "లింగోద్భవ" సమయమునుబట్టి ప్రలయాంతమున జగత్సృష్టిని గావింపనెంచిన పరమేశ్వరుడు కమలనాభ కమలోద్భవుల యహంకార నిరసనమును గావించి యవ్వారలద్వారా సృష్టి స్థితులను గావింపనెంచి నిశీథమున లింగ రూపముతో నావిర్భవించెననెడి పౌరాణిక గాథయే దీనికి నిదానమని చెప్పనొప్పును.

"మాఘకృష్ణ చతుర్దశ్యాం ఆదిదేవో మహానిశి ।
శివలింగ తయోద్భూతః కోటి సూర్య సమప్రభః" (ఈశానసంహిత :)

ఈ దివసమును శివభక్తిపరులు మహాపుణ్య దివసముగా బరిగణించి శివసేవా విరహితముగ నొకక్షణము గడచినను మహానిధి నష్టమైనట్లే భావింతురు. ఈ దినముయొక్క విశిష్టతను చెప్పవలయునన్నచో సంపూర్ణ

కార్తీక మాసమును ఇరువదినాల్గు గంటలుగా కుదించిన నెట్లు భావింపదగునో అట్టిదియని చెప్పవలయును. ఆంధ్రదేశము నందలి ప్రధాన శివక్షేత్రము లన్నియు అనగా శ్రీశైల దాక్షారామ కాళహస్తి అమరావత్యాదులు ఆనాటి యభిషేకోదకముల తోడను బిల్వదలార్చనముల తోడను నారికేళ ఖండముల తోడను నిండియుండును. శ్రీ శైలాది క్షేత్రములందు నానా దేశాగతు లగు వీరశైవ భక్తులు చూచు వారలను మైమఱపింతురు. వీరావేశముతో చేయు శరభ సంకీర్తనములు దక్షాధ్వరధ్వంసమునాటి వీరభద్ర వీరవిజృంభణ గాథలు అట్టి యావేశములను తమ ధ్వనులచేతనే జనులందు సంక్రమింపజేయు పటహాదివాద్యములు. బహువిధ ధూపధూమములు ఇవియన్నియు సామాన్య ప్రకృతి గల ప్రజలను తల్లడిల జేయును. ఒకమూల పంచాక్షరీ జపములు వేఱొకతావున జంగమదేవర కథలు మఱియొకచో బసవ పూజలు గర్భాలయములందు మహాభిషేకములు ఈ మొదలగువానిచే విరాడ్రూపి యగు మహాదేవు డీనాడు శివక్షేత్రములందు ప్రత్యక్షమగుచుండును.

ఇట్టి వ్రతదీక్షలతో అహోరాత్రములు వీరశైవ దీక్షితులు గడుపుచుండ సామాన్య స్మార్తశైవులు మాత్రము పగలు సహస్రలింగార్చనాదుల తోడను రుద్రపారాయణాదులతోడను శివుని సేవించి సంధ్యాసమయము మొదలు లింగోద్భవ సమయము వరకును అభిషేక పూజనములతో పరమశివు నర్చించి అనంతరము ప్రసాద శేషమును ఫలాహారము గావింతురు. నాటిరాత్రి శివసంకీర్తనములతో జాగరణము చేయుదురు.

ఇట్లు ఆంధ్రదేశమునందు పండుగలు విశేష దృష్టితో బరిశీలింపబడినచో ఆంధ్రుల భక్తివిశేషము కార్యసాధన సామర్థ్యము వ్యక్తిత్వము గూడ సుప్రకటితములగుచుండును. కాని కాలవిశేష ప్రభావమున చిరకాలాగతములగు ఆ సత్సంప్రదాయములు ఆ భక్తి విశేషములు ఆ ఆవేశములు క్రమక్రమమున క్షీణించుచుండుటచే వానితోపాటు అందలి యాసక్తి వ్యక్తిత్వముగూడ క్షీణించుచునే యున్నవని చెప్పవలయును. ఇట్టిస్థితిలో పవిత్రములగు నా భావములను ప్రజలలో పునరుజ్జీవింపజేసి తమ జాతీయతను నిలువబెట్టుకొనుటకు ప్రభుత్వమేమి చేయ సంకల్పించినదో!

---


# అధిక వ్యవసాయ లాభాలకు ఆదాకు ఎస్కార్ట్సు తయారీ డీసెల్ ట్రాక్టర్లు



| | |
|---|---|
| ఉర్సుస్ సి – 325 మార్కు II | 25 హెచ్. పి. |
| ఎస్కార్టు – 27 | 27 హెచ్. పి. |
| ఎస్కార్టు – 37 | 35 హెచ్. పి. |

తక్కువ మదుపుతో అధిక విస్తీర్ణము సాగుచేసి ఎక్కువ ఫలసాయమును, అధిక లాభమును పొంది దేశ ఆహారాభివృద్ధికి కృషి చేయగల్గిన ట్రాక్టర్లు ఇవియే.

ఎస్కార్టు ట్రాక్టర్లు, ట్రైలర్లు, వ్యవసాయ పనిముట్లు, ఫెర్గూషన్ ట్రాక్టర్ల స్పేరు పార్టులు, అమ్మకముకు నమ్మకమగు సర్వీసింగుకు ఎస్కార్ట్సు వారి ఏజంట్లు :

లక్ష్మి ఇంజనీరింగు కార్పొరేషన్

3–4–423/5 నారాయణగుడ హైదరాబాదు - 29.

# ఉద్యోగావకాశాలు

## ఉద్యోగావకాశాలు

ఆర్థిక ప్రణాళిక ముఖ్య లక్ష్యాలలో దేశంలో నిరుద్యోగ పరిస్థితిని మెరుగు పరచడానికి ఉద్యోగావకాశాలను పెంపొందించడం ఒకటి. మూడవ ప్రణాళికలో ఉద్యోగాల కల్పనకు ప్రత్యేక ప్రాధాన్యత నిచ్చారు. కనీసం కొత్తగా వచ్చే ఉద్యోగార్థులకైనా ప్రణాళికా కాలంలో ఉద్యోగాలు లభింప జేయడానికి వీలుగా ఈ ప్రణాళికను రూపొందించారు.

## ఉద్యోగ పరిస్థితులు

రాష్ట్రంలోని అన్ని ప్రభుత్వ సంస్థల నుంచీ పది లేక అంతకంటె ఎక్కువమంది పనివారలు పనిచేసే వ్యవసాయేతర ప్రైవేటు సంస్థల యజమానులనుంచీ త్రైమాసిక నివేదికలను తెప్పించి వాటి ఆధారంగా ఉద్యోగ పరిస్థితుల్లో వచ్చే మార్పులను నిరంతరం సమీక్షించడం జరుగుతున్నది. నివేదికలు అందజేసిన వివిధ సంస్థలలో 1962 జూన్ నెలాఖరు నాటికి 7.02 లక్షలమంది ఉద్యోగాలలో వుండగా 1963 జూన్ మాసాంతరం నాటికి 8.03 లక్షలమంది ఉద్యోగాలు చేస్తున్నట్లు ఉద్యోగ పరిస్థితిపై జరిపిన సమీక్షనుబట్టి తెలుస్తున్నది. కాగా వీరిలో 5.88 లక్షలమంది ప్రభుత్వం సంస్థల లోనూ, 2.15 లక్షలమంది ప్రైవేటు సంస్థలలోనూ పనిచేస్తున్నారు.

ప్రభుత్వరంగంలో ఉద్యోగావకాశాలు పెరగడంలో అన్ని శాఖలకూ పాత్ర వున్నప్పటికి ప్రధాన భూమికమాత్రం స్థానిక సంస్థలదే. జిల్లా పరిషత్తులు, పంచాయతీ సమితులక్రింద సమాజాభివృద్ధి కార్యక్రమాలు శీఘ్రంగా అమలు పరచబడడమే దీనికి కారణం. పోతే ప్రైవేటు రంగంలో దిగువ పరిశ్రమలలో ఉద్యోగావకాశాలు పెరిగాయి : గనుల త్రవ్వకం, రాళ్ళు పగులగొట్టడం, ఉత్పత్తి, నిర్మాణాలు, వర్తక వాణిజ్యం, ప్రణాళికా పథకాలక్రింద ఆర్థిక కార్య కలాపాలు పెరిగిపోవడమే దీనికి కారణం.

## నిరుద్యోగ పరిస్థితి

ఉద్యోగాలు పొందేవారి సంఖ్య పెరగడంతోపాటుగా ఉద్యోగాలనిమిత్తం ఉద్యోగ సాధక కేంద్రాలలో పేర్లు నమోదు చేసుకునేవారి సంఖ్యకూడా హెచ్చునారంభించింది. ఉద్యోగ సాధక కేంద్రాలలో పేర్లు రిజిష్టరు చేసి ఇంకా ఉద్యోగాలు పొందనివారి సంఖ్య 1962 జూన్ నెలాఖరు నాటికి 1.16 లక్షలు వుండగా 1963 జూన్ మాసాంతానికి 1.30 లక్షలు వుంది. ఈ సంఖ్య పెరుగుదలకు నూతన ఉద్యోగ సాధక కేంద్రాలను ప్రారంభించడాన్ని కొంతవరకు కారణంగా పేర్కొనవచ్చు. నిరుద్యోగ పరిస్థితిలో ఏర్పడుతున్న ఈ పెరుగుదలనుబట్టి అదనంగా ఏర్పడుతున్న ఉద్యోగావకాశాలకూ, పెంపొందుతున్న ఉద్యోగార్థుల సంఖ్యకూ మధ్య చాలా అంతరమున్నట్లు తెలుస్తున్నది.

తృతీయ పంచవర్ష ప్రణాళిక తరువాతి అర్థభాగంలో కేటాయింపులను పెంపొందించడంవల్ల ఉద్యోగావకాశాల పరిస్థితి గడచిన రెండు ప్రణాళికలకంటే చాలవరకు చక్కబడగలదని ఆశించబడుతున్నది. ఇదిగాక ప్రస్తుత జాతీయ అత్యవసర పరిస్థితిలో సాయుధదళాలు, రక్షణ ఉత్పత్తులను పెంపొందించడంవల్ల సాంకేతిక నిపుణులకూ, దేహదార్ఢ్యంగల వ్యక్తులకూ అధికంగా ఉద్యోగావకాశాలు వుంటాయి.

## విద్యావంతులైన నిరుద్యోగులు

రాష్ట్రంలోని ఉద్యోగసాధక కేంద్రాల ఆరు సంవత్సరాల 'లైవ్' రిజిష్టర్లను పరిశీలించినట్లయితే విద్యావంతులైన దరఖాస్తుదార్లు, నిపుణతలేని పనివారలు ఎప్పుడూకూడా అధికంగానే వున్నట్లు వెల్లడవుతుంది. పోతే ఇటువంటివారికి గల ఉద్యోగావకాశాలుకూడా తక్కువే. ప్రతి సంవత్సరం పాఠశాలలనుంచి వస్తున్న అభ్యర్థుల సంఖ్య పెరుగుతుండడంతో విద్యావంతులైన నిరుద్యోగుల సమస్య తీవ్రరూపం దాలుస్తున్నది. కాయకష్టానికి సంబంధించిన పనులను చేయడానికి ఇటువంటివారు సాధారణంగా ఇష్టపడకపోవడంతో ఈ సమస్య తీవ్రతరమవుతున్నది.

వృత్తిపనుల మార్గదర్శక కార్యక్రమం ద్వారా వారి అభిప్రాయాలను మార్చి నూతన పరిశ్రమలో ఫలప్రదమైన పను

లను వారు చేసేట్లు చేయడానికి ప్రయత్నం జరుగుతున్నది. కొత్త పరిశ్రమలలో ఆధునిక ఉత్పత్తి విధానాలను అవలంబించవలసి వుంటుంది. కాబట్టి అటువంటి పనులలో విద్యావంతులైన వ్యక్తులు చేరడానికి వీలుగా అపారమైన సాంకేతిక, వృత్తిపనుల సౌకర్యాలు అవసరం.

### నిరుద్యోగులైన స్వర్ణకారులు

బంగారంకంట్రోలునిబంధనల ఫలితంగా రాష్ట్రంలో అనేకమంది స్వర్ణకారుల వృత్తికి దెబ్బతగిలింది. వారికి ప్రత్యామ్నాయ వృత్తులను కల్పించడం మరో సమస్యగా పరిణమించింది. ఆంధ్రప్రదేశ్ స్వర్ణకారుల పునరావాస సంఘం సిఫార్సులను పురస్కరించుకొని సంప్రదాయ సిద్ధమైన ఈ పనివారలకు తగు పనులు కల్పించడానికి అనేక క్రొత్త పరిశ్రమలను ప్రారంభిస్తున్నారు. ఉపాధి కోల్పోయిన స్వర్ణకారులకు తగిన ఉద్యోగాలు చూపించడానికి ఉద్యోగ సాధక కేంద్రాల అధికార్లు ప్రత్యేక చర్యలు తీసుకుంటున్నారు.

### మానవశక్తి

ఉద్యోగావకాశాల కొరతవల్ల పనిపాటలు లేనివారు చాలామంది వుండగా మెకానికల్, ఎలక్ట్రికల్ ఇంజనీర్లు, డ్రాఫ్ట్సుమన్, కెమిస్టులు, డాక్టర్లు, ఉపాధ్యాయులు, ఫిట్టర్లు, టర్నర్లు మొదలైన వృత్తిపనులు, సాంకేతిక పనులకు అభ్యర్థుల కొరత వుండడం వింతగా వుంది. పరిశ్రమలకూ, వైద్య, ఆరోగ్య, విద్యా సేవల విస్తరణకూ కావలసిన సాంకేతిక ఉద్యోగుల కొరత వున్నదనే విషయాన్ని ఈ పరిస్థితి వెల్లడిస్తున్నది. కాగా ఈ కొరత ప్రస్తుత జాతీయ అత్యావసర పరిస్థితిలో సైన్యానికి, ఆర్డినెన్సు ఫ్యాక్టరీలకు వివిధ రకాల సాంకేతిక నిపుణులు అధిక సంఖ్యలో కావల్సివున్నందున ఇప్పుడు బాగా కనిపిస్తున్నది. కనుక సాంకేతిక విద్య శిక్షణా సౌకర్యాలను తక్షణమే భారీయెత్తున విస్తృతీకరించవలసిన అవసరం వుంది.

---

# ప్రభుత్వ నిర్ణయాలు

★ రాజమండ్రిలోని కాగితం మిల్లు నిర్వహణను ప్రైవేటు మేనేజిమెంటులో జాయింట్ స్టాక్ కంపెనీకి అప్పగించడానికి ప్రభుత్వం నిశ్చయించింది. ఈ చర్యవల్ల సుమారు అయిదుకోట్ల రూపాయలవరకూ మిగిలి, ఆ మొత్తాన్ని గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా, ప్రజారోగ్యం, విద్య మొదలైన ఇతర అభివృద్ధి కార్యక్రమాలకు వెచ్చించడానికి వీలుకలుగుతుంది.

★ నాలుగవ పంచవర్ష ప్రణాళికకై దిగువ అంశాలకొరకు 14 వర్కింగ్ గ్రూపులను నియమించడానికి ప్రభుత్వం నిశ్చయించింది :- (1) ఆర్థిక వనరులు; (2) వ్యవసాయం; (3) భారీ ఇరిగేషన్ ప్రాజెక్టులు; (4) విద్యుచ్ఛక్తి; (5) ఆయకట్టుల అభివృద్ధి; (6) పరిశ్రమలు; (7) వైద్యం; (8) ఆరోగ్యం, (9) పట్టణాభివృద్ధి; (10) రోడ్లు, రవాణా; (11) ప్రచారం, టూరిజం; (12) పంచాయతీరాజ్యం; (13) సాంఘిక సంక్షేమం; (14) మానవశక్తి.

---

# గిరిజనుల జీవితం, సంస్కృతి

ఎమ్. పి. పాయ్

గిరిజనులను గౌరవించడం, వారి జీవితాన్ని సానుభూతితో అర్థంచేసుకోవడం మొట్టమొదటగా మనం చేయవలసినపని అని నా అభిప్రాయం. వైవిధ్యం ఉన్నది ప్రతీదీ లోపభూయిష్ఠమైనదని ఒకరకమైన మన తత్త్వానికి మనం అలవాటు పడిపోయాం. మనం మతవిషయకంగా; వేదాంతవిషయకంగా ఉన్నతమైనఅభిప్రాయాలను కలిగివున్నామని,అందుచేత పాశ్చాత్యులకన్నా మనం గొప్పవారమని అనుకుంటూ వుంటాం. ఆ విధంగానే మన పొరుగువారు మనవలెకాకుండా మరో రకంగా జీవిస్తూవుంటే, ఆ జీవన విధానం మనవలె లేదు గనుక, వారు మనకన్న తక్కువవారే అని అభిప్రాయపడుతూ వుంటాం. ఆటవిక జీవనం గడిపేవారి విషయంలోనూ యిదే ధోరణి మనది. చాలా కాలంగా మనం ఆటవికులను అనాగరికులుగాను, మనిషికన్నా తక్కువగాను చూస్తూ వచ్చాం. కాని నేను ఆటవిక ప్రాంతాలను సందర్శించి వచ్చిన అనంతరం నాకు అనిపించింది — పట్టణాలలో, పల్లెల్లో నివసించే మనలో చాలామంది జీవితంలో ఏరకమైన ప్రత్యేకతా లేకుండా బ్రతుకుతున్నా రనీ, డబ్బు సంపాదన, ఖర్చుచేయడం, పని చేయడం. తినడం, బ్రతకడం — యింతకు తప్ప వేరే చెప్పుకోదగ్గ ప్రత్యేకత ఏమీ లేదనీ అనిపించింది.

## సంపద, సంతృప్తి గల జీవితం

గిరిజనులు పరిమితమైన సంపదమధ్యనే బ్రతుకు వెళ్ళబోసుకోవలసి వుంటుందని నేను అనుకోను. ఎంతో నాగరికులం అనుకుంటున్న మనందరికంటే వారు తృప్తిగా, సంతోషంగా జీవితం గడుపుతారు.

సత్యాన్ని విపరీతంగా గౌరవిస్తారు. నా సర్వీసులో తొలి రెండు మూడు సంవత్సరాల కాలంలో ఒక ఆటవిక ప్రాంతాన్ని సందర్శించడం జరిగింది. భద్రాచలం సబ్ డివిజనల్ మేజిస్ట్రేటు కోర్టులో ఆనాటి నా అనుభవం యిది. పట్టణాల్లో అటూ యిటూ లాయర్లు నిలుచుని హోరాహోరీగా పోట్లాడితే కొన్ని నెలలకుగాని ఒక కొలికిరాని కేసు ఒకటి కేవలం చూపులతోనే నిర్ణయించడం జరిగింది. ఇందుకు కారణం యీ కేసు గిరిజనునికి సంబంధించినది. గిరిజనుడు అబద్ధం ఆడడానికి సాహసించడు. అతనిమీద ఛార్జీ తయారుచేసి, అతని ముందుంచినపుడు దాన్ని అతను ఒప్పుకుని అలా చేయడానికి గల కారణాలు వివరించాడు. దానితో ఆ కేసు ముగిసింది.

ఆ రకమైన నిరాడంబరత, సత్యసంధతలతో కూడిన దృక్పథం యించుమించు అన్ని గిరిజన జాతులలోనూ మనకు కనపిస్తుంది.

స్వస్థలంలో వుంటున్న గిరిజనునికి, జీవనభృతికై మరోచోటికిపోయి స్థిరపడిన గిరిజనునికీ భేదం ఉన్నదని నా అభిప్రాయం. ఈ రెండవవాడు అనేక ఆర్థిక యిక్కట్లను ఎదుర్కోవాల్సి వుంటుంది. ఈ మనుషుల్నే నేరస్థ తెగల క్రింద పేర్కోవడం జరిగింది. ఈ జాతులు చాలావరకు సాంప్రదాయకంగా సంక్రమించే సాధన సంపత్తులు గతించిపోగా ఆర్థికమైన యిక్కట్లకు లోనయ్యి గత్యంతరంలేక తప్పుడు పనులు చేయాల్సి వస్తున్నది. కాని స్వస్థలంలోని గిరిజనులు అతి నిరాడంబరంగా, సంస్కారయుతంగా వుండడం మనం గమనించగలం. అతను తలమీద కొమ్ముల్ని తగిలించుకుంటే చూడడానికి నీకు ఎబ్బెట్టుగా అనిపించవచ్చు. కాని యిది యీ నాడు తలకు తగిలించుకున్న టోపీకన్నా చెవికి వ్రేలాడదీసిన చెవి రింగుకన్నా భిన్నమైనదని నేను అనుకోను.

## సానుభూతి, గౌరవాలు అవసరం

నేను చెప్పదలిచే ముఖ్యవిషయం ఏమిటంటే గిరిజనులతో ప్రవర్తించేటప్పుడు వాళ్ళను సానుభూతితో పూర్తిగా అర్థంచేసుకుని గౌరవంతో ప్రవర్తించాలని. వారితో వుంటూ, వారిని సరిగా అర్థం చేసుకుంటే నిజంగా వాళ్ళను గౌరవించినట్టే. ఆటవిక ప్రాంతాలలో తిరిగి ఎంతగానో వారికి సేవలు చేసిన డా. వెర్రియర్ ఎల్విన్ ఒకానొక పుస్తకంలో ఒక చిన్న సంఘటనను వివరించాడు. ఒకానొక తూర్పుతీర ప్రాంతంలో ఎవరైనా చనిపోతే వారి శరీరాన్ని కర్ర పెట్టెలో పెట్టి, ఏ చెట్టుమీదనో వుంచడం ఒక ఆచారంగావుంది. అది వారి పద్ధతి. పాశ్చాత్య అధికారులతో కూడిన ఒకానొక సర్వేపార్టీ 1875 సం. ప్రాంతంలో దీన్ని చూడ్డం తటస్థించింది. అందులో ఒకడు వ్యంగ్యంగా నవ్వి, కర్రతో ఆ పెట్టెను గుచ్చి, ఎగతాళిగా ఏవో కొన్ని మాటలు విసిరాడు.

ఆటవికులకు కోపం వచ్చింది. తిరగబడ్డారు. చివరకు సర్వేబృందాన్ని అంతటినీ ఒక్కడ్నీ మిగల్చకుండా వధించారు. నిజానికి ఆటవికులు శవాన్ని సమాధిచేసినట్టే ఆ పాశ్చాత్యులుకూడా చేస్తారు. వారిలాగానే వీరుకూడా చనిపోయిన మనిషిని పెట్టెలో పెడతారు. ఆ తర్వాత భూమిమీదకాకుండా భూమిలో మాత్రం కప్పెడతారు. భూమిలోనయితే లోపలి పురుగులు దాన్ని తినివేస్తాయి. బయట వుంచితే ఎండకు ఎండి, వర్షానికి తడిసి గాలిలో కలసిపోతుంది.

ఏమైనా ఆటవికులు గౌరవించేదాన్నీ, పవిత్రంగా భావించేదాన్నీ అపహాస్యం చేయడం అనేది ఆ వ్యక్తి యొక్క తెలివి తక్కువతనాన్నే తెలియజేస్తుంది. భిన్నమైన ప్రతీదీ తప్పుకాదని, అలక్ష్యం పదగినది కాదని గుర్తింపగలిగే సహృదయతలేమిని వ్యక్తపరుస్తుంది.

అందుచేత మొట్టమొదటగా నేను చెప్పేది ఏమిటంటే గిరిజనులు భిన్నమైన జీవితాన్ని గడుపుతున్నంతమాత్రంచేత వాళ్ళను చిన్నచూపు చూడగూడదు. ఆర్థికంగా బహుశా వెనుకబడినవారే కావచ్చు. కాని కళ, సంస్కృతి, మతము మొదలయిన రంగాలలో విరుద్ధంగా కనుపించినందు చేత వారిని తక్కువగా చూడడం అర్థం లేనిది. ప్రధాని తన గ్రంథంలో ఒకచోట వ్యక్తం చేసిన విషయాన్ని యీ సమయంలో మనం మననం చేసుకోవడం ఎంతయినా అవసరం. "మన దేశంలోనే గాకుండా విదేశాలలో సైతం ప్రజలు యితురులపై తమ ప్రభావాన్ని ప్రసరింపజేసి వారిని తమ జీవన సరళిలోనికి లాగుకోవడం, తమకు నచ్చిన విధంగా వారిని మార్పు చేయడానికి ప్రయత్నించడం చూస్తున్నప్పుడు ఎంతగానో ఆశ్చర్యం కలుగుతుంది. మన యిష్టం వచ్చిన జీవన విధానాన్ని మనం ఎన్నుకోవచ్చు. అంతేగాని ఆ విధానాన్ని యితరుల మీద ఎందుకు రుద్దాలి? ఇదే ప్రశ్న జాతీయ, అంతర్జాతీయ రంగాలకు కూడా వర్తిస్తుంది. ఒకరి జీవనవిధానంపై మరొకరు, ఒక దేశం అలవాట్లపై మరొక దేశంవారు వత్తిడి కలిగించకపోతే ప్రపంచంలో శాంతి సమృద్ధిగా వుంటుంది. గిరిజనుల జీవితం మంచిదా, మన జీవితం మంచిదా అంటే నేనేమీ చెప్పలేను. ఒకవిధంగా వారి జీవితమే మంచిదేమో అంటాను. అందుచేత, వారికన్న అధికులమన్న ధోరణిలో వారివద్దకు వెళ్ళి ఏవిధంగా ప్రవర్తించాలో, ఎలా నడుచుకోవాలో వారికి తెలియజెప్పడం అనేది మన విషయంలో చాలా గర్వంతో కూడిన ప్రవర్తనే అనాలి. మనకు నకళ్లుగా యితరులను కూడా తయారు చేయడంలో అర్థమూ, ఔచిత్యమూ కనుపించదు."

గిరిజన ప్రాంతాలలో మనం చేసే ప్రతి పనినీ యీ పై విషయాన్ని దృష్టిలో వుంచుకుని చేయడం ఎంతయినా అవసరం అని నా అభిప్రాయం.

## ఆర్థిక సహాయం

గిరిజన ప్రాంతంలో మనం చేసే పని ముఖ్యంగా సాధన సంపత్తులకు సంబంధించి వుండాలి. అనాదిగా యీ గిరిజనులను దేశంలోని నిస్సారవంతమైన ఫలసాయం లేని ప్రదేశాలలోకి నెట్టివేయడం జరుగుతున్నది. కొన్ని కొన్నిచోట్ల వీరి సంఖ్యకు, అక్కడ లభ్యమవుతున్న సాధన సంపత్తులు సరిపోని పరిస్థితులు కూడా ఏర్పడ్డాయి. ఆరోగ్య, వైద్యరంగాలలో ఆధునిక జీవన విధానాలను యింకను చేపట్టలేదు. నిజానికి యేళ్ళతరబడి పరంపరగా ప్రచారంలో వాడుకలో వుండిన యీ ఆటవికుల మందులు కొన్ని చాలా విలువైనవే. ఉదాహరణకు రక్తపోటుకు ఆటవికులు కనిపెట్టిన 'సర్పగండ' అమోఘమైన మందు. ఏళ్ళతరబడి నిరంతరం వాడుకలో వున్న యీ సర్పగండవల్ల ఒక విషయం స్పష్టపడుతున్నది. వీరు కొన్ని రకాల జబ్బులకు తగిన మందులు కనిపెట్టారని చెప్పవచ్చు. ఆర్థికంగా వీరు బాగా వెనుకబడిపోయారనవచ్చు. అందు చేత మనమంతా ఉత్సాహంగా పాల్గొని ఏదోఒకటి చేయడానికి యిది అనువైన రంగం. సాంస్కృతిక విషయాలను కొంతకాలం పాటు పూర్తిగా వదిలేసి; వీరి ఆదాయపు వనరులను మెరుగు పరచడంలోను, నగరాలలోని వర్తకుల బారినుండి వీరిని రక్షించడంలోను, పౌర ఆరోగ్యసూత్రాలు విస్తరించి వున్నమేరకు సాధ్యమైనంత అధికంగా ఆధునిక మందుల సౌకర్యాన్ని అందజేయడంలోను వీరు నాగరిక సమాజంతో సన్నిహితంగా వచ్చేవరకూ మనం మనకృషిని కేంద్రీకరింప జేయవలసివుందని నా అభిప్రాయం.

ఈ సమయంలో ఆటవిక ప్రాంతాలలో చేయవలసిన మరో ముఖ్యమైన పనిని నేను చెప్పవలసివుంది. ఏదో ఒక ప్రత్యేకమైన పనికి మీరు నియమింపబడినప్పటికీ మిగిలిన రంగాలలో మిగతా ప్రజలు చేస్తున్న పనిని దృష్టిలో వుంచుకుని గిరిజనులు సమాజ వికాస ఉద్యమాన్ని అర్థం చేసుకునేట్లు చేయవలసివున్నది. గిరిజనులజీవితంలోని అన్ని రంగాలను ఆవర్తించేటట్టు పరిపాలన సాగాలి. ఒక రంగంలో బాధ్యతలు పరిమితమైయుంటేనేతప్ప కార్యకలాపాలను విడగొట్టడం చేయకూడదు.

ఇప్పుడు ఒకసారి వెనక్కు మళ్ళి ఇంతకు ముందు చెప్పిన గిరిజనులకు సానుభూతి సహకారాలను అందజేయడాన్ని గూర్చి వివరిస్తాను. గిరిజనులను సానుభూతితో

అర్థం చేసుకోవడం అనేది మనఒక్కరిపైనే గాక మన క్రిందపని చేస్తున్న వారిమీదకూడా ఆ బాధ్యత వున్నది. ఉదాహరణకు మీ జీపు డ్రైవరును తీసుకుందాం. మీరు గిరిజనుల మీద సానుభూతి కలిగి వున్నప్పటికీ మీజీపు డ్రైవరు విరామ సమయంలో గిరిజనుల గౌరవానికి భంగం కలిగించే పనులేమైనా చేసినట్టయితే మీ ప్రమేయం లేకుండా నే మీవల్ల వారికి ఎంతో నష్టం సంభవించుతుందనక తప్పదు.

## తగినవిధంగా డబ్బువాడకం

ఇక్కడ ఒక విషయం నేను చెప్పదలచుకున్నాను. ప్రభుత్వ ధనాన్ని సక్రమవిధంగా వాడేటట్టు మనం చూడాలి. ప్రతి కార్యక్రమమూ ఎక్కువగా డబ్బువాడకంమీద ఆధారపడి వుంది. కొంతవరకూ మీరు ఆ పరిసర ప్రాంతాలనుండి శ్రమదానాన్ని సంపాదించగలరు. డబ్బు అవసరంలేని కార్యక్రమాలు కొన్ని వుండవచ్చు. కాని మొత్తంగా మీ కార్యక్రమాలు యావత్తూ ప్రభుత్వ ధనం వాడకంమీద ఆధారపడి వుంటాయిగనుక అవి సక్రమంగా వాడబడేటట్టు చేయడం, ఉద్దేశించబడిన పనిని సాధ్యమైనంత అధికంగా నిర్వర్తింప జేయడం మన విధి.

సగం సగం అయినవి, పూర్తి అయినవి పథకాల విలువలను మదింపు వేయడానికిగాను ఒక మదింపుసంఘాన్ని సెక్రటేరియట్‌లో ఇటీవల ఏర్పాటు చేయడం జరిగింది. ఈ సంఘం అందజేసిన రిపోర్టును పరిశీలించినప్పుడు నిజంగా ఆశ్చర్యపోయాను. పూర్తి అయిపోయాయని నివేదించబడిన అనేక పథకాలు అసలు లేకుండానే పోయాయి. ఒక పథకం పూర్తయినట్టు తరచుగా చెప్పబడుతున్నప్పటికీ అసంపూర్తిగానే దానిని చూసినప్పుడు చాలా ఆశ్చర్యం వేసింది. ఒక పథకం ప్రకారం కొన్ని తెగలవారు ఒకానొక ప్రదేశంలో తమ పశుగణాలతోనూ, వాటికి కావలసిన షెడ్డులతోనూ స్థిరపడవలసి వుంది. ఈ పథకం అయిదారేళ్ళ క్రిందట పూర్తయ్యింది. ఇక్కడ షెడ్డులు వేయబడ్డాయని, గేదెలను కొనడం జరిగిందని, ప్రజలు స్థిరపడ్డారని ఆఖరి నివేదిక తెలియజేసింది. కాని తొమ్మిది నెలల క్రిందట జరిగిన తనిఖీలో అక్కడే విధమైన పశువులూ లేవని, పశువుల కాపరులు స్థిరపడలేదని, పశువుల షెడ్డులు లేవని వ్యక్తపడింది. ఇది ఎలా సంభవించింది అని ప్రశ్నిస్తే నే నేమీ చెప్పలేను.

ఈ పథకం పూర్తయిందనడం మాత్రం ఖాయం. తొలి నివేదికలో ఏ మాత్రం అబద్ధం లేదు. షెడ్డులు వేశారు. గేదెలను కొన్నారు. ప్రజలు స్థిరపడ్డారు. కాని తగినంత ఆర్థికపుష్టి లేకపోయింది. కేటాయించబడినడబ్బు అయిపోగానే, ప్రత్యేకంగా నియమించబడిన అధికారి బాధ్యతలు పూర్తవగానే పథకం పూర్తయినట్టు తెలియజేసి వుండాలి. ఇది పూర్తిగా తప్పుడు అభిప్రాయం.

పూర్తయిన పథకం దానినుండి ఉద్దేశించిన ఫలితాలను యిచ్చేటట్టు చూడడం చాలా అవసరం.

మరో పథకాన్ని మేము ఎంతో ఆసక్తితో ప్రారంభించాము. ఆ పథకం ఉద్దేశ్యం గుంటూరు జిల్లాలో ఇళ్ళనిర్మాణానికి సంబంధించినది. ఆరేడు ఏళ్ళక్రిందటే ఆ యిళ్ళు పూర్తికావడం, అందులో కొంతమంది ఉద్దేశింపబడిన హరిజన కుటుంబాలు దిగడం జరిగింది. కాని యిటీవల తనిఖీవల్ల వ్యక్తపడిన దేమిటంటే ఆ యిళ్ళ కప్పులుపూర్తిగా పడిపోయాయనీ, చాలామంది వాటిని వదిలి వెళ్ళిపోయారనీ. ఆ ఇళ్ళల్లో ఉంటున్నవాళ్లు వారిఇళ్ళకుసంబంధించిన మరమ్మతులుఅన్నీ ప్రభుత్వంవారే చూడాలి అన్న ధోరణిలో వుండటమే దీనికికారణం. ప్రతిసంవత్సరం గోడలను మట్టితో అలికి, కప్పుల్ని బాగు చేసుకోవడానికి నిజానికి ఆ యిళ్ళల్లో వారికి కొద్దిరోజులు మాత్రమే పడుతుంది. కాని వారికి యిళ్ళను అప్పగించినప్పుడు యీ యిళ్ళు తాను భద్రపరుచుకోవాలనే అభిప్రాయాన్ని వారిలో కలిగించలేదు. ఏదో ధర్మంగా వారికి ఆయిళ్ళను యిచ్చినట్టున్నూ, ప్రభుత్వం ఊరికే యిచ్చిందిగనుక దాని బాగోగులుకూడా దానికే వదిలేయాలనే దృక్పథంతోనూ, అందుచేత యిళ్ళ మరమ్మతులకు తిరిగి ప్రభుత్వం పూనుకున్నంత వరకూ ఊరుకుందామనీ ఆ ప్రజలుతప్పుడు ఆలోచనలో ఉండిపోయారు. ధర్మంగా యిచ్చిన ప్రతీదీ యించుమించు అలాంటి ఫలితాన్నే యిస్తుంది.

ప్రభుత్వం తమకొరకై ఖర్చుచేసే ప్రతి నయాపైసా ధర్మంచేసిన డబ్బుకాదని, యీ డబ్బును సరియైన విధంగా ఖర్చుచేయడంలో తనబాధ్యతకూడా వున్నదని ప్రతి గిరిజనుడు అభిప్రాయ పడేటట్టు చేయడం అతి ముఖ్యమైన విషయం.

అందుచేత తన సమాజం అభివృద్ధికై ఏర్పరుపబడిన యీ పథకాల సక్రమనిర్వహణలో తమ బాధ్యతలను గిరిజనులు గుర్తించేటట్టున్నూ, తమకొరకై ఖర్చుచేస్తున్న ఖర్చువెనుక గల ముఖ్యోద్దేశాన్ని గుర్తించి నిధుల సక్రమనిర్వహణకుతోడ్పడేటట్టున్నూ గిరిజనులు చేసేటట్టు మనం చూడాలి.

## హక్కుల పరిరక్షణ

గిరిజన ప్రాంతాలలో గుర్తుంచుకో వలసిన అతి ముఖ్యమైన విషయం ఏమిటంటే గిరిజనుల హక్కులకు ఏ మాత్రం భంగం

వాటిల్లకుండా చూడడం. మీ అందరికీ యిది వర్తించదు. అధికారులకు — అందులోనూ ముఖ్యంగా రెవిన్యూ అధికారులకు — యీ జాగ్రత్త అవసరం. గిరిజనులకు సంబంధించిన హక్కులు చాలావిచిత్రమైనవీ, విభిన్నమైనవీనూ. పట్టణ ప్రాంతాల వారమైన మనకు అవి అర్థంగావు. వాటి స్వభావాలు, గిరిజనులు ఆ హక్కులకు యిచ్చేవిలువలు మనకు అర్థంగావు. ఆటవికప్రాంతాలలోనూ గిరిజన ప్రదేశాలలోనూ హక్కులను ఎంతగానో మనం గౌరవించాలి. నిజానికి యీ హక్కులు వాదానికి నిలవకపోయినప్పటికీ ఈ హక్కులను గౌరవించ వలసి వుంది. పట్టణాల్లోనూ, పల్లెల్లోనూ రైల్వే వారి గురించిన కొంతభూభాగాన్ని తీసుకుని, భూమి తీసుకున్నవారికి తాత్కాలికంగా నష్టం కలిగినా అనేకమంది యితరులకు లాభం కలుగుతుందనిన్నీ, భూమి తీసుకున్నవారికి కూడా పరోక్షంగా లాభం కలగగలదనిన్నీ చెప్పవచ్చు. కాని గిరిజనులకు అడవులు, కొండలేతప్ప మరేవీ సాధన సంపత్తుల సమీకరణకుసాధ్యంకాని గిరిజనప్రాంతాలలో మరోవిధమైన ఏ వుపవృత్తీ సాధ్యంకాదు గనుకన్నూ, గిరిజనులు మార్పును అంగీకరించని కారణం చేతనున్నూ గిరిజనుల హక్కులను వారి ప్రాంతాలలో రక్షింపబడేటట్టు చూడడం అవసరం. ఒకవేళ వారి హక్కులను అతిక్రమించడమే గాని జరిగితే ఎంతగానో ఆలోచించిన మీదటగాని అది జరగదు. అలా జరిగినందుకు పూర్తి ప్రతిఫలం వారికి అందజేయ బడుతుంది కూడా.

మీలో యెంతమంది రెవిన్యూశాఖనుంచి వచ్చారో నాకు తెలియదు—యెవరైనా ఉంటే— గిరిజనుల అభివృద్ధి విషయంలో ఏ నిర్ణయాన్ని తీసుకోవాలన్నా కడు జాగరూకతతో వ్యవహరించాలి. ఈ విషయంలో తొందర చర్య గిరిజనులకే గాక మొత్తం పరిపాలనకు నష్టం వాటిల్లే ప్రమాదం ఉంది.

పండిత జవహర్‌లాల్ నెహ్రూ నుడివిన కొన్ని వాక్యాలను నేను పేర్కొనదలచాను. గిరిజనుల జీవిత విధానాలను గూర్చి మనందరికన్నా ఎక్కువగా ఆయన అర్థం చేసుకున్న వాడని నేను భావిస్తున్నాను. గణాంకాలతోనూ, ఖర్చు చేసిన మొత్తాలతోనూ మీరు చేసిన పనికి విలువకట్టరాదని, ముందు నేను చెప్పదలచాను. ఖర్చుచేసిన మొత్తాలను బట్టి ఫలితాలను లెక్కకట్టడం మన ప్రణాళికా కార్యక్రమాలలో ఒక అంశం కావడం దురదృష్టకరమైన విషయం. ఖర్చుపెట్టిన మొత్తాల ఆధారంగా ఫలితాలను లెక్కకట్టే విధానంవల్ల తరచుగా డబ్బు దుర్వినియోగం కావడం కూడా జరుగుతున్నది. అయితే అనేక కారణాంతరాలవల్ల ప్రణాళికా రంగంలో జరిగే పనుల సక్రమ నిర్వహణ విలువను, ఖర్చుచేసిన మొత్తాల ప్రాతిపదికపై కట్టడం జరుగుతున్నది. ఇది ప్రభుత్వ నివేదికలకు కూడా వర్తిస్తుంది. కేటాయించిన రు. 30 కోట్లలో మనం రు. 20 కోట్లు ఖర్చుచేశామని ప్రభుత్వ నివేదిక తెలుపుతుంది — అందువల్ల మనం మంచే చేశాం. ఈ విధమైన తత్వం చాలా వరకూ వెళ్ళి ప్రతివారు, ఖర్చు చేసిన మొత్తంపైన్నే తమ పని విలువను కట్టడం చేస్తున్నారు.

అయితే ప్రత్యేకంగా గిరిజనుల అభివృద్ధి విషయంలో గణాంకాలతోనూ, ఖర్చు చేసిన మొత్తాలతోనూ గాక గిరిజనుల ఆర్థిక జీవనంలో కలిగిన అభివృద్ధి పైనే మీ కృషిని లెక్కకట్టడం జరుగుతుంది.

మీ కార్యక్రమాలలో వారు కనబర్చే ఆసక్తిపైనా, మీ కార్యక్రమాల ద్వారా స్వయం శక్తిని పెంపొందించడం పైనా, గిరిజనులు స్వయంగా తమ అభివృద్ధి వాంఛించేటట్లు చేయడంపైనా మీ కృషి ఫలితం ఆధారపడి ఉంటుం దని నేను భావిస్తున్నాను. ముఖ్యంగా గిరిజనుల జీవిత విధానాలలో కలిగిన మార్పు, వారి ఆర్థిక, ఆరోగ్య, విద్యాపరిస్థితులలో జరిగిన అభివృద్ధిని మీరు సమీక్షించుకోవాలి. ఈవిధంగా చేసినయడల మీరు చేసిన పనివల్ల కలిగిన ఫలితాల అంచనాలను సరిగా వేయగలుగుతారు.

మీరు ఎంతమందిని నిరక్షరాస్యులను అక్షరాస్యులుగా చేయగలిగారని సాంఘిక విద్యా కార్యకర్తలను నేను తరచుగా ప్రశ్నిస్తూ ఉంటాను. అయితే సహజంగా వారి సమాధానం అసంతృప్తి కలిగించే విధంగానే ఉంటూ ఉన్నది. ఎందుకంటే "నేను గత సంవత్సరం డజన్ మంది అవిద్యావంతులను అక్షరాస్యులుగా చేశా"నని చెప్పిన ఎస్. ఇ. ఓను నేను చూడలేదు. గణాంక వివరాల దృష్ట్యా పరిస్థితి మెరుగ్గానే ఉన్నా ఎంతమంది ప్రజలు వార్తా పత్రికలను చదవగలుగుతున్నారు, ఎంతమంది ఉత్తరాలు వ్రాయగలుగుతున్నా రనే విషయాన్ని మీరు పరిశీలిస్తే ఎంతో డబ్బు ఖర్చు పెట్టినప్పటికి యీ పని విఫలమైనదనే మీరు గమనించవచ్చు. అందువల్ల ఖర్చుపెట్టిన డబ్బుతోనూ, సంఖ్యా వివరాలతోనూ, ఫలితాలను బేరీజు వేయకండి. గిరిజనుల జీవిత విధానంలో కలిగిన మార్పు ద్వారానే యీ బేరీజు వేయడం ఉత్తమమని నేను భావిస్తున్నాను. నేను చదవబోయే ఉదాహరణ వాక్యాలుకూడా దాదాపు ఇప్పుడు చెప్పినదాని సారాంశమే. అయినప్పటికీ ఇది చదవదగింది. ఎందువల్లనంటే గిరిజనులపట్ల వాత్సల్యం, గౌరవం ఉన్న మన ప్రధాన మంత్రి నుడివిన మాట లివి. ఆయన ఇలా

# దీపావళీ జ్యోత్స్న

ఎస్. టి. పి. వి. రామానుజాచార్యులు

మదిలోని రాగాలు మసలి మోసుల నెత్తె
నిత్యవైభవ మిచ్చి సత్య కనులు
ఎదలోని చీకట్లు పొదలలో దూరంగ
దీప్తులఁ జిమ్మెడి దీపమాల
ఎదలోని హాయి యెల్ల నిరుకునఁ బడఁజేయ
వింతచూపులఁ జూచు నింతి చెలువు
కనరాని మురిపాలు కన్నుల వెలుగంగ
చిట్టిపాపల చిల్పి పట్టుదలలు

మధుర భావాంబరశ్రేణులు మనసు దాల్ప
దివ్య దీపావళీపర్వ నవ్యతేజ
మెల్లెడలఁ బర్వి మోదాన నిల్లు వెలిగె
కన్నెగుండెల వెన్నెలవన్నె వెలిగె

కుటిలమార్గము లల్లు క్రూరహృదయముల
దివ్యభావస్ఫూర్తి తేజరిల్ల
బహుళబాధావిష్ట పామరజనముల
రక్షకై ప్రతివ్యక్తి దీక్ష పూన
తమ దేశరక్షకై తను ధన ప్రాణాల
ధారవోయఁగ జనుల్ తలపుసేయ
కలుకుగుండెల కొల్కి కలుకుబాణము లేచు
ప్రతియోష చూపులే ప్రతిన సేయ

నీదు రోచిస్సు నిండించి మాదు శక్తి,
వృద్ధినొందంగ విచ్చేసి వేడ్కనిచ్చి
"దివ్యదీపావళీ" కొమ్మిదే దీపమాల,
భవ్యచారిత్ర్యపావనీ ! వందనమ్ము.



---

అన్నారు "దిగువ తెల్పిన ఐదు ప్రాథమిక సూత్రాలకు అనుగుణంగా అభివృద్ధి కార్య కార్యక్రమాలు అమలు జరపాలి.

(1) గిరిజనులు వారి స్వభావసిద్ధమైన పంథాలోనే అభివృద్ధి చెందాలి. వారిపై ఎటువంటి నిర్బంధాలను మనం విధించ రాదు. వారి సాంప్రదాయ సిద్ధమైన సాంస్కృతిక కళలను అన్నివిధాలా ప్రోత్సహించే ప్రయత్నం మనం చేయాలి. (2) అడవుల పైనా, భూములపైనా గిరిజనులకు ఉన్న హక్కులను గౌరవించాలి. (3) అభివృద్ధి కార్యక్రమాలను, పరిపాలనా వ్యవహారాలను వారు స్వయంగా నిర్వహించే విధంగా వారిలో కొంతమందికి శిక్షణ ఇవ్వాలి.

అయితే ముఖ్యంగా ప్రారంభంలో అన్య ప్రాంతాలకు చెందిన కొంతమంది సాంకేతిక సిబ్బందీ అవసరం ఉంటుందనడంలో సందేహంలేదు. కాని గిరిజన ప్రాంతాలలోకి అన్య ప్రాంతాలకు చెందిన అనేక మందిని పంపడాన్ని మానుకోవాలి."

గిరిజనులకు చెందిన కొంతమందికి, వారు అభివృద్ధి కార్యక్రమాలు స్వయంగా నిర్వహించేందుకు వీలుగా, శిక్షణ ఇవ్వడమే మన లక్ష్యాలలో ఒకటనే అతి ముఖ్యమైన విషయాన్ని నేను నొక్కి చెప్పదలచాను. వారికి తగిన శిక్షణ ఇచ్చి హంగులను ఏర్పరచితే దీనికి అనేక మార్గాలు ఉన్నాయి. వారు యీ ప్రాంతాలలో నివసిస్తూవుంటారు. వారికి శాశ్వతమైనప్రయోజనాలు ఉంటాయి. అంతేగాక కుటుంబ బంధుత్వాలు కూడా ఉంటాయి. యీ దృష్ట్యా పై సూచన ఎంతో ముఖ్యమైంది. యీ ప్రాంతాలలో మన పరిపాలనా అధికృతనూ, మన ప్రాబల్యాన్ని చూపకూడ దనేది నాలుగవ సూచన. వారి సాంస్కృతిక, సాంఘిక సంస్థల ద్వారానే మనం పని చేయాలి. సాంస్కృతిక రంగంలోనూ, సాంఘిక జీవనంలోనూ గిరిజనులకు మనకన్నా ఎక్కువ పరిపూర్ణత ఉందని మీకు ఇంతకుముందే చెప్పాను. వారి వస్త్రాలంకరణను మార్పుచేసే ప్రయత్నం అర్థం లేదనే నేను భావిస్తున్నాను

మనం చేసినపని నాణ్యతనుబట్టి ఫలితాలను బేరీజు వేయాలి. అదే సరి అయిన మార్గమని నేను భావిస్తున్నాను.

మీ కృషి ఫలితంగా గిరిజనుల సుఖసంపదలు పెంపొందుతాయనీ, అంతేగాక భారత జాతీయులలో తనూ ఒక భాగంగా భావించుకుంటాడనీ, యీ జాతిజీవనంలో తనకూ స్థానం ఉందనీ, జీవన విధానంలోనూ, ఆలోచనా రీతిలోనూ మనకన్నా భిన్నంగా ఉన్నా భావ సమైక్యతలో మనలో లీన మవుతాడనీ నేను విశ్వసిస్తున్నాను.

(హైదరాబాదులోని గిరిజనుల సాంస్కృతిక పరిశోధన, శిక్షణ సంస్థలో 1963 అక్టోబరు 5 వ తేదీన శిక్షితుల నుద్దేశించి ప్రసంగించిన ఉపన్యాస సారాంశం.)





ముఖ్యమంత్రి 1-10-1963 తేదీన కృష్ణా జిల్లా ముదినేపల్లిలో పశు వైద్యశాల కొత్త భవనానికి ప్రారంభోత్సవం చేశారు.



విజయవాడలో పాలఫ్యాక్టరీ : అక్టోబరు 10వ తేదీన ఫ్యాక్టరీ భవనాలకు ముఖ్యమంత్రి శంఖుస్థాపన చేశారు.



రాష్ట్రంలో పర్యటనా బృందం: అమెరికా పర్యటనా బృందం అక్టోబరులో హైదరాబాదుకు విచ్చేసిన సందర్భంలో కుతుబ్‌షాహి సమాధులవద్ద తీసిన చిత్రం.



6-10-1963 న ఆంధ్రప్రదేశ్ గవర్నరు హైదరాబాదులో మీర్ ఆలం చెఱువువద్ద జంతు ప్రదర్శనశాలకు ప్రారంభోత్సవం చేశారు.

రక్షణమంత్రి శ్రీ వై. బి. చావన్ మూడు రోజులపాటు నగరంలో పర్యటించిన సందర్భంలో సెప్టెంబరు 25 వ తేదీన బొల్లారంలోని ఇ. ఎమ్. ఇ. పాఠశాలను సందర్శించినప్పటి చిత్రం.



*గిరిజనుల సాంస్కృతిక పరిశోధనా సంస్థ :* అక్టోబరు 5 వ తేదీన యీ సంస్థలో శిక్షణపొందుతున్నవారిని ఉద్దేశిస్తూ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి ప్రసంగిస్తున్న దృశ్యం. (చూడు 60 వ పుట)



హైదరాబాదు సనత్‌నగర్‌లో అక్టోబరు 8 వ తేదీన హోంగార్డ్సు శిక్షణ కేంద్రం ప్రారంభించబడింది.
హోంగార్డ్సు దళం విన్యాసాన్ని యీ చిత్రంలో చూడవచ్చు.



*నల్గొండలో మశూచి నిర్మూలన వారోత్సవం : ఈ జిల్లాలో ఇంత*
వరకు 7 లక్షలమందికి టీకాలు వేయడం జరిగింది.



## అనంతపురం జిల్లా

*గ్రామీణ వాలంటీర్ దళం*

రత్నగిరి గ్రామ హరిజన వాడలో గ్రామీణ వాలంటీర్ దళం సభ్యులు సుమారు రూ॥ 150/-ల వ్యయంతో ఒక కచ్చారోడ్డు నిర్మించారు.

*జపాను పద్ధతి వరి సేద్యం*

గోరంట్ల పంచాయతీ సమితి ప్రాంతంలో 600 ఎకరాలలో జపాను పద్ధతిలో వరి సేద్యం చేశారు.

## చిత్తూరు జిల్లా

*హరిజన దినోత్సవం*

రామకుప్పంలో సెప్టెంబరు 30న హరిజన దినోత్సవం జరిగింది.

సెప్టెంబరు నెలలో నగర పంచాయతీ సమితి వారు 1664 మణుగుల రసాయనిక ఎరువులను పంపిణీ చేశారు.

*గ్రామ సహాయకుల శిక్షణా శిబిరం*

తిప్పినాయుడుపల్లె పంచాయతీలోని కటికపల్లె గ్రామంలో సెప్టెంబరు 28, 29వ తేదీలలో కార్వేటినగర్ పంచాయతీ సమితివారు గ్రామ సహాయకుల శిక్షణా శిబిరాన్ని నిర్వహించారు. 50 మంది శిక్షితులు శిక్షణ పొందారు. హరిజనవాడ నుంచి మెయిన్‌రోడ్డు వరకు ఒక అప్రోచ్ రోడ్డు నిర్మించారు.

## కడప జిల్లా

*శిక్షణా శిబిరం*

ఎగువ రామాపురంలో సెప్టెంబరు 27వ తేదీ నుంచి మూడు రోజులపాటు మహిళల కొరకు గ్రామ సహాయకుల శిక్షణా శిబిరాన్ని నిర్వహించారు.

## తూర్పు గోదావరి జిల్లా

*ఎరువుల పంపిణీ*

పెద్దాపురం పంచాయతీ సమితిలో 1963 సెప్టెంబరులో 276 టన్నుల రసాయనిక ఎరువులు, 11 మేలురకం పనిముట్లను పంపిణీ చేశారు.

## గుంటూరు జిల్లా

*శ్రమదానం*

ఈమని పంచాయతీ సమితిలోని చింతలపూడి, వల్లభాపురం గ్రామాలలో 125 మంది రక్షణ శ్రామిక బ్యాంకు సభ్యులు శ్రమదానంలో పాల్గొన్నారు.

నల్లపాడు పంచాయతీ సమితి గోరంట్లలో సెప్టెంబరు 14 నుంచి 3 రోజులపాటు గ్రామ సహాయకుల శిక్షణా శిబిరం జరిగింది. శిక్షితులు శ్రమదానం ద్వారా ఒక రోడ్డు నిర్మించారు.

## కరీంనగర్ జిల్లా

*గ్రామ సహాయకుల శిక్షణా శిబిరం*

నుస్తులాపూర్ బ్లాకులోని రేణికుంట గ్రామంలో సెప్టెంబరు 23 నుంచి మూడు రోజులపాటు గ్రామ సహాయకుల శిక్షణా శిబిరం జరిగింది. 50 మంది శిక్షితులు శ్రమదానం ద్వారా 100 గజాల రోడ్డు నిర్మించారు.

*మశూచి నిర్మూలన*

1963 సెప్టెంబరు 25 నుంచి అక్టోబరు మొదటి తేదీ వరకు మశూచి నిర్మూలన వారోత్సవం జరిగింది.

*వరి పొలాలలో మందు చల్లకం*

నెమిలికొండ, కొడిమియాల్, నచ్‌పల్లి, నూకపల్లి, పోతారం, ముత్తంపేట, తాటిపల్లి, తక్కెళ్ళపల్లిగ్రామం గ్రామీణ వాలంటీర్ దళ సభ్యులు తమ తమ గ్రామాలలోని వరిపొలాలలో స్ప్రేయింగ్ సాధనాల ద్వారా మందు చల్లారు. ఈ విధంగా మొత్తం 360 ఎకరాల విస్తీర్ణంలో సుమారు 1,260ల ఖర్చుతో మందు చల్లబడినట్లు అంచనా వేశారు.

*ఎరువుల పంపిణీ*

నుస్తులాపూర్ బ్లాకు 1963 ఏప్రిల్-సెప్టెంబరులలో 426 టన్నుల ఎరువులను 700 ఎకరాలలో వేసే నిమిత్తం పంపిణీ చేసింది.

## ఖమ్మం జిల్లా

*నూతన పాఠశాల భవనం*

కల్లూరు సమితిలోని గంగావరం గ్రామంలో జిల్లా కలెక్టరు నూతన పాఠశాల భవనాన్ని ప్రారంభించారు.

సెప్టెంబరు 25 నుంచి అక్టోబరు 1వ తేదీ వరకు మశూచి నిర్మూలన వారోత్సవం జరిగింది.

## కృష్ణా జిల్లా

*రసాయనిక ఎరువుల పంపిణీ*

విస్సన్నపేట పంచాయతీ సమితి

# ప్రగతి పథంలో

1963 సెప్టెంబరులో 144 మణుగుల జొన్న విత్తనాలు, 2135 మణుగుల అమోనియం సల్ఫేట్, 1359 మణుగుల సూపర్ ఫాస్ఫేట్, 1136 మణుగుల ఇతర రసాయనిక ఎరువులను పంపిణీ చేసింది.

### మహబూబ్ నగర్ జిల్లా

*శిక్షణా శిబిరం*

అచ్చంపేట పంచాయతీ సమితిలోని రామకొండ గ్రామంలో సెప్టెంబరు 16 వ తేదీ నుంచి 2 రోజులపాటు గ్రామసహాయకుల శిక్షణా శిబిరం జరిగింది. పిల్లల ప్రదర్శనం కూడా జరిగింది. దీనిలో 47 మంది పిల్లలు పాల్గొనగా 5 గురికి బహుమతులు లభించినవి.

### మెదక్ జిల్లా

*హరిజన దినోత్సవం*

దౌలతాబాదు గ్రామంలో సెప్టెంబరు 30 వ తేదీన హరిజన దినోత్సవం జరిగింది.

*జాతీయ పారిశుద్ధ్య దినోత్సవం*

హత్నూర్ లో అక్టోబరు 2 న జాతీయ పారిశుద్ధ్య దినోత్సవం జరిగింది.

### నల్గొండ జిల్లా

*గ్రామ సహాయకుల శిక్షణా శిబిరం*

ఆత్మకూరు పంచాయతీ సమితిలోని సర్వారం గ్రామంలో గ్రామ సహాయకుల శిక్షణా శిబిరం జరిగింది. వివిధ గ్రామాలకు చెందిన 50 మంది శిక్షితులు, వ్యవసాయం, పశుపోషణ, చిన్నతరహా నీటి వనరులు, గ్రామ పంచాయితీలకు సంబంధించిన విషయాలలో శిక్షణ పొందారు.

*ప్రాథమిక ఆరోగ్య కేంద్రం*

నల్గొండ జిల్లా పరిషత్తు పన్నులు, ఆర్థిక విషయాల స్థాయీ సంఘం సెప్టెంబరు 27 వ తేదీన కలెక్టరు అధ్యక్షతన సమావేశమై, మునుగోడులో 12 పడకలతో ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని నెలకొల్పడానికి రూ॥ 38,000 లు ఆలేరు నుంచి రఘునాథపురం వరకు రోడ్డు నిర్మించడానికి రూ॥ 50,000 లు, అడ్డగూడూరు నుంచి వలిగొండవరకు మరో రోడ్డు నిర్మించడానికి రూ॥ 30,000 లు మంజూరు చేసింది.

*కంపోస్టు ఎరువుల వారోత్సవం*

ప్రజలు కంపోస్టు ఎరువులు తయారు చేయడాన్ని ప్రోత్సహించ ఉద్దేశించి మిర్యాలగూడెం పంచాయతీ సమితి కంపోస్టు ఎరువుల వారోత్సవం జరిపింది. ఆ సందర్భంలో కంపోస్టు గోతులు త్రవ్వారు.

*పాదయాత్ర*

మునుగోడు పంచాయతీ సమితి అధ్యక్షుడు విస్తరణాధికార్లతో కలిసి బ్లాకు ప్రాంతంలో పాదయాత్ర జరిపి 16 గ్రామాలను సందర్శించారు.

### నెల్లూరు జిల్లా

*వర్క్ క్యాంప్*

కనుపర్తి గ్రామంలో సెప్టెంబరు 29వ తేదీన జిల్లా కలెక్టరు వర్క్ క్యాంప్ ను ప్రారంభించారు.

*ఉత్తమ గ్రామస్థుల రేడియో గోష్ఠి*

వెంకటగిరి బ్లాకులోని నిడిగల్లు గ్రామస్థుల రేడియో గోష్ఠి నెల్లూరు జిల్లాలోకెల్లా ఉత్తమ రేడియో గోష్ఠిగా ఎన్నిక అయింది. జిల్లా కలెక్టరు దీనికి బహుమతి అందజేశారు.

### శ్రీకాకుళం జిల్లా

*మశూచి నిర్మూలన వారోత్సవం*

శ్రీకాకుళంలో సెప్టెంబరు 25 న జిల్లా కలెక్టరు మశూచి నిర్మూలన వారోత్సవాన్ని ప్రారంభించారు.

### విశాఖపట్నం జిల్లా

*జాలరుల శిక్షణా శిబిరం*

భీముని పట్నం పంచాయతీ సమితి ఎర్రయ్యపాలెం గ్రామానికి చెందిన జాలరుల కొరకు తీవ్రతర శిక్షణా శిబిరాన్నొకదానిని సెప్టెంబరు 19 న ప్రారంభించారు.

ఎర్రయ్య పాలెం గ్రామస్థులు, రైతుల అంగీకారంతో పట్టా భూముల గుండా అన్నవరం వరకు ఒక మైలు పొడవున రోడ్డు నిర్మించారు.

సెప్టెంబరు 25 న మశూచి నిర్మూలన కార్యక్రమాన్ని ప్రారంభించారు.

### వరంగల్ జిల్లా

*ఉత్తమ గ్రామస్థుల రేడియో గోష్ఠి*

వరంగల్ జిల్లాలోని లేబర్తి గ్రామస్థుల రేడియో గోష్ఠి 1961-62 వ సంవత్సరానికి ఉత్తమ రేడియో గోష్ఠిగా నిర్ణయించబడింది. దీనికి జిల్లా కలెక్టరు బహుమతి అందజేశారు.

ములుగు బ్లాకులోని ప్రత్తి ఉత్పత్తిదార్లు బ్లాకు ప్రధాన కార్యస్థానంలో సెప్టెంబరు 23 వ తేదీన సభ జరిపారు.

ములుగు ఎలిమెంటరీ, జిల్లా పరిషత్తు మాధ్యమిక పాఠశాలల ప్రధానోపాధ్యాయులు బ్లాకు ముఖ్య కార్యస్థానంలో సెప్టెంబరు 21 వ తేదీన సభ జరిపారు.

# పారిశ్రామిక విశేషాలు

## రాష్ట్రరంగం

పారిశ్రామిక విధానంపై ప్రభుత్వానికి సలహా లిచ్చేందుకూ, ముఖ్యంగా క్రొత్త పరిశ్రమలను నెలకొల్పడంతో సహా రాష్ట్రంలో పరిశ్రమల అభివృద్ధికి గాను సాధన సంపత్తులను పరిశీలించేందుకూ ప్రభుత్వం ఇటీవల భారీ పరిశ్రమల సలహా సంఘాన్ని పునర్నిర్మించింది. రాష్ట్ర శాసన సభ ప్రతిపక్ష నాయకులైన శ్రీయుతులు పి. సుందరయ్య, తెన్నేటి విశ్వనాథం, కె. వి. నారాయణరెడ్డి గారలు, ప్రముఖ పారిశ్రామిక వేత్తలు, రాష్ట్ర వాణిజ్య, పరిశ్రమల సమాఖ్య అధ్యక్షుడు తదితరులు సలహా సంఘం సభ్యులుగా వున్నారు. ఈ సంఘం వారు 1963 సెప్టెంబరు 10 వ తేదీన సమావేశమై, ఆర్థిక, పరిశ్రమల శాఖల మంత్రుల అధ్యక్షతన విడిగా రెండు ఉప సంఘాలను నియమించారు. రాష్ట్రంలో, రాష్ట్రం వెలుపలాగల కంపెనీలకు ప్రభుత్వ పెట్టుబడుల మదింపు విషయంలో ప్రభుత్వానికి సలహా లిచ్చేందుకూ, రాష్ట్రంలో పారిశ్రామికాభివృద్ధిని ప్రోత్సహించడానికి తగు చర్యలు తీసుకునేందుకూ ఈ ఉప సంఘాలను నియమించడం జరిగింది.

## సింగరేణి కాలరీస్ కంపెనీ లిమిటెడ్

సింగరేణికి చెందిన గనులలో 1963 జూలైలో 2,84,670.9 టన్నుల బొగ్గును త్రవ్వి తీశారు. క్రిందటి సంవత్సరం ఇదే నెలలో 2,71,333.3 టన్నుల బొగ్గు వీటిలో లభించింది.

1963 జూలై నెలాఖరునాటికి 18,55,092.5 టన్నుల బొగ్గును త్రవ్వి తీయగా గత సంవత్సరం ఇదే కాలంలో 16,99,400.9 టన్నుల బొగ్గును వెలికి తీయడం జరిగింది.

కొత్తగూడెం బొగ్గు గనులవారు కాలరీల ఉద్యోగుల రిక్రియేషన్ క్లబ్బు సమీపంలో స్వర్గీయ శ్రీ టంగుటూరి ప్రకాశం గారి కాంస్య విగ్రహాన్ని ప్రతిష్ఠించి ఆయన [illegible] డించారు. ఈ విగ్రహ ప్రతిష్ఠాపన వినాయక చతుర్థినాడు 1963 ఆగస్టు 23 వ తేదీన జరిగింది. "ఆంధ్ర కేసరి" జన్మదినం కూడా ఆ రోజేరావడం విశేషం. సింగరేణి కాలరీల జనరల్ మేనేజరు విగ్రహాన్ని ఆవిష్కరించారు. ఆవిష్కరణోత్సవ సభ వైభవోపేతంగా జరిగింది. 


*Special facilities for* **DENA BANK** *clients*

- **Mail Transfer *FREE* upto Rs. 10,000/- once a day for CURRENT ACCOUNT Clients**
  *Open a current account with Dena Bank and avail yourself of this facility*
- **Cheques on any DENA BANK Office for ANY AMOUNT collected at *PAR***
  *Insist on payment by Dena Bank cheque*

**DENA BANK**
DEVKARAN NANJEE BANKING CO. LTD.
Regd. Office: Devkaran Nanjee Bldgs., 17 Horniman Circle, Bombay 1
*125 OFFICES AND 37 SAFE DEPOSIT VAULTS*
PRAVINCHANDRA V. GANDHI *Managing Director*

DB/SE/101A.

# పదినేముత్యాలు

గుణమున లస్తకంబునను గోటి యుగంబునఁ గేలఁ జార భీ
షణముగ నుప్పతిల్లి రథసంబున రేఁగినమాడ్కిఁ దీవ్రమా
ర్గణనికరంబు లొక్కట నరాతిబలంబులఁ గప్ప గాండివ
క్వణనము రోదసీకుహరకర్షరముం బగిలింప నుగ్రతన్.

తలపడి తలమీరన కా
ల్బలములఁ బైపైఁ బీనుం
గులఁ ద్రొక్కికొనుచు వెస ముం
గలమును గప్పియుటు వేఱ్క [illegible]

తన దృష్టియు ముష్టియుఁ దగు
ననువున మున్నెత్తిగ్రేయునతఁ డప్పుడు డిం
చిన గాయముల సపాటం
బునఁ పదియుఁ బదేను నుచ్చి పోయెం గోలల్.

ఉడుగక నెంచియున్ సుభటు లొక్కమొగిన్ వెస నంటఁ దాఁకి క
వ్వడి పటుబాణభాస్వదనివార్యసముద్ధతిఁ జేసి మంటలో
మిడుతలు సొచ్చినట్లయిన మేటిమగల్ గని యీడంబోక బ
ల్విడి మఱియున్ వడిం బొదువ వ్రేలిడిఁ ద్రుంచె నతండు తోడుతోన్.

అంతకంతకుఁ గదిసి సైన్యములు చుట్టు
ముట్టి శస్త్రాస్త్ర పంచయమున నభంబు
దీటుకొనునట్లు సేయఁ గిరీటి గాండి
వంబు పరిచాలనంబు దీవ్రంబు గాఁగ.

గోర బోఁజినమాడ్కిఁ గొన్నింటిఁ జక్క సాఁబాలుగా వ్రయ్యలు వాపి పాపి
బాడిన నలికినభంగిఁ గొన్నింటిఁ దుత్తునియలుగా బిట్టు త్రుంచి త్రుంచి
వెస లంపమున నిడ్డవసిగఁ గొన్నిటి నిసుమంతలుగా నుఱుమాడి యాడి
పవివడి బోలఁ గొట్టినలీలఁ గొన్నిటిఁ జిఱునుగ్గుగాఁ బొడిసేసి చేసి.

యడరిపొదివినబలము నానాయుధములఁ,
బ్రతిహతంబులఁ గావించె నతిరయమున
నతుతధ్వజసూతహయత్వలసద,
ఫల్గు రథస్గలను దగు ఫల్గునుండు

ఆమెయిన వివిధ వర్మ
స్తోమం బఱువఱ్ఱు సేసి సునిశితబాణో
ద్దామప్రసారవిభవ, శ్రీ
మూర్తుర కద్భుతంబు చేసెం గడిమిన్.

గర్జద్గుణుఁడై పగతుర
జర్జరితాంగులుగఁ జేసె సాయకజాల
స్ఫూర్జన చూపఱు వొగడఁగ
[illegible]

శక్తిస్ఫారథ నంజయాయత భుజాసంరంభ గాండీవని
ర్ముక్తక్రూర శరావలీదళిత శత్రువ్రాతముల్ శోణితా
సిక్తాకారతఁ బొంది సాంద్రకుసుమశ్రేణీవికాసోల్లస
ద్రక్తాశోకతరువ్రజంబుల క్రియన్ రంజిల్లి యొప్పెంగడున్.

తదవసరంబునన్ దొర లుదగ్రతఁ ద్రోచిన వజ్రదట్టముల్
మదమున నొక్కపెట్ట బలమర్దనుసూను రథంబు గ్రిక్కినం
బొదివెఁ దురంగకింకిణులభూరిరవంబుఁ గరీంద్ర ఘంటికా
భ్యుదితనినాదమున్ రథవరోత్థిత ఘోషము నుత్కటంబుగాన్.

అట్టియెడ వేల్పువచ్చినయట్లమేను,
పొంగ నలిరేఁగి పాండవపుంగవుండు
మత్స్యనృపనందనుని బలుమాటతోడి,
యేపు సెవికిని జూడ్కికి నింపు నొసఁగ.

మేదురదీర్ఘతరం బగు
నాదం బెడతెగక గుణమునను వడి నిగుడం
గోదండము సంతతవల
యోదాత్తస్ఫురణ వెలుఁగుచుండఁగ నేసెన్.

ఒకమాత్రన్ వితతప్రసారనిబిడాత్యుగ్రాస్త్రసంతానముల్
సకలానీకములందుఁ బర్వ నరుభాస్వన్మూర్తి శోభిల్లె దీ
ప్తికలాపంబులు లోక మంతటను విస్తీర్ణంబులై యోగప
ద్యకృత వ్యాప్తివెలుంగ నొప్పెసఁగు మార్తాండున్ విడంబించుచున్.

నరు లొరులు దృశ్యములపైఁ
బరఁగింపఁగఁ జూడ్కులెల్లు వడుఁ దప్పక య
ప్పురుసున నరుఁ డేయు నిశిత
శరములు లక్ష్యములు తప్పి చన వించుకయున్

గజఘోటకరథసూత
ధ్వజకంకటయోధగాత్రతతియం దెచటన్
విజయధనుర్ముక్తశర
వ్రజములు దవులంగఁ బడ కవారణ నిగుడున్.

కవదొన లేల పూనునొకొ కప్పడి నావల దుర్గసంగరోత్సవమున సవ్యపాణి నపసవ్యకరంబున మార్చి మార్చి గాండివము ధరింపఁగా శరపటిష్ఠతయుం బోరిఁజేయి మార్చి చూపు వెరపుతోన పీడ్వడక పొందొడఁగూడెడు నెప్డుసూచినన్.

సమవిషమవినిమ్నోన్నత
సమీపదూరస్థలములు సదృశములుగఁ జి
త్రమ్ముక్రియ నవిహతగతులను
సమరమహిం గ్రిడరథము చను నవితథమై.

వెండియు నతండు,

బలమెల్లన్ వెఱ రెండుపాయలుగ కుంభద్వేగుఁ డై చొచ్చి యా
వలగా నడ్డము వచ్చి నాలువుగ దుర్వారోద్ధతిం బోయి మూ
లల నానాశకలాకృతిం బొరయ లీలాయానదుర్దాంతుఁడై
వలయంబుల్ చని చించి చిక్కువఱచున్ వైకల్యసంపాదియై.

ఇవ్విధంబున నంబుధిలోన మహామత్స్యంబు విహరించు చందంబునఁ దదీయరథంబు కౌరవ సైన్యంబునందు సంచరించు నయ్యవసరంబున.

రత్న కేతనములు రాజిత శేఖరం
బులును రుచిరఘంటికలును బార్థు
బాణనిహతిఁ దునిసిపడుఁ గౌరవులచేటు
దెలుప డుల్లు నుల్కలునుబోలె.

నరుభల్లంబుల నగ్రిమ
చరణంబులు త్రెస్సి మ్రొగ్గుజవనాశ్వంబుల్
కరుణమెయి రాహుతులకున్
శరణంబగు మనుచు మ్రొక్కుచందంబొందెన్.

దంతిఘటాసంతానము
కుంతీసుతునారసములఁ గూలినతఱి న
త్యంతనిబిడాభ్రముల దివి
యెంతయు సొంపారుభంగి నిల చెలువొందెన్.

పలుపులుఁ గాండ్లుం బగ్గం
బులుఁ దనయస్త్రంబు లడరి పొడిసేసిన వి
చ్చలవిడిఁ బాఱెడు రథ్యం
బుల సేయఁడు దివిజరాజపుత్రుఁడు కృపతోన్.

అర్జునాస్త్రఖండితాతపత్రధ్వజ
చామరములు గాలిఁ జదలఁ దూలఁ
జిహ్నములపిభూతిఁ జెందంగఁ గనియొప్పె,
నప్పు డాడుచున్నయట్ట లచట.

ఒకమరి కిరీటికట్టెది
రికి నుఱుకునఁ బోయి రేని రెండవమాటి
య్యకొనుట కోర్వఁగ లేరై
రొకళ్ళుఁ గురురాజసేన యోధులలోనన్.

మండితధ్వజదండమండలంబులఁ గిట్టి విటతాటనంబుగా విఱిచి విఱిచి
చటులఖురోద్భటాశ్వశ్రేణిఁ బొదివి రయంబునఁ దునిమి తూఁటాడి యాడి
రాజితబహువిధరథసమూహముఁ జొచ్చి గలిబిలియగునట్లు కలఁచి కలఁచి
మదభరభీషణమాతంగముల ముట్టి చిందఱ వందర చేసి చేసి.

పటుపదాతిచయముపై రౌద్రరసమహో
గ్రముగ నడరి నేలఁ జమరి చమరి
సవ్యసాచి బాణసంఘంబు మత్తశుం
డాలఘోరలీల గేలి సలిపె.

శిక్షితచిత్రసంగరవిశేషములం బ్రతిహేతిఖండనా
దక్షత పెంపు సొంపునను దైవబలంబున నత్తఱిన్ సహ
స్రాక్షతనూజుసారథి రథాశ్వచయధ్వజముల్ పరాస్త్రశ
స్త్రక్షతి లేక యొప్పెఁ గురుసైన్యము వెక్కస మంది జగ్గిలిన్.

తేజోధనుఁ డగునరుఁ డు
ద్భ్రాజితగతి నడుమ మెఱసి బడబాగ్ని దళం
బై జలనిధిఁ ద్రెక్కొనియెడు,
నోజం గురుబలము పేర్మి యుడిపెం దోడ్తోన్.

కాలపక్వంబులైన లోకముల జముఁడు
బారి సమరెడు చాడ్పున మారి మసఁగి
యుగ్రరూపుఁడై శౌర్యసమగ్రబాహు,
సంపదుద్దాముఁ డగు క్రీడి చంపె రిపుల.

[తిక్కన: భారతము-విరాటపర్వము]

# ప్రశ్నోత్తరావళి

**శ్రీ టి. జి. రమణరావు, గుంతకల్లు.**

ప్రశ్న : తుంగభద్ర ఆనకట్ట నిర్మించిన అనంతరం గుంతకల్లు (అనంతపురం జిల్లా) ద్వారా ఒక హైలెవెల్ కాలువను త్రవ్వాలని ఉద్దేశించబడింది. ఈ త్రవ్వకం ఎప్పుడు సంభవమౌతుంది?

సమా : గుంతకల్లు బ్రాంచికి సంబంధించిన [illegible] దశలో చేర్చబడింది. మొదటిదశ పూర్తయిన వెంటనే యీ రెండవదశ నిర్మాణ కార్యక్రమం చేపట్టబడుతుంది. ఆర్థికమైన కారణాలవల్ల ఉద్దేశించబడిన యీ తుంగభద్ర హైలెవెల్ కాలువ పథకాన్ని రెండు దశలుగా విడదీయడం జరిగింది.

**శ్రీ అంబటిపూడి లక్ష్మినరసింహం, అన్నంబోతవారిపాలెం, గుంటూరు జిల్లా.**

ప్ర : ధర్మంచేసిన కళ్ళను భద్రపరచి, గ్రుడ్డివారికి వాటిని పెట్టి, దృష్టిలోపాన్ని తొలగిస్తారని విన్నాను. ఆంధ్రదేశంలో యిలాంటి సంస్థ ఎక్కడవుంది? ఈ రకంగా కళ్ళు తగిలించినందుకు ఏమయినా డబ్బు వసూలుచేస్తారా?

స : హైదరాబాదులోని సరోజినీదేవి వైద్యశాలలో కంటిబ్యాంకు ఒకటి వుంది. ధర్మం చేయదలచుకున్నవారి కళ్ళను చనిపోయిన తర్వాత తీసి, జాగ్రత్తగా సశాస్త్రీయంగా భద్రపరుస్తారు. ఇది ప్రభుత్వ సంస్థ గనుక చికిత్స ఉచితంగానే లభిస్తుంది.

కాని పూర్తిగా గుడ్డిదైపోయిన కంటిని తీసి మంచి కంటిని వుంచడం సాధ్యం కాదు. మశూచి మొదలయిన జబ్బులవల్ల కంటిలో కొంతభాగం దెబ్బతిని దృష్టిలోపం ఏర్పడితే, ఆ దెబ్బతిన్న భాగాన్ని తొలగించి, కంటి బ్యాంకులో భద్రపరిచిన కంటిని వుంచడం జరుగుతుంది.

**శ్రీ అల్లు సుబ్రహ్మణ్యం, పేలమ్ ఎస్టేటు, కూలిమ్, దక్షిణకెడా, మలయేసియా.**

ప్ర : మలయేసియాలోని ఆంధ్ర విద్యార్థులకు ప్రభుత్వం ఏమన్నా స్కాలర్ షిప్పులను యిస్తున్నదా? ఇస్తే అలాంటి స్కాలర్ షిప్పులను ఎన్నింటిని యిస్తున్నది?

స : బర్మా, మారీషియస్, ఫిజీదీవులు, దక్షిణాఫ్రికా, మలయేసియా దేశాలలో తెలుగు మాట్లాడే భారతీయ వలసదార్లకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం స్కాలర్ షిప్పులను యిస్తున్నది. ప్రతి సంవత్సరం పైనచెప్పిన దేశాలలో ముగ్గురు విద్యార్థులకు అలాంటి స్కాలర్ షిప్పులు లభిస్తున్నాయి.

**శ్రీ చెక్కా వెంకట సుబ్బారావు గుప్త, వేమూరు, కృష్ణా జిల్లా.**

ప్ర : తెల్లసుద్ద కణికలు తయారుచేయడానికి మాకు జిప్సం అవసరమౌతుంది. మన రాష్ట్రంలో అది ఎక్కడ లభిస్తుంది? దయచేసి జిప్సం గనులున్న ప్రదేశాల వివరాలను తెలియజేయండి.

స : 1956 సం. పు పారిశ్రామిక విధానం తీర్మానం ప్రకారం జిప్సం నిర్దిష్టమైన ఖనిజం. ఇది నెల్లూరు జిల్లా, సూళ్లూరుపేట తాలూకాలో పులికేటిసరస్సుదిగువన 14 మై. పొడవు 2 మై. వెడల్పున ఆవరిస్తూ భూమిలో 3 అడుగుల లోతున నిక్షిప్తమై వుంది. భూగర్భ పరిశోధక సంస్థ 1958 సం. లో జరిపిన సర్వే లెక్కల ప్రకారం యీ ప్రాంతంలో 2,24,000 టన్నుల జిప్సం నిక్షిప్తమై వున్నట్టు తెలుస్తున్నది. పబ్లిక్ రంగంలో వున్న యాజమాన్యపు వత్తిడి దృష్ట్యా ప్రభుత్వమే యీ పులికేటి వద్దగల జిప్సంపై ఆధిపత్యం వహిస్తున్నది. ఈ ప్రాంతంలోని కొంతభాగం, గూడూరులోని ప్రభుత్వ పింగాణీ పరిశ్రమలో వుపయోగించడానికిగాను డిపార్టుమెంటల్ మైనింగ్ క్రింద కేటాయించబడింది. ఆంధ్రప్రదేశ్‌లో గల అన్ని పింగాణీ ఫ్యాక్టరీలలో ఉత్పత్తులను అధికం చేయాలనే ధ్యేయాన్ని బట్టి, ఎక్కువ ప్రాంతాన్ని యిందుకై కేటాయించాలని ఒక ప్రతిపాదన కూడా వుంది. ఇక్కడి జిప్సం నిక్షిప్తాలు అంచనాలను మించివుంటే, అనేక రకాలుగా వుపయోగించే ప్లాస్టర్ ఆఫ్ పారిస తయారీని ప్రభుత్వం ప్రారంభించే అవకాశం కూడా వుంది.

**శ్రీ ఆర్. ఎస్. రావు, చిన్నంపేట, పశ్చిమ గోదావరి జిల్లా.**

ప్ర : కొల్లేరు భూముల్ని ముంచివేసే తమ్మిలేరు మీద ఎర్రంపల్లి వద్ద ఒక రిజర్వాయరును నిర్మించే ప్రతిపాదన ఒకటివుంది. నాగార్జున సాగర్ ఎడమకాలువ 188 మై. 2 వ ఫర్లాంగు వద్ద యీ రిజర్వాయరును వచ్చిచేరి, అయిదుమైళ్లు రిజర్వాయరు ద్వారా పోయి తమ్మిలేరును దాటుతుంది. నాగార్జున సాగర్ కాలువకు సాధారణంగా మే నెలలో నీరు వదలడం జరుగుతుంది. ఈ నీరే రిజర్వాయరును నింపేస్తుంది. ఇక, మా మూలుగా తమ్మిలేరుకు సెప్టెంబరు నెలలో వరదలు వస్తుంటాయి. అలాంటప్పుడు ఏవిధంగా వరదల్ని నిరోధిస్తారు?

స : నాగార్జున సాగర్ ప్రాజెక్టు ఎడమ కాలువకు అనుమతించబడిన పథకాన్ని బట్టి మున్నేరు వరకు మాత్రమే యీ కాలువ త్రవ్వడం జరుగుతుంది. మున్నేరుకు ఎగువన కాలువను త్రవ్వే విషయంలో యిప్పటికి ప్రాథమిక పరిశీలనలు మాత్రమే ముగిశాయి. తమ్మిలేరుపై లెవెల్ క్రాసింగును నిర్మించే ప్రతిపాదనే లేదు.



# మధ్య పెన్న ఉత్తర కాలువ

అనంతపురం, కడప జిల్లాలలో అయిదు వేల ఎకరాలకు నీటిని సరఫరా చేసే మధ్య పెన్న ఉత్తరపు కాలువకు పెనక చర్లపద్ద ముఖ్యమంత్రి డాక్టర్ నీలం సంజీవరెడ్డి అక్టోబర్ 17 న ప్రారంభోత్సవం చేశారు.

మధ్యపెన్న ప్రాజెక్టు నిర్మాణానికి అయిదుకోట్లరూపాయలు ఖర్చుఅయింది. భావిలో తుంగభద్ర ఎగువ కాలువ వచ్చి ఈ మధ్యపెన్న ఉత్తర కాల్వతో కలసినపుడు 84,115 ఎకరాలకు నీరు లభిస్తుంది.

ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తరువాత తుంగభద్ర ఎగువకాల్వ పథకం, మధ్య పెన్న ప్రాజెక్టులను సమన్వయం చేసి పరిశోధనలు సాగించారు.

1956 జూన్ నాటికి ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ స్వర్గీయ శ్రీ సి. ఎన్. జీవలరావు ఆధ్వర్యాన ఈ సమన్వయ పథకం తయారయింది.

1956 అక్టోబర్ 6వ తేదీన అప్పుడు ఉప ముఖ్యమంత్రిగావున్న శ్రీ సంజీవరెడ్డి దీనికి శంకుస్థాపన చేశారు.

తుంగభద్ర ఎగువకాల్వ సమన్వయ పథకాన్ని, తుంగభద్ర, హగరి, పెన్న, చిత్రానది నదుల నీటిని సద్వినియోగం చేసుకొనే ఉద్దేశంతో రూపొందించారు.

ముందుగా విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి అనుకూలమైన తుంగభద్ర దిగువ కాలువను నిర్మించారు.

1953-55లో తుంగభద్ర ఎగువకాలువ విషయమై సమగ్ర పరిశీలన జరిపి 2190 లక్షల రూపాయలు ఖర్చుకాగల పథకాన్ని రూపొందించారు. దీన్ని 1957 లో ఆంధ్ర, మైసూరురాష్ట్రాల సంయుక్త పథకంగా ప్రణాళిక సంఘానికి సమర్పించారు.

రెండు దశలలో ఈ పథకాన్ని అమలు జరపాలని నిర్ణయించబడింది.

తుంగభద్ర ఎగువకాలువ పథకం రెండు దశలు పూర్తిఅయిన పక్షంలో ఆంధ్రలో 2,52,009 ఎకరాలు, మైసూరురాష్ట్రంలో 1,36,600 ఎకరాలు సాగవుతుంది.

మొదటిదశ పూర్తిఅయిన వెంటనే అనంతపురం జిల్లాలోని హగరి ప్రాంతంలో 35 వేలఎకరాలకు, బళ్లారిజిల్లాలో 68 వేల ఎకరాలకు నీటిసప్లయి లభిస్తుంది. ఇవిగాక మధ్యపెన్న విభాగం కింద అదనంగా 84,115 ఎకరాలకు నీటివసతి లభిస్తుంది.

## పథకం వివరాలు

తుంగభద్ర ఎగువకాల్వ పథకం మొదటి దశ ఈ క్రింది విధంగా ఉంటుంది.

తుంగభద్ర ఆనకట్టనుంచి 116 మైళ్ళ కాలువ నిర్మిస్తారు. దీనివల్ల బళ్ళారి జిల్లాలో 68 వేల ఎకరాలకు, అనంతపురం జిల్లాలో 35 వేల ఎకరాలకు నీరు సప్లయి అవుతుంది.

ఈ 116 మైళ్ళ తరువాత ఈ కాల్వ ఉరవకొండవద్ద పెన్నానదిలోకి మళ్ళించబడుతుంది. ఆ తరువాత మధ్యపెన్న రెగ్యులేటర్ నిర్మాణం జరుగుతుంది. ఈ రెగ్యులేటర్ వల్ల ఎగువకాల్వ నీరు, పెన్న నీరు కలసి ఉత్తరం దక్షిణకాల్వల కింద 54,115 ఎకరాలు సాగు అవుతుంది.

అనంతపురానికి 27 మైళ్ళ దూరంలో కమ్మనాయనిపల్లి వద్ద పెన్నానదిపై ఈ రెగ్యులేటర్ నిర్మించి, రెండువైపులా కాలువలు ఏర్పాటు చేస్తారు. దానికింద 84,115 ఎకరాలకు నీరు లభిస్తుంది. పులివెందల కాలువ ఏర్పడిన తర్వాత అదనంగా మరి 55 వేల ఎకరాలకు నీటివసతి ఏర్పడుతుంది.

మొదట్లో పెన్నానదిపై నూరుకోట్ల ఘనపుటడుగుల జలాశయాన్ని ఏర్పాటు చేయాలని తలపెట్టారు. అయితే తుంగభద్ర వరదనీటినికూడా జతచేసి జలాశయాన్ని అయిదు వందలకోట్ల ఘనపుటడుగుల ప్రమాణానికి పెంచారు.

రెగ్యులేటరు నిర్మించే ప్రాంతంలో పెద్ద రాతిపలక కానవచ్చిందని, ఈ రాయి వల్ల పునాది నిర్మాణపు ఖర్చు 50 లక్షల రూపాయల మేరకు తగ్గిందని తెలుస్తున్నది.

మధ్యపెన్నా ఆనకట్ట పొడవు 3,790 అడుగులు, ఎత్తు 140 అడుగులు. 18,500 క్యూసెక్కులనీరు ప్రవహించడానికి వీలుగా తూములు నిర్మించారు. ఈ ఆనకట్టపై [illegible] నిర్మాణం కూడా జరుగుతున్నది.

ఈ మధ్యపెన్న రెగ్యులేటర్‌కు రెండు వైపుల నిర్మించే కాలువల వివరాలు :

దక్షిణపు కాలువ 60 మైళ్ళు పోయి ముచుకోట ప్రాంతంవద్ద తాడిపత్రి కాలువలో చేరుతుంది. దీనివల్ల మొదటిదశలో 70 వేల 615 ఎకరాలు సాగులోకి వస్తాయి. రెండవ దశలో పులివెందల సమితిలోని మరి 55 వేల ఎకరాల సాగు అవుతుంది.

ఉత్తరపు కాల్వ పొడవు 34 మైళ్ళు. దీనివల్ల 13,500 ఎకరాలకు నీరు సప్లయి అవుతుంది. తరువాత ఈ కాలువనీరు రాయలచెరువులోకి పోతుంది.

మధ్యపెన్నా ఆనకట్ట నిర్మాణం నూటికి 70.4 వంతులు పూర్తి అయింది. ఉత్తర కాల్వను 31 వ మైలు వరకు త్రవ్వారు కాని ఇప్పటికి 21 వ మైలు వరకు మాత్రమే నీటి సప్లయి అవుతుంది.

దక్షిణపు కాలువ త్రవ్వకం 52 మైళ్ళు పూర్తి అయింది. ఈ ఏడాది ఆఖరుకు మరి 22 మైళ్ళు పూర్తి అవుతుంది. 14 వేల మంది వ్యవసాయ కూలీలకు ఇది జీవనాధారం కల్పించింది.

ఇప్పటికి పూర్తి అయిన ఈ కాల్వ నిర్మాణంవల్ల ఐదు వేల ఎకరాలకు నీటి సప్లయి జరుగుతుంది. వచ్చే ఏడాది మే నెల నాటికి మరి 25 వేల ఎకరాలకు నీరు సప్లయి అవుతుంది.



# వివిధ పరిశ్రమలు - బహుముఖాభివృద్ధి

ఆంధ్రప్రదేశ్‌లో పారిశ్రామికాభివృద్ధికై ప్రణాళికా బద్ధమైన కార్యక్రమాన్ని అమలు పరచేనిమిత్తం తృతీయ పంచవర్ష ప్రణాళికలో రూ. 1339 లక్షలు కేటాయించ బడినవి. 117 పథకాల అమలుకై 1962-63 బడ్జెట్‌లో రూ. 248.17 లక్షలు కేటాయించబడినవి. ఇందులో, 1962-63లో, భారీ, మధ్యరకం, చిన్నయెత్తు గ్రామ పరిశ్రమల అభివృద్ధి ఖర్చుగా రూ. 220.84 లక్షలు వినియోగించబడినవి. రూ. 257-50 లక్షల కేటాయింపులో, ప్రస్తుత ఆర్థిక సంవత్సరంలో 1963 జూలై ఆఖరువరకు భారీ, మధ్యరకం, చిన్నయెత్తు గ్రామ పరిశ్రమల అభివృద్ధికై రూ. 72.55 లక్షలు ఖర్చు చేయబడినవి.

గూడూరులోని ప్రభుత్వ పింగాణీ ఫ్యాక్టరీ అభివృద్ధికి అవసరమైన పరికరాలు వచ్చినవి. వాటిస్థాపనకు చర్య గైకొనబడు తున్నది. ఈ ఫ్యాక్టరీ సాలుసరి వుత్పత్తి 5,12,443 కె. గా. లకు హెచ్చినది. ఈ సామానులో అధికభాగము ఆరోగ్యావసరాలకు సంబధించినది. ఇక్కడ, గృహోపయోగానికవసరమైన రకం సామాను స్థానిక వాడకానికి సరిపడ మాత్రమే తయారు చేయబడుతుంది. 1962-63 లో యీ ఫ్యాక్టరీ వ్యాపారం విలువ 8,64,170-. అంతకు క్రితం సంవత్సరం యిది రూ. 8,45,684-. 1962-63 లో దీనికి రూ. 1,00,000 నికరం లాభం రావచ్చునని భావించబడుతున్నది.

### బహువిధ వస్తూత్పత్తి

గూడూరులోని ప్రభుత్వ గాజు పలకల సంస్థను పునర్వ్యవస్థీకరించి, నానావిధ వస్తువులను తయారుచేసే పథకం క్రింద రెండు అదనపు షెడ్‌ల నిర్మాణం పూర్త [illegible] తయారుచేసే శక్తిగల కొలిమి నిర్మింపబడి, పని ఆరంభించ బడినది. ఈ ఫ్యాక్టరీలో సగటున పనిచేసే కార్మికుల సంఖ్య 130. 1962-63 లో ఫ్యాక్టరీ వుత్పత్తి, వ్యాపారములు యీ విధంగా వున్నవి. ఉత్పత్తి : రూ. 1,85,456-అమ్మకాలు : రు. 1,99,066- మిగిలిన సరుకు ; రూ. 98,828 -. ఈ సంస్థలో ప్రధానమైన సాధన సంపత్తి యింకా యేర్పడనప్పటికీ, యిది నూటికి 50 వంతుల వస్తూత్పత్తి శక్తిని సంపాదించినది.

మందుల తయారీ ప్రాజెక్టు, భారీ విద్యుత్ పరికరాల ప్రాజెక్టు విభాగం ఆంధ్రప్రదేశ్‌లో నెలకొల్పబడుతున్న కేంద్ర విభాగం ప్రాజెక్టులు అయివున్నవి. ప్రస్తుత సూచనల ప్రకారం మందులతయారీ ప్రాజెక్టు 1965లో పని ప్రారంభించవచ్చు. ఉద్యోగుల గృహాల నిర్మాణం చురుగ్గా సాగుతున్నది. ఫ్యాక్టరీ కార్యనిర్వాహక సదనం నిర్మాణం కూడా తృప్తికరంగా జరుగుతున్నది. ప్రాజెక్టు కుద్దేశించబడిన రైల్వే సైడింగు పూర్తి అయినది. అలాగే భారీ విద్యుత్ పరికరాల ప్రాజెక్టుకు సంబంధించిన పనికూడా జరుగుతున్నది. శిక్షితులు మున్నగువారి కుద్దేశించబడిన భవనాల నిర్మాణం సంతృప్తికరంగా సాగుతున్నది.

### లోహశోధన ప్రయోగశాల

పై రెండు ప్రాజెక్టులకుతోడు రక్షణ లోహశోధన ప్రయోగశాలను హైదరా [illegible] నిర్ణయించినది. ఈ సందర్భంలో, ప్రయోగశాలకు వుచితంగా భూమి, విద్యుచ్ఛక్తి సరఫరా మున్నగువాటి రూపంలో అవసరమైన సహాయం చేయగలనని రాష్ట్ర ప్రభుత్వం వాగ్దానం చేసినది. రక్షణ లోహశోధన ప్రయోగశాల డైరెక్టరు, కేంద్ర ప్రభుత్వ యితర ముఖ్యోద్యోగులు తరచు హైదరాబాదు వచ్చి చాంద్రాయనగుట్ట వద్ద వారికి చూపబడిన స్థలం బాగున్నదని ఆమోదించారు. వారు రాష్ట్ర ప్రభుత్వోద్యోగులతోనూ, అందుకు సంబంధించిన మంత్రులతోను విపుల చర్చలు జరిపి తమకు యివ్వబడిన హామీలు సంతృప్తికరంగా వున్నవని అన్నారు.

1951 పరిశ్రమలు (అభివృద్ధి, సక్రమీకరణ) చట్టంక్రింద, కొత్త సంస్థల స్థాపనకూ, ఉన్నపారిశ్రామిక సంస్థలలో కొత్తరకం వస్తువుల తయారీకి కూడా లైసెన్సులకై 1962-63 లో 151 దరఖాస్తులు వచ్చినవి. సమీక్షలోనున్న కాలంలో కేంద్రప్రభుత్వంచే 38 లైసెన్సులు యివ్వబడినవి. ప్రస్తుత అవసరాలేమి, రాగల అవసరాలేమి తీర్చుటకు తగిన వస్తూత్పత్తికి లైసెన్సు యివ్వబడిన పెక్కు పరిశ్రమలు మరికొంత విస్త



ఒకానొక లలనాలలామ హస్తపల్లవాలను సింగారించిన రంగారుగాజులు. (ఇవి హైదరాబాదులోని చార్మినార్‌కు సమీపంలో వున్న ఒక గాజుల పరిశ్రమలో తయారైనాయి.)

రిల్లుటకు అనుమతి యివ్వరాదనే కేంద్ర ప్రభుత్వపు విధానాన్ని అనుసరించి పెక్కు దరఖాస్తులు త్రోసిపుచ్చబడినవి.

### చిన్నయెత్తు పరిశ్రమలు

చిన్నయెత్తు పరిశ్రమల అభివృద్ధి కార్యక్రమం, అఖిలభారత చిన్నయెత్తు పరిశ్రమల బోర్డు సూచించిన పద్ధతిలో, రాష్ట్రావసరాలను దృష్టిలో పెట్టుకొని, తయారు చేయబడినది. వృత్తిపనివారి సాంకేతిక నైపుణ్యాన్ని పెంపొందించడానికై వడ్రంగం, కమ్మరం, పోత, యినుము కరగడం పనులు, శాస్త్రీయ గాజు పరికరాలు స్త్రీల చేతిగాజులు వివిధరకాలుగా తయారుచేయడంలోను రాతి, మట్టి సామానులు, చెప్పులు, పింగాణీసరకు, కుంచెలు, యితరవస్తువులు తయారీలోను శిక్షణ కేంద్రాలు నెలకొల్ప బడినవి. పారిశ్రామికులకు సర్వీసింగ్ సౌకర్యాలకల్పనకై జనరల్ ఇంజనీరింగ్ వర్కుషాపులు, టూల్‌రూమ్ సర్వీసింగ్ వర్కుషాపులు, పింగాణీ సర్వీసు కేంద్రం, కత్తుల వ్యాపారం సర్వీసింగ్ కేంద్రములు ప్రారంభించ బడినవి. నల్లసీసం మూస పరిశ్రమ అభివృద్ధికీ, నాణ్యమైన సరుకు తయారీకి తోడ్పడడానికై రాజమండ్రిలో ఒక కేంద్రం నెలకొల్ప బడినది. చిన్నతరగతి, కుటీర పరిశ్రమలలో పరిశోధన జరుపుటకై విజయవాడలో ఒక సంస్థ స్థాపించబడినది.

కొత్త పరిశ్రమలను ప్రవేశ పెట్టడానికై దిగువ పైలట్ వస్తూత్పత్తి కేంద్రాలు నెల

కొల్పబడినవి. పెందుర్తిలో మంగుళూరు పెంకుల తయారీ కేంద్రం, రాజమంద్రిలో రాతిగొట్టాల తయారీకేంద్రం, విజయవాడలో సైకిలు విడిభాగాల తయారీ కేంద్రం. రేడియో విడిభాగాలు, రిసీవర్లు, ఫ్రాక్షనల్ హెచ్. పి. మోటార్లు, స్మాల్‌గేజ్ ఇన్సులేటెడ్ రాగితీగె, ప్రయోగశాలా పరికరాల తయారీకి కూడా యిటువంటి కేంద్రాలే నెలకొల్పబడినవి. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో యేర్పాటైన యీ కేంద్రాలన్నీ తృతీయ పంచవర్ష ప్రణాళిక కాలంలోకూడ కొనసాగించ బడుతున్నవి. తృతీయ ప్రణాళిక కాలంలో చిన్నయత్తు పరిశ్రమల అభివృద్ధికై ప్రణాళికా సంఘం రూ. 350 లక్షలను కేటాయించినది. కాని అటుపిమ్మట ఈ కేటాయింపు రూ. 221.72 లక్షలకు తగ్గించ బడినది. మొదటి సంవత్సరం అనగా 1961–62 రూ. 69.80 ఖర్చుచేయబడినది. 1962–63 కై ప్రణాళికలో రూ. 46.50 లక్షలు కేటాయించ బడినవి. ఇందులో చిన్నయెత్తు పరిశ్రమల విభాగం క్రింద ప్రణాళికా పథకాల అమలుకై రూ. 45.58 లక్షలు వినియోగించబడినవి.

శ్రీకాకుళం, ఏలూరు, గుంటూరు, నెల్లూరు, కడప, కర్నూలులలో గల వడ్రంగం శిక్షణా కేంద్రాలలో, యిదివరకే వస్తూత్పత్తి విభాగాలు ప్రారంభించబడినవి. ఈ పథకాలపై రూ 3.34 లక్షలు వెచ్చించబడినవి. 1962–63 లో యీ కేంద్రాలు రూ 2.77 లక్షల విలువగల వస్తువులను తయారు చేసినవి. 98 మందికి విద్యుచ్ఛక్తితో పనిచేసే యంత్రాలను నడపడంలోనూ, ఆధునిక వస్తూత్పత్తి విధానాలలోను శిక్షణ నిచ్చినవి విద్యుచ్ఛక్తితో నడిచే సాధారణ యంత్రాల వాడకంలోనూ, నడపడంలోనున్నూ, వడ్రంగంలో ఆధునిక వస్తూత్పత్తి విధానాలలోనూ సంచార వడ్రంగం ప్రదర్శన శకటం వివిధ పల్లె, పట్టణప్రాంతాలలో ప్రదర్శనలు జరిపినది. 1962–63నుంచి యీ శకటం కడప జిల్లాలో ప్రదర్శనలను జరుపుతున్నది. ఫొటో చట్రాలు, కుర్చీలు మున్నగు కొయ్యసామాను మున్నగు వాటి తయారీకై ఒక కేంద్రం యేర్పడి పని చేస్తున్నది. 1962–63 లో అది రూ. 8,200 కిమ్మతుగల సరుకును తయారు చేసినది.

శ్రీకాకుళం, ఏలూరు, గుంటూరు, కర్నూలు, కడప, నెల్లూరు, వరంగల్లు ఖమ్మములలో గల కమ్మరం, శిక్షణ–వుత్పత్తి కేంద్రాలు ఎనిమిది 1962–63 లో [illegible] పనిచేసినవి, [illegible] రూ. 1.07 లక్షలు ఖర్చుచేయబడినవి. విద్యుచ్ఛక్తితో నడిచే యంత్రాలను నడపడంలోనూ, వ్యవసాయ పరికరాలు, భవన నిర్మాణ సామగ్రి, మామూలు కమ్మరం సామాన్లను ఆధునిక పద్ధతులలో తయారు చేయడంలోను యీ యూనిట్లు 72 మందికి శిక్షణ నిచ్చినవి. శిక్షణాకాలంలో శిక్షితులు రూ. 0.88 లక్షల విలువగల సామానును తయారు చేశారు. 1963 సెప్టెంబరు నుంచి సామర్లకోటలో ఉక్కుపెట్టెల తయారీ కేంద్ర మొకటి పని ప్రారంభించినది.

## ప్రదర్శన శకటం

కమ్మరి పనులలో ఆధునిక పద్ధతులను వివరించే ఒక సంచార ప్రదర్శన శకటం ప్రస్తుతం పనిచేస్తున్నది. విద్యుచ్ఛక్తి లభించే పల్లెప్రాంతాలకు యీ శకటం వెళ్ళి, యంత్ర పరికరాలను ఉపయోగించడంలో విద్యుచ్ఛక్తి ఆవశ్యకతనుగూర్చి గ్రామస్తులు తెలుసుకొనేటట్టు ప్రదర్శనలను యిస్తున్నది. ఇప్పటికి యిది వరంగల్లు, మెదక్, కరీంనగర్, హైదరాబాదు, నిజామాబాదు జిల్లాలలో పర్యటించింది. 1961–62 సం. కాలంలో యీ శకటం నల్గొండజిల్లాలో ప్రదర్శనలు యిచ్చింది. ప్రస్తుతం మహబూబ్ నగర్ జిల్లాలో ప్రదర్శనలు యిస్తున్నది.

చిత్తూరు జిల్లా తడుకుపేట వద్ద తాళం కప్పల్ని తయారుచేసే కేంద్రం ఒకటి స్థాపించబడింది. ఇది 1963 మే నెలనుంచి పనిచేయడం ప్రారంభించింది. ఈ కేంద్రం వ్యాపార సరళిలో తాళం కప్పల్ని తయారు చేయడమేగాక ఆ ప్రాంతంలో తాళం కప్పలు తయారుచేసేవారికి సహాయపడుతుంది గూడా. 1962–63 సం. కాలంలో రూ. 2,500 లు విలువచేసే తాళం కప్పలు యిక్కడ తయారయ్యాయి.

వడ్రంగం, సద్యం, టైలరింగు, ఎలక్ట్రో ప్లేటింగు మొదలయిన, వివిధ వృత్తులలో విద్యుచ్ఛక్తితో పనిచేసే యంత్రాల వాడకంలో వృత్తి పనివారలకు శిక్షణ యిచ్చే కేంద్రం ఒకటి హైదరాబాదులో పని చేస్తున్నది. ఈ సం॥ 52 మంది శిక్షణ పొందారు.

## పింగాణీ సర్వీసింగ్ కేంద్రం

చిన్నచిన్న పింగాణీ యూనిట్లకు రాజమంద్రిలోని పింగాణీ సర్వీసింగ్ కేంద్రం సహాయకారిగా 1962–63 సం. లో కూడా పని కొనసాగించింది. రూ. 52,000 ల విలువగల పింగాణీ వస్తువుల అమ్మకం జరిగింది. అనకాపల్లి, విజయనగరం, రాజమంద్రి ద్రోణాచలంల వద్దగల మట్టితోను, రాతితోను తయారు చేసే వస్తువుల శిక్షణ కేంద్రాలలో 26 మంది వృత్తిపనివారలు శిక్షణ పొందారు. రూ. 0.90 లక్షలు ఖరీదుచేసే పింగాణీ, రాతి, మట్టి వస్తువులు యిక్కడ ఉత్పత్తి అయ్యాయి. సుద్ద ముక్కలు, ప్లాస్టర్లు వస్తువుల తయారీలో శిక్షణ యిచ్చే రాజమంద్రిలోని శిక్షణ కేంద్రం గత సంవత్సరం రూ. 11 లక్షల విలువచేసే వస్తువులను తయారు చేసింది. ఈ కేంద్రంలో ఆరుగురు శిక్షణ పొందారు.

ఈ కేంద్రాలలో ఉత్పత్తి రోజు రోజుకు పెరుగుతున్నది.

సైంటిఫిక్ గ్లాసు పనిముట్ల తయారీ, ఎనాములు పనులలో తగినంత శిక్షణ యిచ్చి ముందు ముందు రాష్ట్రంలో యీ పరిశ్రమలలో కొత్త యూనిట్లు తలఎత్తడానికి వీలుగా గూడూరులో వీటికొరకై శిక్షణ కేంద్రాలు ప్రారంభించబడ్డాయి. ఈ కేంద్రాలలో 1962_63 సం. కాలంలో 14 మంది శిక్షణ పొందారు. రూ. 35,000 లు ఖరీదు చేసే వస్తువులను ఉత్పత్తి చేయడం జరిగింది.

### పదును పెట్టిన తోలు వస్తువులు

గుంతకల్, వరంగల్, ఏలూరులలో తోళ్ళను పదును పెట్టే నమూనా సంస్థలను నెలకొల్పుతున్నారు. యంత్ర పరికరాల సహాయంతో వీటిలో తోళ్ళను పదును పెడతారు. పాదరక్షలు తదితర తోలు వస్తువుల తయారీకై ఏలూరు, విజయవాడ, హైద్రాబాదులలో నెలకొల్పిన నమూనా ఉత్పత్తి కేంద్రాలు 1962_63 వ సం. లో కూడా పనిచేశాయి. తోలు వస్తువుల కేంద్రాలలో ఈ సంవత్సరం 36 మంది అభ్యర్థులు శిక్షణ పొందారు. ఈ కేంద్రాలు సుమారు రూ. 1 లక్ష విలువ చేసే పాదరక్షలు ఇంకా ఇతర తోలు వస్తువులను తయారు చేశాయి.



ఒక పారిశ్రామికుడు తన కళా నైపుణ్యాన్ని మిశ్రమ లోహపాత్రపైన ప్రతిబింబింపచేస్తున్న దృశ్యం.

1961 వ సం. లో ఏర్పడిన అడ్‌హాక్ చర్మకార పరిశ్రమ బోర్డుస్థానే చర్మకార సలహామండలిని నెలకొల్పారు. రాష్ట్రంలో చర్మకార పరిశ్రమాభివృద్ధికి నిర్దిష్టమైన ప్రతిపాదనలను, పథకాలను రూపొందించేందుకు ఈ మండలి చర్యలు తీసుకుంటుంది. తోలు వస్తువుల తయారీకి సంబంధించిన డిపార్ట్‌మెంటల్ పథకాలన్నింటినీ 1962_63 వ సం. లో చర్మకార సలహా మండలి సవరించి ప్రభుత్వం నుంచి ఆమోదం పొందింది. సవరించబడిన పథకాలను ప్రస్తుతం అమలు పరుస్తున్నారు. ఆటోమొబైల్, రేడియో సర్వీసింగ్‌లలో స్వల్పకాలిక శిక్షణ కోర్సుల కొరకు ఒక పథకాన్ని అమలు పరచడానికీ, ఆటోమొబైల్, రేడియో సర్వీసింగ్‌ల నిమిత్తం యంత్ర పరికరాలు, విడిభాగాల ఉత్పత్తి కొరకు హైద్రాబాదు సనత్‌నగర్‌లో ఒక వర్క్‌షాపును నెలకొల్పడానికి పరిశ్రమల శాఖ కూడా చర్యలు తీసుకుంటున్నది.

### చిన్నతరహా యూనిట్ల నమూనా

ఆరు ముడిసరుకుల డిపోలు, 21 చిన్నతరహా వాణిజ్య పైలట్ ఉత్పత్తి యూనిట్లు ఆంధ్రప్రదేశ్ లఘుపరిశ్రమాభివృద్ధి సంస్థ పరం చేయబడినవి. చిన్నతరహా పరిశ్రమల యూనిట్లకు సంబంధించిన పారిశ్రామిక ఉత్పత్తుల రికార్డులను నిర్వహించేందుకు ప్రభుత్వం చిన్నతరహా యూనిట్ల నమూనా పద్ధతిని ప్రవేశపెట్టింది. 1962_63 వ

సంవత్సరాంతం నాటికి 2,658 యూనిట్ల నమోదు జరిగింది.

చిన్న చిన్న యూనిట్లకు సహాయం చేసే ఉద్దేశంతో కొత్త ఢిల్లీలోని జాతీయ లఘు పరిశ్రమల కార్పొరేషను యంత్రాలు తదితర సాధన సామగ్రిని అద్దెకొనుగోలు పద్ధతిపై సరఫరా చేసే పథకాన్ని ప్రారంభించింది. కార్పొరేషను సరఫరా చేసిన యంత్ర పరికరాలు, ఇతర సాధన సామగ్రి ఖరీదును సాధారణంగా ఏడు సంవత్సరాల కాలంలో అర్ధసంవత్సర వాయిదాలలో చెల్లించాల్సి వుంటుంది. 1962-63 వ సంవత్సరంలో 46 దరఖాస్తులను ఆమోదించడం, రూ. 31,48,194 ల విలువ చేసే యంత్ర పరికరాలను సరఫరా చేయడం జరిగింది.

## నమూనా పథకాలు

పారిశ్రామిక వేత్తల ప్రయోజనార్థం, గాజు, ఎనామిల్, తేలిక ఇంజనీరింగ్, సెరామిక్స్, పోటరీ, కొయ్యపని, ఎలక్ట్రికల్, కెమికల్ మొదలైన పరిశ్రమలను గురించిన అనేక లఘు పరిశ్రమల నమూనా పథకాలను పూర్తి సమాచారంతో రూపొందించడం జరిగింది. వివిధ పథకాలకు సంబంధించిన సుమారు 3,000 ప్రతులను పారిశ్రామిక వేత్తలకు ఉచితంగా సరఫరా చేశారు.

రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో సనత్‌నగర్, విశాఖపట్నం, విజయవాడ, వరంగల్, సామర్లకోట, నంద్యాల, కడప, చందూలాల్ బారాదరిలలో ఒక్కొక్కటి చొప్పున 8 పారిశ్రామిక వాటికల నిర్మాణాన్ని చేపట్టారు. కడప, చందూలాల్ బారాదరీలలో మినహా మిగతా ఆరు ప్రదేశాలలో వీటి నిర్మాణం పూర్తయింది. రెండవ ప్రణాళిక ముగింపు నాటికి ఇవి పని ప్రారంభించాయికూడా. కడప, చందూలాల్ బారాదరీలలోని పారిశ్రామిక వాటికలను తృతీయ ప్రణాళికలో అసంపూర్ణ పథకాలుగా చేర్చారు. కడపలోని పారిశ్రామిక వాటిక పూర్తై పని ప్రారంభించింది. మూడవప్రణాళికా కాలంలో కొత్తగా 43 పారిశ్రామిక వాటికలను నెలకొల్పడానికి ప్రతిపాదించారు. ఈ విధంగా నెలకొల్పబడే వాటికలతో కలుపుకొని మూడవ ప్రణాళిక ముగింపునాటికి పారిశ్రామిక వాటికలసంఖ్య 51కు పెరుగుతుంది. కాగా వాటిలో సహాయంపొందే ప్రైవేటు పారిశ్రామిక వాటికలు 14, సహకార పారిశ్రామిక వాటిక 1, సంప్రదాయకమైన పారిశ్రామిక వాటికలు 16, గ్రామీణ పారిశ్రామిక వాటికలు 20 వుంటాయి.

## సంప్రదాయకమైన పారిశ్రామిక వాటికలు

ప్రస్తుతం ఏడు సంప్రదాయకమైన పారిశ్రామిక వాటికలు పనిచేస్తున్నాయి. ఈ పారిశ్రామిక వాటికలలో ఎన్నెన్ని పరిశ్రమలు నెలకొల్పబడిందీ దిగువ పేర్కొనబడింది:-

సనత్‌నగర్ - 55, విశాఖపట్నం - 17, విజయవాడ - 18, వరంగల్ - 21, సామర్లకోట - 9, నంద్యాల, కడప - 8.

పైన తెలిపిన వాటికలలో ఉక్కు ఫర్నీచర్, సైకిలువిడిభాగాలు, సైకిళ్ళు, శాస్త్రీయ పరికరాలు, చీలలు, రేడియోలు, ఉప్‌రికార్డర్లు, విద్యుత్ కొలమానాలు, సైకిలు డైనమోలైట్లు, ఆటోమొబైల్ స్ప్రింగులు, ఎయిర్ కండీషనర్లు, సేఫ్టీరేజరు బ్లేడ్లు, పి. వి. సి. కేబిల్స్, ట్రాన్స్‌ఫార్మర్లు, స్విచ్ గేర్లు, ఎలక్ట్రికల్ ఉపకరణాలు, ప్లాస్టిక్ వస్తువులు, స్టోరేజ్ బ్యాటరీలు స్టెయిన్‌లెస్ స్టీల్ పాత్రలు, వ్యవసాయ పనిముట్లు మొదలైన వాటిని ఉత్పత్తి చేస్తున్నారు.

## చేతి పరిశ్రమల ప్రగతి

చేతి పరిశ్రమలు కూడా గమనార్హమైన ప్రగతి సాధించాయి. ముఖ్యమైన చేతిపరిశ్రమలన్నిటికొరకు సహకార సంఘాలను ప్రారంభించారు. ప్రస్తుతం 46 చేతి పరిశ్రమల సహకార సంఘాలు పని చేస్తున్నాయి. వీటి సభ్యత్వ సంఖ్య 2,363. వీరు 22 రకాల చేతి పరిశ్రమలలో నిగ్నులై వున్నారు. ఏడు సమిష్టి సౌకర్య కేంద్రాలను నెలకొల్పడం జరిగింది. మేలు రకం పనిముట్లు మొదలైన వాటిని ఇవి లభింపజేస్తాయి. చేతి పరిశ్రమల రంగంలో 1962-63 వ సంవత్సరంలో వివిధ వ్యవస్థీకృత యూనిట్లలో రూ. 10,00,000 ల మేరకు ఉత్పత్తి జరిగింది. రాష్ట్రంలోని ఏడు విక్రయశాలలు రూ. 11.56 లక్షల మేరకు అమ్మకాలు జరిపాయి.

చేతి పరిశ్రమల శిక్షణా కార్యక్రమం క్రింద ఈ సంవత్సరం వివిధ వృత్తులతో 91 మందికి శిక్షణ గరిపారు. వీరుగాక, సమాజాభివృద్ధి కార్యక్రమం క్రింద అనేక మంది వృత్తి పనివారలకు శిక్షణ ఇవ్వడం జరిగింది. తివాసీలు, బిద్రీవస్తువులు, నిర్మల్ వస్తువులు, హిమ్రూ బొమ్మలు మొదలైన వాటి ఎగుమతిని పెంపొందించే నిమిత్తం హైద్రాబాదులోని చేతి పరిశ్రమల వస్తు విక్రయశాలలో ఎగుమతుల అభివృద్ధి విభాగాన్ని నెలకొల్పడం జరిగింది. కొత్త డిజైన్లను రూపొందించే ఉద్దేశంతో పరిశోధనా డిజైను కేంద్రాన్నొకదానిని ప్రారంభించారు.

చేతి పరిశ్రమల వస్తువులపై నాణ్యతను మార్కు చేసే పద్ధతిని 1959-60 వ సంవత్సరంలో ప్రారంభించి ఇప్పటి వరకు ఆరు వృత్తుల విషయంలో ఈ విధానాన్ని అవలంభించారు. దశల వారీగా ఇతర వృత్తులకు కూడా దీనిని వర్తింపజేస్తారు 1962-63 వ సం. లో రూ. 6.39 లక్షలు విలువ చేసే

వస్తువులను మార్కు చేయడం జరిగింది. చేతి పరిశ్రమ లన్నింటిలోకీ విలక్షణమైన స్థానం సంపాదించుకొన్నది బిద్రీ హస్త కళా కౌశల పరిశ్రమ. ఉక్కు రాగివంటి లోహాలతో చేయబడిన వస్తువులపై వెండి బంగారాలతో నగిషీ పూతపని ఆరబ్బీ, పర్షియా దేశాలలో ప్రాచీన కాలంలో చేస్తూ వుండేవారు. మన బిద్రీపరికరాలలో కూడా యీ విధమైన కళానైపుణ్యం వున్నది. ఈ బిద్రీ పరికరాలు తత్తునాగంతో తయారు చేసారు. తుతునాగం యినుప సంబంధంకాని కొన్ని యితర లోహాలు చేర్చిన మిశ్రమ లోహం. ఈ మిశ్రమలోహం మొదట బూడిద వర్ణంగా ఉన్నా తరువాత కారు నలుపు రంగుగా మార్చివేయబడుతుంది. ఈ కారునల్లని రంగుమీద దీనికి పూర్తిగా భిన్నమైన తెల్లని రంగులో వెండితో చేసిన పూతపని వున్న బిద్రీ పరికరాలు అనేక విధాలుగా ఆకర్షణీయమైన కళాఖండాలుగా వెలుగొందుతాయి. వీటిలో గృహాలంకరణ నిమిత్తం ఉపయోగపడే కళానైపుణ్యం కల సుందర వస్తువులేకాక అతి సామాన్యమైన సిగరెట్టు పెట్టెలు మొదలు ఆష్‌ట్రేలు, గాజులు, ట్రేలు, పూలకూజాలు, పళ్లాలు, గుండీలు, పిన్నీసులు వరకూ అనేక రకాలైన పరికరాలు యేటా ఒక లక్ష రూపాయల పైగా విలువగలవి యెగుమతికి సిద్ధంగా ఉంటాయి. ఈ చేతి పరిశ్రమకు ప్రభుత్వం సంపూర్ణమైన సహకారమిచ్చి సాంప్రదాయ సిద్ధమైన యీ కళానైపుణ్యం నశించకుండా మూడు పూవులు ఆరు కాయలుగా వికసించి ఫలించేట్లు చేస్తున్నది. సలహా లివ్వడం, మార్గదర్శకత్వం వహించడం ద్వారా చేతి పరిశ్రముల అభివృద్ధికి దోహదం చేయటానికి రాష్ట్రంలో చేతి పరిశ్రముల సలహా మండలి పని చేస్తున్నది.

## కొబ్బరిపీచు పరిశ్రమ

కొబ్బరిపీచు ఉత్పత్తుల తయారీకై ఉత్పత్తి–శిక్షణా కేంద్రాలను ప్రారంభించారు. ఆంధ్రప్రదేశ్‌లో ఒక లక్ష ఎకరాల కంటే అధిక విస్తీర్ణంలో కొబ్బరి తోట లున్నాయి. కాబట్టి ఇక్కడ కొబ్బరిపీచు పరిశ్రమాభివృద్ధికి చక్కని అవకాశా లున్నాయి. 1962–63 వ సంవత్సరంలో 48 మంది అభ్యర్థులకు శిక్షణ గరపడం, రూ. 34,000 లు విలువచేసే వస్తువులను [illegible] సరకులను విక్రయించడం జరిగింది.

సమాజాభివృద్ధి కార్యక్రమం క్రింద ప్రారంభించిన సహాయక చర్యలను కొనసాగించారు. గత సంవత్సరాలలో వలనే ఈ సంవత్సరం కూడా ఆధునిక ఉత్పత్తి విధానాలలో సంప్రదాయక వృత్తిపనివారలకు శిక్షణ ఇవ్వడం ఆధునిక పనిముట్ల ఉపయోగము ముఖ్యమైన కార్యక్రమంగా వుంటుంది. ఈ సంవత్సరం 756 ఉత్పత్తి–శిక్షణా కేంద్రాలు, ప్రదర్శన యూనిట్లు మొదలైనవి పనిచేస్తున్నాయి. మరో 189 ఉత్పత్తి–శిక్షణా కేంద్రాలు, ప్రదర్శన–శిక్షణా కేంద్రాలను మంజూరు చేయడం జరిగింది. పైన తెలిపిన శిక్షణా కేంద్రా లన్నింటిలోనూ 1962–63 వ సంవత్సరాంతంనాటికి మొత్తం 20,660 మందికి శిక్షణ ఇచ్చారు. వీటిలో 2,082 మందిని సహకార పరిధిలోకి తేవడం కూడా జరిగింది.

రాజనాథ్ కమిటీ సిఫార్సులను పురస్కరించుకొని ఆంధ్రప్రదేశ్‌లో 1959–60 వ సం. లో 13 ప్రాంతీయ గ్రామీణ వృత్తి పనివారల శిక్షణా కేంద్రాలను నెలకొల్పడం జరిగింది. మొదటి సంవత్సరంలో ఖర్చును ఆ యా పంచాయతీ సమితులనుంచి సేకరించిన విరాళాలనుంచి భరించలేదు. 1961–62 వ సం. లో ఈ కేంద్రాలను ప్రణాళికా పథకాల క్రింద మార్చారు. ఇప్పుడు వాటి ఖర్చును పరిశ్రమలశాఖ ప్రణాళికా కేటాయింపులనుంచి భరిస్తున్నారు. ధనాభావంవల్ల 1961–62 వ సంవత్సరంలో 6 కేంద్రాలను మూసివేశారు. మిగతా కేంద్రాలు దిగువ ప్రదేశాలలో పని చేస్తున్నాయి : కాసింకోట, సామర్లకోట, చిత్తూరు, షాద్‌నగర్, నల్గొండ, కర్నూలు, వికారాబాదు.

కుటీర, గ్రామీణ పరిశ్రమల తీవ్రతర అభివృద్ధికి ఉద్దేశించిన రెండు పైలట్ ప్రాజెక్టులు తూర్పుగోదావరి జిల్లాలోని కాకినాడ–పెద్దాపురం, వరంగల్ జిల్లాలోని ములుగులలో ఈ సంవత్సరంకూడా పని చేశాయి. ఈ రెండు ప్రాంతాలలో చేపట్టిన శిక్షణా కేంద్రాలు, ఇతర పథకాలను కొనసాగించారు. వివిధ కార్యక్రమాల ఫలితాలను పరిశీలిస్తున్నారు. కాకినాడ – పెద్దాపురం పైలట్ ప్రాజెక్టు ప్రాంతంలో 61 పారిశ్రామిక సహకార సంఘాలు, ములుగు పైలట్ ప్రాజెక్టు ప్రాంతంలో 16 పారిశ్రామిక సహకార సంఘాలు పని చేస్తున్నాయి.

## ఖాదీ, గ్రామీణ పరిశ్రమలు

గ్రామీణ ఆర్థిక వ్యవస్థను పునరుద్ధరించే తలంపుతో రాష్ట్ర ఖాదీ, గ్రామీణ పరిశ్రమల బోర్డు ఖాదీ, గ్రామీణ పరిశ్రమల పథకాలను చాలావాటిని అమలు పరిచింది. 1962–63 వ సం॥ లో 183 ట్రస్టులు, సంస్థలు, 707 సహకార సంఘాలు ఆంధ్రప్రదేశ్ ఖాదీ, గ్రామీణ పరిశ్రమల బోర్డు నుంచి రూ॥ 19,44,602 (ఋణాలు రూ॥ 13,86,343, గ్రాంట్లు రూ॥ 5,58,259) ల మేరకు ఆర్థిక సహాయం పొందారు.

ఈ సమీక్షా సంవత్సరంలో రాష్ట్ర ప్రభుత్వం ప్రణాళికా సంఘం సిఫార్సుల ననుసరించి, గ్రామీణ ప్రాంతాలలో లఘు పరిశ్రమల తీవ్రతర అభివృద్ధికి మూడు పైలట్ ప్రాజెక్టులను నెలకొల్పింది అనంతపురం, నల్గొండ, గుంటూరులలో వీటిని ప్రారంభించారు. మూడవ పంచవర్ష ప్రణాళికా కాలంలో నాలుగు సంవత్సరాలపాటు ప్రణాళిక గరిష్ఠ పరిమితిని మించి ప్రతి ప్రాజెక్టు ప్రాంతానికి ఉపయోగపడడానికి వీలుగా భారతప్రభుత్వం రూ॥ 20 లక్షల మేరకు కేటాయించింది. కార్యక్రమాలను సిద్ధంచేసి, అమలుపరిచే నిమిత్తం ప్రభుత్వం 1962 నవంబరులో ప్రాజెక్టు స్థాయిలో ప్రాజెక్టు అమలు సంఘాన్నీ, రాష్ట్రస్థాయి సలహా సంఘాన్నీకూడా నియమించింది. ప్రతి ప్రాజెక్టు ప్రాంతానికి అనువైన కార్యక్రమాన్ని రూపొందించే ఉద్దేశంతో స్థానిక వనరులు, అవసరాలు మొదలైన వాటిని గూర్చి తెలుసుకోవడానికి ప్రారంభ పరిశీలనలు జరిపారు.

పారిశ్రామిక సహకార సంఘాలు

1963 మార్చి నెలాఖరునాటికి 1731 పారిశ్రామిక సహకార సంఘాలు పని చేస్తున్నాయి. దిగువ ఇచ్చిన సంఖ్యా వివరాలను బట్టి 1962-63 వ సం॥ లో సహకార సంఘాల నిర్వహణలో జరిగిన అభివృద్ధిని గురించి తెలుసుకోవచ్చు :

1. సంఘాల సంఖ్య 1,731
2. సభ్యుల సంఖ్య 69,244
3. చెల్లించిన వాటా ధనం రూ॥ 32,72,164
4. ఈ సంవత్సరంలో (1-4-62నుంచి31-3-63 వరకు) కొన్న ముడి సరుకుల విలువ రూ॥ 1,17,56,180
5. ఉత్పత్తి చేసిన వస్తువుల విలువ రూ॥ 1,32,45,773
6. విక్రయించిన వస్తువుల విలువ రూ॥ 1,38,06,574
7. ఉద్యోగావకాశాల కల్పన
   (అ) పూర్తి సమయం— 12,032
   (ఆ) పార్ట్‌టైమ్— 13,198
8. ఆర్థిక సహాయం :
   (అ) రాష్ట్రప్రభుత్వం—రూ॥ 6,54,558
   (ఆ) రాష్ట్ర ఖాదీ బోర్డు— రూ. 38,42,212
   (ఇ) ఇతరమైనవి రూ॥ 20,01,744

1962-63వ సం॥ లో తెలంగాణా ప్రాంతంలోని 9 జిల్లాల అసిస్టెంట్ డైరెక్టర్లు, గ్రాంట్ ఇన్ ఎయిడ్ కార్యక్రమం క్రింద పారిశ్రామిక సహకార సంఘాలు పెట్టుకున్న 702 దరఖాస్తులను సిఫార్సు [illegible] గ్రాంటు ఇన్ ఎయిడ్ క్రింద రూ॥ 56,000 ల మేరకు ఆర్థికసహాయం మంజూరుచేయడంజరిగింది.

హైద్రాబాదు, సికింద్రాబాదు నగరాలలో నిరుద్యోగ పరిస్థితిని మెరుగు పరచడానికి 1962-63 వ సం॥ పు బడ్జెటులో రూ॥ 10 లక్షలు కేటాయించారు. అదనంగా 883 మందికి ఉపాధి కల్పించే నిమిత్తం 130 వ్యక్తిగత యూనిటు సహకార సంఘాలకూ,సంస్థలకూ ఋణంగా రూ॥2,21,000లు గ్రాంటుగా రూ॥ 5,14,151 లు మంజూరు చేసేందుకు డిపార్ట్‌మెంటల్ కమిటీ ప్రభుత్వానికి సిఫార్సు చేసింది.


# పరిశ్రమకు ప్రాతిపదిక బొగ్గు

ఉత్పత్తి :

| | | |
|---|---|---|
| 1956 | 16.82 లక్షల టన్నులు | |
| 1957 | 19.19 | ,, |
| 1958 | 21.16 | ,, |
| 1959 | 22.30 | ,, |
| 1960 | 24.51 | ,, |
| 1961 | 27.51 | ,, |
| 1962 | 30.71 | ,, |

నాణ్యతకూ, సేవకూ గుర్తుంచుకొనండి ;

## సింగరేణి బొగ్గు గనులు

'మెహర్ మంజిల్' రెడ్‌హిల్స్, హైద్రాబాద్-4, ఆంధ్రప్రదేశ్.

టెలిగ్రామ్ : 'కోల్‌మైన్స్' టెలిఫోన్ : నెం. 32766, 32271, 34775




చిన్నారి కుసుమాయుధ్ ఇవ్వాళ ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అవుతున్నాడు. అతని దృష్టిని ఆకర్షిస్తూ, నవ్వుముఖంతో ఒక యువతి వాళ్ల ఇంట్లో తిరుగుతోంది. కుసుమాయుధ్ తల్లిదండ్రులకు గారాబు బిడ్డ కావటంవల్ల పొడుగు పేరు పెట్టారు. అయినా పేరు ఆధునికంగానే ఉంది. తల్లి కొడుకు ముద్దు ముచ్చటెం ఎక్కువ రోజులు చూడకుండానే దాటిపోయింది. కుసుమాయుధ్ అప్పుడు నాలుగేళ్ళ వయస్సువాడు. ఇప్పటికి అప్పుడే రెండేళ్లయింది. అయినా తల్లి మళ్ళీ తిరిగిరాలేదు.

అమ్మ ఎక్కడికి వెళ్లింది? కుసుమాయుధ్ మనస్సులో ఈ ప్రశ్న ఉదయిస్తుండేది. దేవుని దగ్గరకి వెళ్ళిపోయిందని ఒకరంటే, మీ మామగారింటికి వెళ్ళిందని ఇంకొకరు అనేవారు. నౌకర్లు మాత్రం చచ్చిపోయిందని చెప్పేవాళ్ళు.

గుజరాతీ కథ

మూలం :
రమణలాల్ వసంతలాల్ దేశాయి

అనువాదం :
ఎస్. వి. ఆర్. శేషగిరిరావు

ఎక్కడికి వెళ్ళితేమాత్రమేం? నన్ను తీసుకు వెళ్ళకుండా ఎందుకు వెళ్ళింది? అని కుసుమాయుధ్ కన్నీళ్లు పెట్టుకుని అడుగుతూంటే అందరి కళ్లూ చెమ్మగిల్లేవి.

అనువాదభారతి

ఒక సంవత్సరంపాటు ఇదే ప్రశ్న వేసివేసి విసిగిపోయిన పిల్లవాడు ప్రశ్న మార్చి అడగటం మొదలు పెట్టాడు "అమ్మ తిరిగివస్తుంది గదూ?" అని.

ఇది విని అంతా అతనివేపు చూస్తూ ఉండిపోయేవాళ్ళు. ఒకోసారి కన్నీళ్లు కనపడనీయకుండా ఒణికే గొంతుతో జవాబు చెప్పేవాళ్ళు—"ఆఁ ఆఁ వస్తుంది, వెళ్ళి ఆడుకో" అని.

ఈ చిన్న జవాబు పిల్లవాడిలో ఉత్సాహం కలిగించేది. వెళ్ళి పరుగెత్తేవాడు. నాలు గయిదు రోజుల తర్వాత మళ్ళీ అదే ప్రశ్న వేసేవాడు. చివరకి

ఈ ప్రశ్న వెయ్యటంకూడ తగ్గించి వేశాడు. చుట్టుపక్కలవాళ్ళంతా కుట్ర పన్ని తనని తన తల్లి నుండి వేరు చేశారనే భావం అతనిహృదయంలో పాతుకు పోయింది. ఒంటరిగా ఉండేవాడు. రాత్రిళ్ళు నిద్రలో అమ్మా, అమ్మా అని కలవరిస్తూండేవాడు.

తండ్రి ఉలిక్కిపడి లేచి, పిల్లవాడి ఒళ్ళు నిమిరేవాడు.

ఇవ్వాళ అకస్మాత్తుగా ఇంట్లో ఒక సుందర స్త్రీని చూశాడు. ప్రతి అందమైన స్త్రీ ముఖంలోను తన తల్లి ముఖాన్ని రూపకల్పన చేసుకునేవాడు. తన తల్లిలా చీర కట్టుకున్న ప్రతి స్త్రీని రెప్ప వాల్చకుండా చూసేవాడు. అటువంటి స్త్రీ ఎవరన్నా ఇంటికివస్తే ఉండిపొమ్మని బలవంతం చేసేవాడు. తల్లి ప్రేమకు కరువయిన పిల్లవాడు ఇట్లా తన బుద్ధికి తోచినట్లు తల్లిని వెదుకుతూండేవాడు.

మిగిలిన స్త్రీలు వచ్చి వెళ్ళిపోతుండేవాళ్ళు. ఈవిడకూడ వాళ్ళలానే వెళ్ళిపోతుందేమోనని భయపడ్డాడు. మిగతా అందరి స్త్రీల మాదిరిగా తనని దగ్గరకి పిలిచింది. ఆవిడ పడకగదిలోనే ఉంది. దగ్గరకి వెళ్లాక చూస్తే కుసుమాయుధ్‌కి ఒక మూలన ఆవిడ పెట్టెలు రెండు మూడు కన్పించాయి. ఇది చూశాక ఈవిడ అందరిలా త్వరగా వెళ్ళిపోదనే నమ్మకం కలిగింది. అయినా తన తృప్తి కోసం "మీరు ఇక్కడే ఉంటారా, వెళ్లిపోతారా?" అని ఆమెని అడిగాడు.

ఆవిడకి నవ్వు వచ్చింది. "నే నిక్కడ ఉండటం మీ కిష్టమా, నేను వెళ్ళిపోవటం మీ కిష్టమా?" అని తిరుగు ప్రశ్న వేసింది.

"మీ రిక్కడే ఉండాలని కోరుకుంటున్నా" అని కుసుమాయుధ్ జవాబిచ్చాడు. ఈవిడ తనని 'మీరు' అని ఎందుకు అంటూందో అర్థంకాలేదు.

ఆమె కుసుమాయుధ్‌కి బొమ్మలిచ్చింది. మంచి బట్టలు తొడిగింది. తల దువ్వింది. తనతోపాటు భోజనానికి కూర్చో పెట్టుకుంది. పిల్లవాడి కిదంతా వింతగా కనిపించింది. ఇంత మంచి అమ్మాయి ఎవరయి ఉంటుంది? ఎందుకు వచ్చిందో? కుసుమాయుధ్ ఆమె దగ్గరే ఉండటం మొదలు పెట్టాడు.

తనకి నచ్చినట్లే ఈవిడ తన తండ్రికి కూడ నచ్చిందని కుసుమాయుధ్ గ్రహించాడు. అయితే నాన్న దగ్గర నెమ్మదిగా మాట్లాడుతుంది ఎందుకనో మరి; చూపు కిందకే ఉంటుంది; స్వేచ్ఛగా నవ్వదు కూడ. ఈవిడ ఎప్పటికీ ఇక్కడే ఉంటే ఎంత బాగుండును! అమ్మ అయితే ఎప్పుడూ ఇంట్లోనే ఉంటుండేది.

కుసుమాయుధ్ ఇక ఉండలేక నిద్ర పోయేముందు అడిగేశాడు—మీరు నాకు బంధువులా?

"అవును."

"ఏమి చుట్టరికం?"

ఆవిడ కొంచెం సందేహించింది. కళ్ళు కదల్చటంలేదు. ఆవిడకి చుట్టరికం గుర్తు రావటంలేదో, మరి ఇంకేమి సంగతో? రెండో క్షణంలోనే తేరుకుని జవాబు చెప్పింది—"నేను మీ అమ్మని" అని.

అమ్మ! కుసుమాయుధ్ బుర్రలోకి అనేక ఆలోచనలు వచ్చాయి. చుట్టరికం వినగానే అమ్మని కౌగలించుకుందామని పించింది. ఎందుకనో అట్లా చెయ్యలేక పోయాడు. కాని ఆవిడ చెయ్యి పట్టుకుని తన రెండు చేతులతో నొక్కాడు. తనకి అమ్మ అవుతాను అని చెప్పిన స్త్రీ కొంచెం నవ్విందిగాని ఈ నవ్వే చాలునా ఏమిటి? తన ఒడిలోకి ఎందుకు తీసుకోదు?

"మీరు నా సొంత అమ్మేనా?" అని కుసుమాయుధ్ సందేహంగా అడిగాడు.

పిల్లల అమాయిక ప్రశ్నలు అప్పుడప్పుడు పెద్దవాళ్ళని కంగారు పెడతాయి. ఆవిడ పెళ్ళిచేసుకుని వచ్చిన మొదటి రోజునే ఒక చిన్న పిల్లవాడు ఆవిడకి కఠోర పరీక్ష పెట్టాడు. పిల్లవాడిని పెంచాలని ఆవిడకి ముందే తెలుసు. తెలిసే పెళ్ళికి ఒప్పుకుంది. పిల్లవాడిని పెంచటం తల్లికే కష్టమయినప్పుడు సవతి తల్లికి మరింత కష్టమని ఆవిడకి తెలియనే తెలియదు. "అవును బాబు, మీ సొంత అమ్మనే" అని జవాబు ఇచ్చింది.

"అయితే మీరు నన్ను 'నీవు' అని ఎందుకు అనటంలేదు?"

"ఇకనుంచి అట్లాగే పిలుస్తా."

"మిమ్మల్ని ఏమనిపిలవను?"

"అక్క అని పిలువు."

ఆవిడకి ఇప్పటిన్నుంచే అమ్మ అని పిలిపించుకోవాలని లేదు. భార్యగా నెరవేర్చవలసిన విధులు బోలెడున్నాయి. అమ్మ అనే మాట తనని ముసలిదాన్ని చేసి వేస్తుందని తోచింది.

పిల్లవాడు హతాశుడయ్యాడు. ఈవిడ తన సొంత తల్లి కాదు. నిట్టూర్పు విడచి నిద్రపోయాడు.

* * *

రెండో పెళ్ళి చేసుకునే మగవాడంటే కొందరు నవ్వుతారు. విమర్శిస్తారు. తిరస్కార భావంతో చూస్తారు. తరచుగా స్త్రీలు, భార్యాసుఖం అనుభవిస్తున్న పురుషులే ఇలా చేస్తారు. దీట్లో స్త్రీల స్వభావానికి కారణం ఉంది. స్త్రీలు సంసార సుఖం లేకుండా బ్రతకగలరు

బ్రతకాలి కూడా అనే సంప్రదాయాన్ని ప్రారంభించే పురుషులే సంసార సుఖ మోహం వదులుకోలేరు గనుక వాళ్ళు స్త్రీల తిరస్కారానికి పాత్రు లవుతారు. కాని భార్యతో సంసార సుఖం అనుభవించే పురుషుడు కూడ ఇటువంటి తిరస్కార భావం ప్రకటిస్తే మాత్రం అలా అనటానికి అతనికి హక్కు లేదని చెప్పవచ్చు.

కుసుమాయుధ్ తండ్రి రెండో పెళ్ళి చేసుకోవా లని నిశ్చయించుకున్నాడు. చేసుకుంటానంటే అంతా సరేనన్నారు. పెళ్ళి అయింది. ఆతను తెలివిగలవాడే. పెళ్ళి చేసుకోవటానికి ఒప్పుకున్న ఆవిడతో ముందే చెప్పాడు తన చచ్చిపోయిన మొదటి భార్య కొడుకుని సొంత కొడుకులా పెంచాలని. ఒక రకంగా సంతోషంగా ఒప్పుకుంది. భర్త ఇంటికి వచ్చిన రోజునుంచి, తల్లి ప్రేమకి కరువు వాచిన కుసుమాయుధ్‌ని తన సొంత కొడుకులా పెంచటానికి గంభీర ప్రయత్నం చేస్తూనే ఉంది.

''కుసుమాయుధ్ ! లేనవా ఏమిటి ? ఏడుగంటలయింది'' అని మెల్లగా పిల్లవాడిని నిద్రలేపేది.

''తలదువ్వుకో.''

తల దువ్వుకోవటానికి పిల్లవాడు ఆవిడ దగ్గర కూర్చునేవాడు.

''ఇక స్నానంచెయ్యి.''

కుసుమాయుధ్ స్నానం చేసేవాడు.

''ఇకలే. నాలుగు రొట్టెల కన్న ఎక్కువ తినగూడదు.'' పిల్లవాడు తల్లి ఆజ్ఞ ప్రకారం లేచి వెళ్లేవాడు.

''ఎక్కువ పరుగెత్తకు. తెలిసిందా?''

వెంటనే పిల్లవాడి పరుగు ఆగిపోయేది.

''చూడు—గట్టిగా అరవకూడదు.''

పిల్లవాడి ఉత్సాహం అంతా చప్పబడిపోయేది.

పిల్లవాడిని నియమప్రకారం పెంచాలని సవతితల్లి మనస్సులో గట్టి ఉద్దేశం కలిగింది. పిల్లవాడు సుఖంగా ఉండాలి, బాగుపడాలి అని ఆమె శ్రమ తీసుకునేది.

కుసుమాయుధ్ క్రమక్రమంగా ఆదర్శమైన బాలుడుగా తయారయ్యాడు. వినయవంతుడు అవుతూ వచ్చాడు. కాని అమ్మ ఇలా ఉంటుందా అనే సందేహం కలిగింది.

ఆకాశంలో ఎగురుతూ, ఆడుతూ వున్న పక్షి ఒక్కసారిగా చెప్పినట్లు వినే విమానం అయితే ఎలా ఉంటుందో కుసుమాయుధ్ స్థితికూడా అలాగే తయారయింది. అతని బట్టలు శుభ్రంగా ఉంటున్నాయి. నడకలో స్థిరత్వం వచ్చింది. చిక్కు ప్రశ్నలు అడిగే స్వభావంపోయి, శాంతంగా విషయాలు అర్థం చేసుకోవటం వచ్చింది. పూర్వం రోజంతా ఇంట్లో ఉండేవాడు. ఇప్పుడు విడవకుండా బడికి వెళ్తున్నాడు. కాని చిక్కిపోతున్నాడు.

''కుసుమాయుధ్ ఒంట్లో రక్తం క్షీణించిపోతోంది. డాక్టరుకి చూపించండి ''అని భర్తతో అన్నది. సవతి తల్లికి చింతగా ఉంది. తల్లితన కర్తవ్యంసరిగా నెరవేరుస్తోందని కుసుమాయుధ్ తండ్రికి నమ్మకం కలిగింది. ఆయన మంచి డాక్టరుని పిలుచుకు వచ్చాడు.

డాక్టరు కుసుమాయుధ్‌ని పరీక్షచేసి ''జబ్బు ఏమీలేదు. కాడ్ లివర్ ఆయిల్ ఇవ్వండి''అని అన్నాడు.

తల్లి కాడ్ లివర్ అయిల్ ఇవ్వటం మొదలు పెట్టింది. ఈ వాసన మందు త్రాగటంకన్న జబ్బుతో ఉండటమే మంచి దనిపించింది పిల్లవాడికి. అయినా తల్లి మాట ఎప్పుడు జవదాటేవాడు కాదు.

''ఇదిగో ఇంత మందు మాత్రం త్రాగి ఆడుకోవటానికి వెళ్లు. అని చెప్పేది తల్లి.

''ఈ మందు బాగుండటం లేదక్క.''

''బాగుండకపోయినా సరే తాగవలసిందే.''

''ఎందుకు ?''

''డాక్టరుగారు చెప్పారుగా.''

''డాక్టరుగారు చెప్పినట్లు చెయ్యాలిసిందేనా ?''

''ఆఁ, తప్పకుండా.''

''చెయ్యకపోతే ?''

''జబ్బు చేస్తుంది.''

''నేను జబ్బు పడ్డానా ?''

''కొంచెం జబ్బు పడ్డావు.''

''మందు తాగకపోతే ?''

''తాగకపోతే చచ్చిపోతావు.

సవతితల్లి భయపెట్టింది. ఆవిడ పి[illegible] వాడిని కొప్పడదు. పిల్లల పోషణ గురిం[illegible] బోలెడు పుస్తకాలు చదివింది. అందుక[illegible] కొప్పడకుండా వాదించి, పిల్లవాడి[illegible] నిరుత్తరుణ్ణిచేసి తను అనుకున్నట్లు పి[illegible] వాడితో చేయించేది. ఇటువంటి పె[illegible] సంభాషణ అప్పుడప్పుడు జరిగేది కా[illegible] పిల్లవాడికి శాస్త్రీయంగా తెలియజెప్పా[illegible] నని ఆవిడ సంతోషపడినా పిల్లవాడి మాత్రం వేరుగా ఉండేది.

శాంతంగా కాడ్ లివర్ ఆయి[illegible] త్రాగాక ''చచ్చిపోతే మాత్రం నష్ట ఏమిటి ?'' అనే ప్రశ్న ఉదయించింద[illegible] అమ్మ చచ్చిపోయిందని ఎవరో అంటుం[illegible] వాళ్ళు. చచ్చిపోయిన తల్లి గు[illegible] వచ్చింది. తనుకూడా చచ్చిపోతే అమ[illegible] దగ్గరకి వెళ్తానేమో ? మనస్సు తర్కి[illegible]

చటం మొదలు పెట్టింది. ఈ తర్కం తిరుగులేనిదని పించింది.

''ఇదిగో నీ కేమయింది ?'' అని ఎప్పటి మాదిరిగా నియమానుసారం స్నానంచేసి భోజనం దగ్గర కూర్చున్న పిల్లవాణ్ణి అడిగింది.

"ఏమీ లేదక్కా."

''అరె! నీ కళ్ళు ఎర్రగాఉన్నా యేం?"

"నాకు తెలియదు.''

''చూడు ఎట్లా ఉందో.''

"కొంచెం చలిగా ఉంది.''

"అయితే స్నానం ఎందుకు చేశావ్?"

''స్నానం చెయ్యకుండా భోజనం చెయ్యటం ఎట్లా ? భోజనం చెయ్యకుండా స్కూలుకు వెళ్ళటం ఎట్లా ?'' అని తన నిత్యజీవితాన్ని నడిపే సూత్రం చెప్పాడు. చెప్పుతూ ఒణికిపోతున్నాడు. గజగజ ఒణికిపోతున్నాడు.

కంగారుపడి పనిమనిషిని పిలిచి ''చూడు అబ్బాయికి జ్వరం రాలేదుగద ?" అని అడిగింది.

పనిమనిషి పిల్లవాడి ఒంటిమీద చెయ్యి వేసి ''బాబు ఒళ్ళు మండిపోతోంది'' అని అన్నది.

"ఇట్లా అకస్మాత్తుగా ఎట్లా వచ్చింది?"

''నీళ్ళు పోస్తున్నప్పుడు కూడా ఈయన ఒళ్ళు వెచ్చగా ఉంది."

"మరి నీళ్ళెందుకు పోశావ్ ?"

''అట్లాగే ఉంటుం దనుకున్నా.''

''పోయి పక్కవేసి అబ్బాయిని పడుకోపెట్టి బాగా కప్పు. నేను డాక్టరుని పిలుచుకువస్తా."

కుసుమాయుధ్ పనిమనిషి చెయ్యి విడిపించుకుంటూ ''అక్కా, నేను స్కూలికి వెళ్ళాలిగా ?" అని అన్నాడు.

తల్లికి పిల్లవాడి నియమపాలనాసక్తి మీద జాలి వేసింది. ''తగలడనీయ్ బడి ! ఈ జ్వరంలో వెళ్తావా ? ఒద్దు. వెళ్ళి పడుకో, మంచివాడవు. నేనిప్పుడే వస్తా."

పనిమనిషి పిల్లవాడిని తీసుకు వెళ్ళింది.

కొంచెం సేపటిలో డాక్టరు కూడ వచ్చాడు. పిల్లవాడికి జ్వరం ఎట్లా వచ్చిందో, ఏమిటో సవతితల్లి డాక్టరుకి అంతా చెప్పింది. డాక్టరు నిద్రపోయే ప్రయత్నంలో కళ్లు మూసుకు పడుకున్న పిల్లవాడి రెప్పలు లాగి పైకెత్తాడు. చంకలో థర్మామీటరు పెట్టాడు. బోరగిల పడుకోబెట్టాడు, వెలకిల పడుకోబెట్టాడు. రొమ్ముమీద, పొట్టమీద వీపుమీద వేలుతో టక్ టక్ మని కొట్టి చూశాడు. పూర్తిగా పరీక్షచేసి మందు రాసిచ్చాడు. అవసరం వస్తే మళ్ళీ పిలవమని చెప్పి వెళ్ళిపోయాడు.

పిల్లవాడి పరిస్థితి విషమంగా ఉంది. కళ్ళు చెరువులు కట్టుకుంటున్నాయి. తల్లి డాక్టరుని పిలిపించింది మళ్ళీ. ఆఫీసుకు కబురంపి పిల్లవాడి తండ్రిని రప్పించింది. భార్యా భర్తలు క్షణం విడవకుండా పిల్లవాడి దగ్గరే కూర్చున్నారు. తల్లి రాత్రి భోజనం చెయ్యలేదు కూడ.

డాక్టరు పిల్లవాడి తలమీద ఐస్ బేగ్ పెట్టమని చెప్పాడు. పని మనుషులు ఐస్ బేగ్ మాటిమాటికి మారుస్తూ అలసిపోయి పిల్లవాడి తల దగ్గరే జోగటం మొదలు పెట్టారు. తల్లి పని మనుషుల్ని పోయి నిద్రపొమ్మని చెప్పి తనే ఐస్ బేగ్ తీసుకు వచ్చి పిల్లవాడి దగ్గర కూర్చుంది. రాత్రి పన్నెండు గంటలదాక రెప్పవెయ్యకుండా ఐస్ బేగ్ మారుస్తూనే ఉంది. ఆవిడకి అలసట అనిపించటంలేదు, నిద్ర రావటం లేదు. పన్నెండు దాటాక భర్త పట్టుబట్టి, నిద్రపొమ్మన్నాడు. ఆయనే పిల్లవాడి సేవచేయటం మొదలుపెట్టాడు. ఎందుకనో తల్లికి నిద్ర రాలేదు.

కాసేపున్నాక పిల్లవాడు ''అమ్మా" అని గట్టిగా అరచాడు.

సవతితల్లి ఒక్కసారి లేచి కూర్చుని భర్త చేతిలో ఐస్ బేగ్ తీసుకుని పిల్లవాడి మంచంమీద తలతట్టున కూర్చుంది.

రాత్రివేళ ఏకాంతంలో పిల్లవాడు 'అమ్మా' అని మళ్ళీ కలవరించాడు.

"ఆఁ బాబూ !'' అని నోటిదాకా వచ్చిన మాటలు సవతితల్లి అనలేదు. సిగ్గుగా ఉంది. ఎందుకు, ఏమిటి ?" అని మాత్రం అనగలిగింది.

పిల్లవాడు కళ్ళు తెరిచి సవతితల్లి వేపు చూశాడు.

''నువ్వు కాదు'' అని పిల్లవాడు కళ్లు మూసుకున్నాడు.

''నువ్వు ఇప్పుడు పిలిచావుగా ?"

"నేను మా అమ్మని పిలిచాను ? కళ్ళు తెరవకుండానే జవాబిచ్చాడు.

కళ్ళు తెరచి ఇంకోసారి ఆవిడ వేపు చూశాడు. "నేను మా సొంత అమ్మని పిలుస్తున్నా."

[illegible] హృదయంలో ఏదో గుచ్చుకున్నట్లనిపించింది. తను ఇప్పటికీకూడ పిల్లవాడికి సొంత తల్లి అనిపించటం లేదా ?

ధైర్యంచేసి అన్నది ''నేనే నీ సొంత అమ్మని.''

"సొంత అమ్మ అయితే 'ఒరే' అంటుంది; 'నీవు' అనదు.''

''నిన్ను 'నీవు' అని ఎప్పుడన్నాను ?" అని అబద్ధం చెప్పింది.

''మరి మా అమ్మ చచ్చిపోయిందిగా?"

''నేను తిరిగి వచ్చేశాగా. కనపడటం లేదూ ?''

''ఎందుకు ?''

''నీకోసంరా నాన్నా''

సవతితల్లి సొంత అమ్మ అయింది. మొట్టమొదటిసారిగా పిల్లవాడిని ముద్దు పెట్టుకుంది. ఆమె హృదయంలోని మాతృత్వపు పాతాళగంగ పైకి ఉబికింది. పిల్లవాడిని రొమ్మున చేర్చుకుని వాడి మంచం మీదే నిద్రపోయింది.

తల్లిచూపిన ఈ ప్రేమని అర్థంచేసుకోవాల్సిన అవసరం పిల్లవాడికి కనపడలేదు. ఇలా రొమ్మున చేర్చుకుని నిద్రపోయేది సొంత తల్లే అని మాత్రం తెలుసు వాడికి. సొంత తల్లిని కరుచుకుని గాఢంగా నిద్రపోయాడు. వాడి ఒంట్లో మండుతున్న అగ్గి తగ్గిపోయింది. వాడి తలమీద ఐస్ బేగ్ పెట్టవలసిన అవసరం లేదింక. వాడి కిప్పుడు అమృతమయమయిన తల్లి ఒడి దొరికింది. 

# పండిన భాగ్యము

*గోలి వేంకటరామయ్య*

సర్వమానవ యాత్రికాస్థాన మద్ది
సస్యలక్ష్మికిఁ బుట్టు వౌ స్థాన మద్ది
సార జలపూర్వములకు నాధార మద్ది
ధన్య సర్వాంధ్రజనుల సంస్థాన మద్ది

విశ్వకల్యాణమ్ము వీక్షింప వచ్చిన
దైవనిర్మిత జయ స్తంభ మనఁగ
ముక్కోటియాంధ్రుల మురిపెంబు దీర్పగా
రంజిల్లు పుణ్యంపుఁ బుంజ మనఁగ
నాగార్జునార్యు విజ్ఞాననైపుణిఁ జూప
నలువొందు దీపికానాళ మనఁగ
సర్వమానవ సౌఖ్యసంధానమునకు వ
చ్చిన హేమభూధరశృంగ మనఁగ

రమ్యనాగార్జున సరోవరంబునందు
దివ్యకృష్ణానదీ భవ్యతీరమందు
విశ్వకల్యాణనాయక వినుతు లెసఁగ
స్తంభ మొప్పారు మోదసంరంభ మెసఁగ.

తూరుపువైపు నెడ్లజత తోరపుఠీవిని దక్షిణాన నొ
ప్పారుచునుండె జ్ఞాననిధియై పొగడొందిన బోధిసత్త్వు డిం
పారఁగఁ బశ్చిమంబున విభాసిలుచుండిరి కర్షకాగ్రణుల్
భారత ధర్మచక్రవిభవంబు విరాజిలు నుత్తరమ్మునన్.

కొండలు కొండలందు రొకకొంద అనాదరబుద్ధి వారికై
యుండఁగ గీము లిచ్చి పురుహూతసుఖంబుల నిచ్చి
ప్రోచుచు
న్నుండఁగఁ గొండ లౌనె? యటు లొప్పినచో నిఁక
నాగభూషణుం
డుండఁగ లేదొకో తుహినమూరెడు కొండలమీఁదఁ
బేర్మితో.

[illegible]
గర్జముపూర్తి యౌట ఫల కాలము కెల్లను ముఖ్య మౌనుగా
నిర్జరు లెల్ల సంతసిలు నిర్మలవాఃపరిపూరితంబు నా
గార్జునసాగరంబు కలకాలము భారత కల్పవృక్షమౌ.

తన విజ్ఞానసుధాస్రవంతికల నాంధ్రక్షోణిపైనన్ వెలా
ర్చిన తేజోమయమూర్తి బౌద్ధమతముం జేపట్టి ధర్మంబు ని
ల్పిన నాగార్జునుఁ డీ ప్రదేశముననే స్వేచ్ఛావిహారంబు స
ల్పెనటే! యెంతటి భాగ్యవంత మహహా? యీ
లీలాప్రదేశం బిలన్

తరగ ల్గంతులు వెట్ట స్వచ్ఛతమనూత్న స్ఫూర్తితో నిచ్చలున్
బరువుల్వెట్టును గృష్ణవేణి యట సర్వప్రాణిసంపత్తి కా
వరులై, యీ మహనీయభూమిఁ గల చైతన్యంబుఁ
గొండాడఁగాఁ
దరమా ధాతకు వాని తాతకును బ్రోద్యద్భోగినీనేతకున్

మనదేశంబున భావిభాగ్యమును సంపాదింపఁగాఁగోరి పూ
న్కొని రిచ్చోటనె దేశనాయకులు నిగ్గుల్తేరగా మేలికొం
దనపుం బంటల నిండుసేయ నిల నుత్సాహంబునన్ నిత్యనూ
తనసందేశము లందుకొమ్ము యిఁక నాంధ్రా! పండె నీ
భాగ్యముల్

---

# మన తాతముత్తాతలు

కొత్త భావయ్యా చౌదరి

ప్రఖ్యాత రాజ్యపాలకు లగు ఆంధ్ర శాతవాహన రాజుల యేలుబడిక్రింద ఆంధ్రదేశ మొక విశిష్టమైన సంస్కృతి రూపొందించుకొనినది— పరమత సహిష్ణుత, వైదిక ధర్మ, కర్మానుష్టానములతో బాటు బౌద్ధ ధర్మావలంబనము, జైన మునులయందు గౌరవము, తల్లిదండ్రుల యందమితభక్తి, తల్లి పేరిటనే తమ నామములు ముందువంశముగా చెప్పుకొనుట, వ్యవసాయాభివృద్ధి, దేశరక్షణ కలాపములందన్ని తెగలవారు పాల్గొనుట, పన్నులు చెల్లించుట, వ్యాపార విస్తరణ, బంగారు మున్నగు ఆభరణాలు, మంచిదుస్తులు, పూలమాలలు మొదలైనవి ధరించుట, మేలైన యాహారము భుజించుట యిత్యాదులా నాడు ఆంధ్రదేశమున గల సంస్కృతీ నిదర్శనములలో కొన్ని — బౌద్ధ స్తూపచైత్య, విహారాదులెన్నిచోట్లనో వెలసినవి. మూడవ శతాబ్ది ప్రథమ దశాంతమున ఆంధ్రరాజ్యమంతమై క్రమముగా ఇక్ష్వాకు రాజులు, పల్లవులు, శాలంకాయనులు, విష్ణు కుండినులు, చాలుక్యులు మున్నగువారి రాజ్యపాలనకు దారితీసినది. ఇక్ష్వాకులు చాల వరకు ఆంధ్రుల ననుకరించారు — వీరి యేలుబడిలో నాణెములు మాత్రము వేయలేదు.— పూర్వనాణెములే వాడినారు. ఆంధ్రులు చాలా రకాల నాణెములు చలామణీ చేసెడివారు. ఆంధ్రులవలెనే నానావిధ యజ్ఞములు, చివరకు అశ్వమేధయాగముగూడ కావించిరి. వాసిస్టీపుత్ర శాంతమూల రాజిట్టి యాగ మొనర్చినాడు.

రైతులను ప్రోత్సహించి వీరు వేలకొలది నాగళ్ళు పంచిపెటేవారు. వీరి రాణులు బౌద్ధమత విశ్వాసులై, నాగార్జున కొండ వద్ద ననేక స్తూప, చైత్య, విహార, ఆయక స్తంభాది నిర్మాణ దక్షులై పేరొందిరి. నాడు నాగార్జున కొండవద్ద మహాయానము అనబడు బౌద్ధము మిక్కిలి వ్యాప్తికి వచ్చెను. చీనా, సింహళము, కంబోడియా, మున్నగు విదేశములనుండి యాత్రికులేగాక, నేర్చుకొను శిష్యులుగూడ విస్తారముగా వచ్చుచుండిరి. ఈ కొండ దగ్గరనే విజయపురి యను రాజధాని యుండెడిది — నాగార్జున కొండవద్ద నుండిన విశ్వ విద్యాలయములలో హీనయానము మొదలైనవిగూడ నేర్పెడివారు. స్త్రీలు దాన ధర్మాలకు పేరొందిరి. బోధిశ్రీ యను నామె యొక చైత్యశాల, దద్దశము కట్టించుటేకాక యితరచోట్ల ధమ్మగిరిలో నొకగదిని, దేవగిరిలో నొక మండప స్తంభము, శాల, పూర్వశైలమున నొక చెర్వు, వసారా, మండపములు, ఘంటసాలలో నొక రాతిమండపము, హిరుముదువలో మూడుగదులు, పాపిలయను చోట కొన్ని గదులు, పుష్పగిరిలో నొక రాతి మండపము కట్టించి పేరొందెను. ఎన్నో శిల్పములు యీ బౌద్ధకట్టడము లందున్నవి. ఇవి ఆనాటి శిల్పకళా ప్రావీణ్యమును చూపుచున్నవి. నాగార్జునుడు, ఆనందరుషి మున్నగు వారచట నివసించిరి. అచట కొన్ని మఠములు, ఆలయములు కట్టింపబడినవి, శాంతిశ్రీ యొక మఠమును. కొగ బలిశ్రీ యొక మఠమును కట్టించిరి. అమరావతిగూడ యప్పటి కుండిన ప్రసిద్ధ విశ్వ విద్యాలయము-బౌద్ధ మహాస్తూపమును కలిగి యుండిన పవిత్ర క్షేత్రము. బ్రాహ్మణులకు యజ్ఞయాగాదులలో రాజులు దానములు చేయుచుండిరి. ఆ కాలమున దీనారములు, మాషకలను నాణెములు వాడుకొనేవారు. ఆంధ్రదేశ మానాడు యితర దేశస్థుల కాధ్యాత్మిక విద్య ప్రసాదించుటలో ఘనతను సంపాదించెను. విదేశ వ్యాపారము శాతవాహన రాజ్యములో సాగినదానినే ఇక్ష్వాకురాజులు సాగించిరి. రోము చక్రవర్తి టైబీరియస్ మున్నగు వారి బంగారు నాణెములు మనకపుడు వచ్చెడివి. పట్టు, నూలువస్త్రములు మొదలైన వాని కవి విస్తారము లభించెడివి. 1 వ శతాబ్దినుండి తత్పూర్వము యీ వ్యాపారము కలదు. దాదాపు యేబదివత్సరా లీ వంశరాజులు వీరపురుషదత్త, శాంతమూల II మొదలగువారు పాలించిన తర్వాత యీ ప్రాంతము పల్లవరాజులకు వశమైనది. ప్రతి పల్లెకును బౌద్ధమత మప్పటికే వ్యాపించెను. పల్లవరాజుల కాలములో బౌద్ధమతము పోషింపబడనందున క్షీణించినది. కాని దాని స్థానములో శైవ, వైష్ణవ మతములు, ఆల

యములు అచ్చటచ్చట వెలసినవి. అదివర కాంధ్రమున హెచ్చుగా దేవాలయములు కన బడవు. దేవాలయములకు, బ్రాహ్మణులకు అగ్రహారములిచ్చి పోషించుట పల్లవరాజులు చేపట్టిరి. దానితో నివి వృద్ధికివచ్చినవి - ఉత్తర దేశమునుండి గుప్తరాజులుగూడ దీని వ్యాప్తికి తోడ్పడిరి. వేదశాస్త్ర సంపన్నులగు వారికే అగ్రహారము లిచ్చుచుండిరి. వానినిసర్వ పరిహారముగానే పన్నులులేకుండనిచ్చేవారు. దేశము రాష్ట్రములుగా విభజింపబడి పాలింప బడేది. హిరణ్య. కర్మక, వేంగీరాష్ట్రము [illegible] పథమనిగూడ యనేవారు. ఆంధ్రపథ మని పేరు మన దేశమునకుండెను. వేదవిద్య లానాడు బాగుగా నేర్చిన బ్రాహ్మణు లుండే వారు. విద్యార్థులకు వేదాలు నేర్పేవారు. రాజోద్యోగులలో భోజక, రహసాదికట, ఆయుక్తక, వ్యాపృత, నియోగిక, వల్లభ, నియుక్త, రాజవల్లభ, శాసన సంచరాంతక, అధ్యక్షక నామాది పదవు లుండేవి. ఇంకను రాజకుమార, సేనాపతి, రాష్ట్రిక, మాదలిక, దేశాధికట, గుమిక, తుదిక, వల్లవ, గోవల్లవ, అమాత్య. అరనధికట, నేయిక, భదమను స్పాది యుద్యోగము లుండేవి. వీరందరి వల్లను రాజ్యపాలనము స్థిరముగా నుండేది. నాటిరాజభాషలు సంస్కృత ప్రాకృతములు. వానిలోనే రాజుల దానశాసనాలు రాగిరేకుల పైన, రాళ్ళమీద చెక్కించేవారు. ఐనా, దేశభాష తెలుగే. వ్యాపారములో అన్నాం లేక చంపారాజ్యము, సయాం రాజ్యములు గూడ యుండేవి. మన సరకులెన్నోవస్త్రాలు మొదలైనవి ఎగుమతి యయ్యేవి. రాజులు చెర్వులు, బావులు త్రవ్వించుటే గాక, భూములు, గోవులు, నాగళ్లు విరివిగా పంచి పెట్టేవారు.

యుద్ధములు పల్లవ పాలనలో విస్తారంగా కనబడుచున్నవి. స్కందవర్మ, కుమార విష్ణు II, కాలములలో చాలాజరిగెనట. కుమార విష్ణు అశ్వమేధ యాగము చేసినాడు. ఇది యాతని దిగ్విజయ సూచకమే. స్కంద వర్మ II, వీరవర్మ, విష్ణుగోపుల కాలము లందుగూడ యుద్ధములందు జయము సంపా దించినారు. ఈ పల్లవరాజులు కాంచీపుర ప్రాంతీయులై యుండి క్రమముగా ఆంధ్రదేశ మాక్రమించినవారగుటవల్ల యీ యుద్ధములు తరచుగా కల్గెను. పల్లవరాజుల పాలనలో ననేక వృత్తులవారుండిరి. అందులో కంచర, [illegible] దారులు, జూదర్లు, అంత్యజులు, నటులు, మంగలులు, కిరాతులు, నేతవారు, సీటమును గువారు మున్నగువారుండి పన్నులు చెల్లించే వారు. ఉప్పు, పంచదార, భూమిశిస్తు మొద లగు పన్ను లాకాలములోనుండేవి. ప్రభుత్వో ద్యోగులు పాలు, వెన్న, మజ్జిగ, పూలు, పండ్లు, గడ్డి మొదలగునవి పారితోషికము లుగా గ్రహించేవారు. నేరములు చేసిన వారికి అగ్ని, జల, విషపరీక్షలు మొదలగు తొమ్మిది పరీక్ష లుండేవి. దొంగతనాలకు కఠిన శిక్షలుండేవి. మరణ శిక్షలుగూడ ఉండెడివి. బహిరంగ స్థలాలలో చెట్లకు కట్టిగాని, వధ్యశిలల మీదగాని శిక్షలను పరచేవారు. ఆకాలములో జనులకు పూరి యిళ్ళు విస్తారముగా వుండేవి. అందువల్ల తరచు అగ్నిప్రమాదము లుండేవి. పూర్వం నుండి నగరాలలో ధనికుల యిండ్లకు తెరలు ఉండేవి. వాటి చాటునుండియే స్త్రీలు వీధుల లోనికి తొంగిచూచేవారు. దారిన బోయే కోడెగాండ్రను తిలకించేవారు. స్త్రీలను దొంగ తనంగా యెత్తుకుపోయే దురాచారముండేది. స్త్రీలలో కొందరు పతివ్రతలైనా, కొందరు మఱదులతో, పరులతో వ్యభిచరించేవారట. వీరు నానావిధ ఆభరణాలు, పూలు ధరించు చుండిరి. ఆ కాలములోనే వేంగీదేశము శాలంకాయనరాజులు పాలించేవారు. ఇది ఏలూరుకు 8 మైళ్ళ దూరములోనుండి నానా యుద్ధములవల్ల నేటికి శిథిలమైపోయి కనపడకుండా భూగర్భమున అవశేషములతో నున్నది. ఈ రాజ్యములో చిత్రరథస్వామి యను పేరిట సూర్యారాధన కనబడుచున్నది. ఈ రాజులలో దేవవర్మ, హస్తివర్మ, నందివర్మ, చండవర్మయను వారుండిరి. వీరిలో హస్తివర్మ సముద్రగుప్తుని సామంతుడు.

ఈ రాజులు పరమ మహేశ్వరుల మనియు, పితృపాదానువింద భక్తుల మని చెప్పుకొన్నారు. తల్లిపేరిట వీరు చెప్పుకోలేదు. దేశమును విషయము లుగా వీరు భావించిరి. పల్లవుల క్రింద నున్నట్లే రాజోద్యోగు లీ దేశములోనుండిరి. వీరుగూడ బ్రాహ్మణుల కగ్రహారము లిచ్చు చుండిరి. తమ వంశాభివృద్ధికి, కీర్త్యభివృద్ధికి, ధర్మాభివృద్ధికి వీనినిచ్చుచుండినట్లు లిఖించిరి. రథకారులకుగూడ అనాడగ్రహారము లిచ్చుట విశేషము. ఆ రథకారులుగూడ చతుర్వేద పారంగతులే. పిడి మాయనే గ్రామమును నందివర్మ యిట్లిచ్చిన మహా రాజు. ఈ రథకారుడు శాపానుగ్రహ సమ ర్థుడు, తపస్వియునట.

భూమి కొల్త పరిమితిలో నివర్తనా లుండేవి. ఈ పేరు కాకతీయుల కాలము వరకు వాడుకలో నున్నది. పుట్లుగూడా చెప్ప బడినవి. బర్మా, మలయా, ఇండోచీనాలకు వేంగీదేశ వ్యాపార మా కాలములో నుండెడిది. 4 వ శతాబ్దినాటి వేంగి లిపి శాసనా లీ దేశములందు దొరకినవి.

రాజధాని వేంగినుండి కళింగ, ద్రావిడ, కర్నాటక, మహారాష్ట్ర, దక్షిణ కోసలదేశ

ములకు పోవు రాదార్లు ఆనా డుండేవి. దేశములో చాంద్రమానముగా తిథులు, వారములు, పక్షములు, రాజుల పరిపాలన సంవత్సర సంఖ్యలు వాడుకలో నుండెను. హస్తివర్మ, చండవర్మల కాలములలో కొన్ని యుద్ధాలుండెను. సామంతులు చండవర్మపై తిరుగబడగా వారి నణచి వేసెనట.

వీరి కాలములో గూడ సంస్కృత, ప్రాకృత భాషలే రాజభాషలుగా నుండెను. వేంగీ లిపివాడబడు చుండెను. ఇది నేటి తెలుగుకన్నడ లిపులకు మూలము.

శాలంకాయన రాజుల తర్వాత ఆంధ్ర మును పాలించినది విష్ణుకుండి రాజులు. వీరు మొదట త్రికూట పర్వత ప్రాంతమున (కోటప్పకొండ ?) వెయ్యి గ్రామములకు ప్రభువులై క్రమముగా కమ్మ రాష్ట్రము, వేంగిరాష్ట్రము లాక్రమించి విశాఖపట్టణము వరకు నేలిరి. వీరు10మంది క్రమముగా పాలించిరి. ఇది దాదాపు 450_600A.D. మధ్యకాలమనువచ్చును. విక్రమేంద్రవర్మ, గోవింద వర్మ, మాధవవర్మ ఇంద్రవర్మ, మున్నగు వారు.

వీరి పేర్లను బట్టి వైష్ణవ మతస్థులుగా కనుపించినా, వీరు శైవమతము నందును, బ్రాహ్మణ కర్మలు, యజ్ఞాదులందును మిక్కిలి పట్టుదలగలవారగుటచేత బ్రాహ్మణులకు భూ, గో, సువర్ణ, కన్యాదానములు విరివిగా నిచ్చేవారట. మాధవవర్మ వెయ్యి అగ్నిష్టోమము లొనర్చెనట. ఇంకా 11 అశ్వమేధాలొనర్చెనట. సర్వమేధములొనర్చెనట. అనగా యిందు జంతుహింస, నరబలి జేరినవి. అందులో సువర్ణ, పుండరీక, పురుషమేధ, వాజపేయ, యుద్ధ్యాషోడశి, రాజసూయ, ప్రాధిరాజ్య, ప్రాజాపత్యాదులున్నవట.

రాజ్యములో పూర్వమున్నట్లే విషయాలు, రాష్ట్రాలు విభజన లుండేవి. ప్లాకిరాష్ట్రమను నదొక కొత్త రాష్ట్రము కనబడుచున్నది_మహత్తరులు, అధిరాజులు, విషయాధికారులు మొదలైన ఉద్యోగులు వీరి చేతిక్రింద నుండేవారు.

గ్రహణ సమయములలో దానమిచ్చుట ఆకాలములో నుండెను. ఇంద్రభట్టారక వర్మ కాలంలో గజసైన్యము లందు చతుర్థంత గజములుండే వని, అవి ద్విదంత గజములతో పోరాటము యుద్ధములందు చేసేవని చెప్ప బడినది. వీరికి దాయాదులతో పోరాటము లుండేవి.

గోపాదవర్మ, మాధవవర్మల కాలము లందుగూడ యుద్ధము లుండెనట. ఈ రాజుల కాలములోగూడ సంస్కృత, ప్రాకృత భాషలే రాజభాషలుగా నుండెను. వీరు వాకాటక రాజులతో బంధుత్వములు కలిగియుండిరి. వీరికాలములో బౌద్ధ, జైన మతస్థులకు రాజప్రాపకము లేనందున ప్రజలలోగూడ ఆ మతముల యభివృద్ధి సన్నగిల్లెను కాని కొందరు ప్రజలింకను వాని ననుసరించుచునే వచ్చిరి.

క్రీ. శ.620ప్రాంతమునకుపశ్చిమచాలుక్య రాజులు కమ్మరాష్ట్రము, వేంగీరాష్ట్రము, దేవరాష్ట్రములు జయించి ఆంధ్ర, కళింగ దేశములందు తమ పాలన నెలకొల్పిరి. కుబ్జవిష్ణువర్ధనుడి చీటిపాలకులందు మొదటి వాడు. పశ్చిమ చాలుక్య రాజులు శైవమత మవలంబించినా, జైనమతమునుపోషించుచు వచ్చిరి. ఈ పద్ధతినే వేంగీదేశ మేలుచు వచ్చిన కుబ్జవిష్ణువర్ధన వంశీకులు (రాష్ట్రకూటరాజులుగూడ) అనుసరించుచూ వచ్చిరి. విష్ణుకుండిరాజులవలెనే వీరును బ్రాహ్మణాగ్రహారములు విరివిగా నొసంగిరి. ఇచట వేద ఘటికాస్థానములను వెలయించిరి. శాస్త్రము

లన్నిటి బోధించువారి నేర్పరచిరి. వీరును సూర్య, చంద్రగ్రహణసమయములుమిక్కిలి పవిత్రములని యనేక దానధర్మములు ఇచ్చుచు వచ్చిరి. తెలుగుభాషను క్రమముగా శాసనముల కెక్కించి పోషించిరి.

పట్టాభిషేక కాలములలో నీ రాజులు బంగారుతో తులాభారములను తూగి పంచి పెట్టుచుండిరి. ఆ రోజులలో పెనుగొండ వైశ్యులు ధనికులై, కులాచార పరాయణులై పేరొందిరి. మూడవ విష్ణువర్ధనరాజు కోరినను తమ వాసవీకన్యను భార్యగా నీయ నిరాకరించి, నాశనమైరి. కొందరు పారిపోయి కమ్మ, గొల్ల మున్నగు కులములలో ప్రవేశించిరి.

ఎనిమిదవ శతాబ్దములోని నాల్గవ విష్ణువర్ధనుని కాలమున కీ రాజ్యమున పన్నెండు వేల గ్రామము లుండెను. ఈ రాజులు క్రమముగా శైవ దేవాలయములను వందలుగా నూరూర నిర్మింప దొడగిరి. ఒక్కనరేంద్ర మృగరాజు (807_847) 108 శివాలయములు కట్టించెను. శైవశిల్పాలు రాష్ట్రకూటులు ఎల్లోరాగుహాలలో నేర్పరచిరి. 762 ప్రాంతమున మూడవ విష్ణువర్ధనుని కాలములో జైనులకొక గ్రామమీయబడెను. రాజులవద్ద మంచి గజసైన్యములు, అశ్వసైన్యములు, యోధసైన్యాలు నుండెను. ఆ రోజులలో రాష్ట్రకూట రాజులు జైనమతస్థులై యుండి వీరితో యుద్ధములు సలుపుచుండిరి. మూడవ విజయాదిత్యుడు (848_891) పాండ్య, కోసల, గాంగ, పల్లవరాజులతో పోరాటములు సల్పి జయించెనట. ఈ కాలమునుండి ఆంధ్ర భాషలో పద్యశాసనములు వెలువడినవి. దాదాపు 650 A. D. నాటినుండి తెలుగు రాజశాసనాలలో వాడిరి_విప్పర్ల శాసనమట్టిది_మాచెర్లలో నొకటి యున్నది. నిత్య శ్రాద్ధములు చనిపోవు వారికొరకు

కొందరు కావించు చుండిరి. చాళుక్య భీమ రాజుతన కుమారుడు యుద్ధములో చనిపోగా నష్టే చేయుచు వచ్చెను. బ్రాహ్మణులతో బాటు సేనాధిపతులకు సైతము అమ్మరాజు I కాలమునుండి అగ్రహారము లీయబడు చుండెను. దేశరక్షణ ఆకాలములో ప్రధాన మయ్యెను. అద్దంకి, ధర్మవరము, బెజవాడ లలో 9,10 శతాబ్దుల నాటి పద్యశాసనము లున్నవి. ఇందు మంజరీ తరువోజలు, మధ్యాక్కరలు, సీసాలు మొదలైనవి కలవు. రెండవ అమ్మరాజు (945-970) జైనసతులకు, శైవదేవళములకు, మఠము లకు భూముల నిచ్చి పోషించెను. ఆ కాల ములో కార్పటీవ్రత మొకటి బ్రాహ్మణులు సలిపేవారు — త్రిరాత్ర ఉపవాసము, దైవ పూజ అందుండెడిదట. అర్హనంది యను జైనమత గురువా కాలమున నీయన పోషణలో నుండెను. చామెకాంబ యను పట్వర్ధను కులకాంత యొకటి నృత్తగీతా దులలో బ్రవీణయై రాజునకు భోగభార్య యయ్యెను. ఆ కాలములో మన దేశపు వ్యాపారము సయాం దేశమువరకు సాగు చుండెను. శక్తివర్మ I నాణెములు సయాం దేశములో లభించినవట. ఇవి బంగారువి. విమలాదిత్య చక్రవర్తి (1011-1022) పాలించు కాలములో గూడ జైన, శైవ మతములు సమానముగా పోషింపబడెను. ఆయన త్రికాల యోగియను జైనగురువునకు శిష్యుడయ్యెను. దక్షిణదేశపు చోళరాజుల లోని రాజరాజు కుమార్తె కుందవాంబ నీతడు పరిణయమై, యాతని యంద దండలతో రాజ్య మేలెను. ఈతని కుమారుడు రాజరాజనరేంద్రుడి పాలనలో పశ్చిమ చాళుక్య సోమేశ్వరుడు ఈయనతో వైరము బూని జయించెను గాని మరల చోళ రాజు సాయముతో రాజ్యము గైకొనెను.

ఆ కాలములో సత్రములు నెలకొల్పుట, విద్యార్థుల కన్న సత్రాలు పెట్టించుట, దేవాల యములందు పూజలు, చనిపోయిన వీరుల పేరిట దేవళాలు కట్టుట. దేశికవితా పోషణ, యిత్యాది సత్కార్యములు రాజులు చేయు చుండిరి.

నన్నయభట్టుచేత ఆంధ్రమహాభారతము వ్రాయించ నారంభించిన కీర్తి యీ రాజరాజ నరేంద్రునకే దక్కినది. నన్నయ అష్టభాషా దురంధరుడు. ఈయనకు తోడుగానుండిన నారాయణభట్టును కైడు భాషలలో ప్రవీణత యుండెను. వీరికి అగ్రహారము లిచ్చి పోషించెను. ఆ కాలమునుండి తెలుగు కవిత్వము బాగా వృద్ధియైనది.

నన్నెచోడుడు పోకనాడు పాలించుచు కుమార సంభవ కావ్యము తెలుగున వ్రాసెను. ఆ కాలములో దేవళములందు అఖండదీపా రాధనలు చేయువారు. వానికై గొర్రెలు, ఆవులు, ధనము మూలనిధిగా నిచ్చి నిత్యము దీపారాధనకు నేయి వచ్చునట్లు భక్తులు (స్త్రీ పురుషులందరు) చేయుచుండిరి. వీరిలో రాజులు మొదలు సాధారణ జనులవరకు నుండిరి. ఆ కాలములో ద్రాక్షారామ భీమేశ్వ రాలయము, బెజవాడ శ్రీశైల మల్లేశ్వర ఆలయములు, చేబ్రోలు కుమారస్వామి ఆలయము మొదలైనవి ప్రసిద్ధిగా నుండెను. భక్తులింకా బృందావనములు వేయించి, పూల చెట్లు నాటించి దేవరలకు పూజలకు పుష్పాలు వచ్చేటట్లు చేసేవారు. దేవరలకు నానావిధ భక్ష్యపరమాన్నములు, ఫలహారములు చేయించి సమర్పించే వారు. దాతలకు కొంత అందులోనిది అర్చకు లిచ్చేవారు. పండుగ పర్వాలలో ఇవి హెచ్చుగా గూడ నుండేవి. పోకతోటలు, చెరకు, అరటి మున్నగు తోటలు దేవళముల కుండేవి. ఈ చాళుక్య పాలనలో గద్యాణములు, మాడలు అను నాణెము లుండేవి. ఇవి బంగారువి. భూమికి నివర్తనాలు, పుట్లు, ఖండికలను విభాగా లుండేవి. శాలివాహన శకము ఆంధ్రరాజులకు గుర్తుగా ఆ కాలములో గూడ చాంద్రమాన నెలలు, సంవత్సరాలుతోను లేకుండను వాడే వారు. రాజశాసనాలు దేవాలయము లందు శిలలపైనను, రాగిరేకుల మీదను చెక్కే వారు. ప్రజలుగూడ తమ ధర్మాలన్నీ శిలా ఫలకముల మీద చెక్కించే వారు. ఆంధ్ర రాజ్యములో చాలమంది సామంతరాజ వంశము లుండేవి. వెలనాడు, కమ్మనాడు, పలనాడు, ధరణికోట, వేంగి, కొలను, కోనసీమ, కొండపడమటి సీమ, యిత్యా దులలో వారు పాలించారు.

ధరణికోటలోను వెలనాటి రాజుల రాజ ధాని చందవోలు నందును అప్పటివరకు (12వ శతాబ్ది) బౌద్ధారాధనలు గూడ నుండెను. ఉండవల్లికొండ గుహలలో బౌద్ధ చిహ్నములు కానవచ్చు చున్నవి. తర్వాత క్రమముగా నచట అనంతశయనాలయము, నృసింహాలయము మొదలైనవి వృద్ధియైనవి. అనేక జంతుశిల్పాలు గూడ అచట మనో హరముగా చెక్కబడి, ఆ శతాబ్దులలోని శిల్ప కళా ప్రావీణ్యమునకు గుర్తుగా నేటికి నిలిచి యున్నవి. 639 A. D. లో చైనా యాత్రికుడు హుయన్‌సాంగు ఆంధ్రలో పర్యటనము కావించెను — బౌద్ధస్థలము లన్నిటిని దర్శించెను. అమరావతిలో అభిధమ్మ సూత్ర ములు ఫలించెను. ఆంధ్రదేశమున కిది గర్వ కారణము. రాజులలో క్రమముగా ముఖ్య ముగా దాయాదులలో రాజ్యకాంక్ష పెరిగి, చివరి శతాబ్దాలలో ననేక యుద్ధాలు కలిగెను. పశ్చిమ, తూర్పు చాళుక్యరాజులు జ్ఞాతులై యుండియు, యుద్ధములు సలిపిరి. లేని యెడల దేశమింకను వృద్ధి యయ్యేడిదే.

(మిగతా 88 వ పేజీలో)

# సస్యలక్ష్మి ★ సురభి నరసింహము

ఎదుగవే ! ఎదుగవే ! ఓ సస్యలక్ష్మి !
ముదముగాఁ మాచేల నో ధాన్యలక్ష్మి !॥

భువిలోని సారమ్ము నవశక్తిఁ గూర్పంగ,
నదిలోని నీరమ్ము నవదీప్తి నొసగంగ,
మారాకులను దనరి, మారుతమ్ముల కలరి
కనులపండువు కాగ, జనులకోరిక లూగ ॥ఎదుగవే !॥

పచ్చపచ్చగ నీవు పసిడికాంతుల నీన,
వసుధాంగనాశోభ, వరల వన్నెలలోన,
వరకళల రాణివై, సిరుల దొరసానివై
దరహాస దీధితుల విరియించి, మురిపింప ॥ఎదుగవే !॥

అద నెఱిగి, పద నెఱిగి, ఆనందమున రైతు
ఎండవానల కోర్చి, మెండుకష్ట మొనర్చి,
నారు పోసినదాది, ధారవోయును శక్తి,
అనురక్తి కలిగింప, ఆశలను ఫలియింప ॥ఎదుగవే !॥

ఆశలే మోసులే, అందాల చివురులై
పొందికగ మాచేల డెందాలు పుష్పింప,
కల్యాణకళలతో, కమనీయకాంతితో
కలిబాధలనుఁ దీర్ప, కలిమి బలిమినిఁ గూర్ప ॥ఎదుగవే !॥

పుడమితల్లికి నీవు పుత్రికగ జనియించి
నవనవోన్మేషముగ, చివురింప పరువమ్ము,
చిఱుగాలి కెరటాల, చెలువారు హాసాల
చూడకోరిక కాగ, పాడవేడుక రేగ ॥ఎదుగవే !॥

పాలవెన్నులతోడ చూలాలివలె వెలసి
పంటకంకులతోడ, బాలెంతవలె విరిసి,
తల్లివై జగ మెల్ల, చల్లగా పోషింప
కల్పవల్లిగ నీవు కలవులను పోకార్ప ॥ఎదుగవే !॥

ధనధాన్యరాసు లిల ఘనముగా దీపింప,
జనమనోగేహముల అనురాగ ముదయింప,
సౌఖ్యప్రదాయివై, సౌభాగ్యకారివై
సంతోషకాంతులను, సమకూర్పగా మిగుల ॥ఎదుగవే !॥

కడుపునిండుగ తిండి, కంటినిండుగ నిదుర
కలిగినప్పుడె కదా ! వెలుగు జగతిని శాంతి !
ఆశాంతి వెలయంగ, ఆకలిని తరుమంగ
అన్నపూర్ణగ నీవు, హర్షదాయిని వగుచు ॥ఎదుగవే !॥

సస్యప్రణాళికలు, భవ్యకార్యము లెల్ల
దివ్యసంపద లొసగి, దీపించు నీవల్ల,
నీవు పండిన వేళ, నిఖిల బాధలు తొలగు
నీవు నిండిన యిండ్ల, నిఖిల సుఖములు వెలుగు ॥ఎదుగవే !॥

నవకాంతి పుంజాల భువివెలుగ దివివోలె
అనురాగగీతాల, ఆనందకుసుమాల
అలరారి జను లెల్ల, అమరులై వెలుగొంద,
అందాల వని వగుచు- అనురాగధుని వగుచు ॥ఎదుగవే !॥

---

(87 వ పేజీ తరువాయి)

క్రమముగా పరరాజుల దాడులకు గురియై నష్టపడుచుండెను. నరేంద్ర మృగరాజు కాలములో 108 యుద్ధము లుండెను. అయినను దేశమున పాడిపంటలు సమృద్ధిగా నుండెను. భాషావిషయమునను, వేదశాస్త్రముల విషయమునను రాజపోషణ అన్ని శతాబ్దులలోను వృద్ధిగా నుండెను. చతుర్వేదులు, ద్వివేదులు మున్నగువారు, తర్క, గణిత, జ్యోతిషాది శాస్త్రవేత్తలు, సంస్కృతాది భాషలలో కవి చక్రవర్తులు యీ శతాబ్దులలో వర్ధిల్లిరి. 70 రకముల కామెంటరీలు తర్కమునందు గుప్తశర్మ జయసింహ నృపాలుని (636–669) కాలములో నేర్చెనట. రెండవ అమ్మరాజు (945–970 A. D.) కాలమున భట్టదేవుడను కవిచక్రవర్తి యుండెను. 11 వ శతాబ్దినిగల తెలుగు పండిత కవులలో నన్నయభట్టు, నన్నెచోడుడు, నారాయణభట్టులు ముఖ్యులు. కర్నాటమున బిల్హణ, విజ్ఞానేశ్వరాదు లుండిరి. ★

# లలితావనం



## ✲ సంస్కరణలో మనపాత్ర ✲

— ఇల్లిందల సరస్వతీదేవి

కీర్తిశేషులైన గురజాడ అప్పరాయ కవి "కన్యాశుల్కము" నాటకము వ్రాసి అర్ధశతాబ్దానికిపైగా ఐంది. స్త్రీలకూ, బిడ్డలకూ, పామరులకూ అర్ధమయేటట్టుగా పుత్తడిబొమ్మ కథను పద్యకావ్యంగా వ్రాశారు. దానిలో పుత్తడి బొమ్మలావున్న పూర్ణమ్మను తల్లిదండ్రులు కానుల కాసించి ముసలివాడికిచ్చి మూడు ముళ్లూ వేయించుతారు. కొన్నాళ్లకు ఆమెను అత్త వారింటికి తీసుకుపోవటానికి ముదుసలి భర్త వస్తాడు. తల్లిదండ్రులు ప్రయాణానికి సిద్ధము చేస్తూ ఉండగా పూర్ణమ్మ తోటి స్నేహితురాండ్ర వద్ద నుండీ, అన్నదమ్ములవద్ద నుండీ, తాను పెంచిన పూల చెట్లనుండీ, మాతా పితల వద్ద నుండీ సెలవుతీసుకొని బంగరు దుర్గను భక్తితో కొలిచి ఆమెవద్ద కూడా సెలవు తీసుకుని కొలను చేరి ఆత్మహత్య చేసుకుంటుంది. ఈ కథ చాలా దయనీయమైనది. చదివిన వారికి కన్నీరు జలజల రాలుతుంది. ఈ కథ విని వెక్కి వెక్కి పడ్చిన స్త్రీలూ బాలికలూ ఉన్నారు. కాని సంఘములో ఇటువంటి దురాచారాలు ఇప్పటికీ ఉన్నాయనటానికి నిదర్శనంగా ఇటీవల ఇండోరు సమీప గ్రామానికి ఒక శుభ ముహూర్తానికి మూడు దిక్కుల నుండీ ముగ్గురు పెళ్ళికొడుకులూ వారి బంధువులూ బళ్లమీద బయలుదేరి వచ్చారు. ఆ ముగ్గురు పెళ్ళికొడుకులూ కూడా ఒక చక్కని పెండ్లికుమార్తె కొరకు వచ్చారు. ముగ్గురివద్ద నుండి మూడు సంచులు ఒకరికి తెలియకుండా ఒకరి దగ్గర విడివిడిగా తీసుకుని పెళ్ళిళ్ల పేరయ్య ఆడిన నాటక మిది. ముగ్గురూ ఒకరినొకరు చూసుకుని విస్తుపోయి. సంగతంతా తెలుసుకుని పేరయ్యను నిలదీస్తే "అయినదేదో అయిపోయింది. ఇప్పటికీ మించిపోలేదు. మీ ముగ్గురిలో ఎవరు పెద్దమూట చెల్లిస్తే వారికి ఆచక్కని చుక్కను యిచ్చి పాణిగ్రహణము చేయిస్తా" నన్నాడు. అన్నట్టుగానే వారిలో నుండి ఒక వీరుడు సాహసించి ఒక పెద్దమూట చెల్లించాడు. వెంటనే ఆ అమ్మాయి అతడి భార్య అయిపోయింది. ఇది కట్టుకథ కాదు. అక్షరాలా జరిగిందని పత్రికలు ప్రకటించిన వార్త.

ఆడపిల్లలను అమ్ముకునే ఆచారము నవభారతములో కూడా నశించిపోలేదు. పిలిచి ఎవ్వరూ పిల్ల నివ్వని యువకులూ వృద్ధులూ వికలాంగులూ డబ్బుతో భార్యలను కొనుక్కుంటునే ఉన్నారు. అమ్ముడుపోయిన ఆడపిల్ల లందరూ సాధారణముగా చిరుతప్రాయము వారై వుంటారు. వాళ్ళల్లో కొందరు పదిహేను సంవత్సరాలవాళ్ళు కూడా ఉంటారు.

ఈ ఆడపిల్లలను అమ్మే ఆచారము పాలఘాటులో ఎక్కువగా ఉండేది. పాలఘాటు నుండి మద్రాసు, తిరుపతి ప్రాంతాలకు తీసుకువచ్చి పెళ్ళిళ్ళ పేరయ్యలు బేరసారాలుచేసి పొట్టపోసుకుంటూ ఉండేవారు. వయోవృద్ధులకూ, అనాకారులకూ, పేరు ప్రతిష్ఠలు లేని వారికీ, ఈ కారణాలచేత వివాహాలు కాకుండా బ్రహ్మచారులుగా నిలిచి పోయిన వారందరికీ డబ్బుతో పెళ్ళిళ్ళు చేయించి పుణ్యము కట్టుకునే వారా పేరయ్యలు.

ఈవిధంగా పెళ్ళిళ్ళు చేసుకున్న ఆడపిల్లలంతా వట్టి అమాయకురాండ్రుకాదు. సత్రంలో పెళ్ళిచేసుకొని పెళ్ళికొడుకుతో అత్తవారింటికి ప్రయాణము చేసేటప్పుడు కావాలని కోరి దారితప్పే పిల్లలున్నారు. కొందరిని అమ్మినవారే తప్పించి, తిరిగి

మరొకరికి బేరం పెడుతూ ఉండేవారు. ఈ ఆటలేవీ సాగక అత్తవారిళ్ళకు చేరుకున్న అమ్మాయిలు పైసాపైసా కూడబెట్టుకుని గానీ, ఒక్కసారి చేత చిక్కినప్పుడు గాని దొంగతనంగా తిరుగు ప్రయాణము కట్టుతూ ఉండేవారు.

డబ్బుపెట్టి కొనబడిన ఆడపిల్లలలో కాస్త గడుసురకము ఈవిధంగా చెప్పకుండా వెళ్ళిపోతున్నారని అక్కడ అక్కడి కబుర్లువిన్న భర్తలు ఆ పిల్లలను వేయికళ్ళతో కనిపెట్టుతూ, తాము పొరుగూళ్ళకు వెళ్ళవలసి వచ్చినప్పుడు అక్కచెల్లెళ్లనూ తల్లులనూ కాపలా పెట్టేవారు.

పారిపోవటానికి తగిన అవకాశాలు లేని మగువలు ఆ ఆశలు వదలుకుంటారు. కాని ఎంతో పేదరికములో మునిగి తేలుతున్న పిల్లలు విధిలేక చేసుకున్న ఆ భర్తలతో కళ్ళు మూసుకొని కాపురాలు చేసేవారు. ఎటువంటి భర్తతోనయినా కాపరము చేసి తీరవలసిందే నని ఎవరయినా చెప్పటము సులభము. కాని యౌవనములోవున్న ఆడపిల్లలు అందరూ తమకు జరిగిన ఘోరమైన అన్యాయాలను దిగమ్రింగి ఊరుకోలేరు. కంటికి నచ్చినవారు ఎవరయినా సరే వారి మీద మనసు నిలుపుతారు. సాధారణంగా మంచినీళ్ళకని ఏటికీ బావులకూ వెళ్ళటము వుండనే వుంటుంది. గ్రామాలలో, నగరాలలో, పట్టణాలలో అపరిమితమైన జనము గుంపులు గుంపులుగా కంటబడుతూ ఉంటుంది. కాస్త కనుముక్కు తీరునునిపి కంటబడగానే ఈ పిల్లల మనసు కట్టలు త్రెంచుకుంటుంది. తమిళనాడు నుండి కొని తీసుకురాబడిన పిల్లలలో కొందరు బిడ్డ తల్లులయినా మోసముచేసి వెళ్ళిపోయినవారు ఉన్నారు. పది కాలాల పాటు కాపురంచేసిన వాళ్లను వేళ్ళమీద లెక్కపెట్ట వచ్చు.

దానముచేసేటప్పుడు దక్షిణ సమర్పించటము హిందువుల ఆచారము. షోడశమహాదానాలలో కన్యాదానము ఒకటి. కన్యాదాన కాలములో అన్ని విధములా యోగ్యుడని భావించిన బ్రహ్మచారికి వయసున చిన్నవాడయి నప్పటికి కన్యాదాత కాళ్ళుకడిగి ఆ నీళ్ళు తలమీద చల్లుకుంటాడు. పరిగృహీత విష్ణుసమానుడని భావించటముచేత చిన్నవాళ్ళయినా కాళ్ళు కడిగినందువల్ల దోషములేదని నిర్ణయించబడ్డది. ఈ సందర్భములో దాత తాంబూలములో దక్షిణపెట్టి సమర్పించటము ఆచారము.

దానాలలో పుణ్యాన్ని ప్రాప్తింపచేసేవి కొన్ని; పాపపరిహారార్థము చేసేవి కొన్ని. షోడశమహా దానాలూ దశవిధ దానాలూ మొదటిరకములో చేరినవి. నువ్వులూ, గుమ్మడికాయా, మహిషమూ, ఇనుమూ మొదలైనవి రెండవరకములో చేరినవి. ఈ రకపు దానాలను పరిగ్రహించటము కష్టమైనపని. దానము పరిగ్రహించిన తరువాత కొంత జపతపాలతో గాని ఆ పాపము పోదని శాస్త్రాలు చెప్తున్నాయి. కనుక ఈ రకపు దానాలు పరిగ్రహించటానికి దక్షిణ ఎక్కువగా సమర్పించవలసి వుంటుంది.

కన్యాదానము చేసేటప్పుడు దాతలు శక్త్యానుసారము గోదానము, భూదానము, హిరణ్యదానము కూడా చేస్తూ ఉంటారు. కాని ఈ సందర్భములో సమర్పింపబడే దక్షిణకు ఏ విధమయిన నిర్ణయమూ లేదు.

వాస్తవముగా చూస్తే కన్యా పరిగృహీతగా ఎన్నుకోబడటమే ఘనమైన విషయము. కన్యాదానముతో దక్షిణగా ఎంత స్వల్ప మొత్తము లభించినా గొప్ప సంగతే. ప్రాచీన భారతములో అందరి భావాలూ ఇచ్చిపుచ్చుకోవటాలలో పారమార్థికచింతతోనే నిండివుండేవి. కనుక దక్షిణ తీసుకునేవారు ఎంచుకోవటము గానీ ఇచ్చేవారు నిర్ణయించటముగానీ, ఇద్దరిమధ్య బేరసారాలుగాని ఉండేవి కావు.

కాని కొంతకాలము నుండీ ఈ ఆచారము లౌకికమయి, దానము తీసుకునే వ్యక్తి "దక్షిణఎంత?" "భూమి మాగాణి భూమేనా?" అని పది మందిని ఆలోచించి గాని అంగీకరించని పరిస్థితికి వచ్చింది. కొన్ని శతాబ్దాల నుండీ ఇది మరింత హేయముగా, పది మందిలోనూ ఆ దక్షిణను పళ్ళెములో పోయించుకోవటమూ, రూపాయలను ముందుగా ఎంచుకోవటముగా పరిణమించింది. కొన్ని సందర్భాలలో ఎడ్వాన్సుగా సొమ్ము తీసుకోవటము కూడా జరుగుతున్నది. ఈవిధముగా వరదక్షిణ కానుకై, కట్నమై ఫీజుగా రూపొందింది. రానురాను వివాహాలలో కట్నము రాబట్టుకోవటమే ప్రధాన లక్ష్యముగా మారిపోయింది. అందుచేతనే వివాదాంశమైపోయింది.

ఈడూ జోడూ కులమూ గోత్రమూ వంశమర్యాదలూ సరితూగిన సంబంధాలు వరకట్నాల దగ్గరే చిట్లిపోవటము జరుగుతున్నది. ఈ కాలములో కూడా మగపిల్లలను గిత్తలను బేరానికి నిలవబెట్టినట్టుగా నిలవబెట్టి తండ్రులు బేరాలు చేస్తున్నారు. పెళ్ళి పందిరిలో పదిమంది సమక్షాన పెండిపళ్లెములో రూకలరాసులు కన్యాదాత కుమ్మరిస్తూవుంటే వరుడి తండ్రిఆనందముతో తబ్బిబ్బై పోతు

న్నాడు. పట్టుచీరెల రెపరెపలలో రాళ్ల నగల జిగజిగ మెరుపులలో వరుడి తల్లి హుందాగా తిరుగుతున్నది. కన్యకు వివాహముచేసి బాధ్యత తీర్చుకున్నామన్న సంతోషము పైకి గలిగినా కన్యాదాతలు సంసారాలు నేలమట్టమయిపోతున్నాయని క్రుంగిపోతున్నారు.

వరకట్నాలవల్ల యువతీ విద్యావతి సుగుణవతీ అయిన వధువుకు విలువ లేకుండా పోయింది. ఆమెతోపాటు వచ్చే కట్నానికే విలువ కట్టటము జరుగుతున్నది.

మనకు వరకట్న నిషేధ చట్టము అమలులోకి వచ్చింది. వరుడికొరకు గానీ వధువుకొరకు గానీ, తల్లిదండ్రులు ఏ పక్షము వారయినా ధనము చెల్లించినట్లయితే శిక్షార్హులని చట్టములో చెప్పబడి వున్నది. ఒక సంవత్సరముముందు గానీ తరువాత గానీ కట్నము యిచ్చి పుచ్చుకున్నట్టుగా ప్రభుత్వానికి తెలిస్తే శిక్షార్హులని చట్టములో వున్నది. కాని ప్రజానీకములో మార్పు ఆశించినంతగా రాలేదు. చట్టాన్ని తప్పించుకు తిరగటము అలవరచుకున్నారు.

ప్రభుత్వోద్యోగులు ఒక భార్య జీవించి ఉండగా రెండవ భార్యను చేపట్టరాదన్న చట్ట మొకటి అమలులో వున్నది. ఈ చట్టము ప్రకారము 1944 నుండీ ఇటువంటి వివాహాలు జరగకూడదు. ఒక వేళ జరిగినట్లయితే యువకుడు ప్రభుత్వోద్యోగము నుండి తొలగింప బడతాడు. ఇటువంటి కఠిన షరతులతో ఈ చట్టాన్ని ప్రవేశపెట్టినా ఈ దురాచారము అంతటితో సమసిపోలేదు. ప్రభుత్వోద్యోగాలు లేనివారికి శిక్ష లేదు కదా అని ప్రజానీకము నిర్లక్ష్యము చేయటము మొదలు పెట్టింది. బిడ్డల తండ్రులు కూడా తిరిగి పెళ్ళికొడుకులై, వివాహాలు చేసుకోవటము మొదలు పెట్టారు.

ఈ విధంగా సంఘ దురాచారాలను రూపు మాపేటందుకు చట్టాలను ప్రభుత్వము చేస్తునే వున్నది. కాని వాటిని ఏవిధంగా ఉల్లంఘించవచ్చునా అని ప్రజానీకము వేయి విధాల ఆలోచిస్తూనే వున్నది; మార్గాలను అన్వేషించి ఉల్లంఘించుతూనే వున్నది.

ప్రజోపయోగకరమయిన ఈ చట్టాలను ప్రజలే ఉల్లంఘించే సాధనలు వెదకుతూ ఉంటే ప్రభుత్వము ఎంత వరకూ వాటిని నిరోధించగలదు ?

దేశము చైతన్యవంతము కావాలంటే ప్రజలలో చైతన్యము రావాలంటారు బుద్ధిమంతులు. కాని ప్రజలలో చైతన్యము లేకనేనా ఈ ఎదిరింపులు ?

ప్రజలను ఒక కట్టుబాటు క్రిందికి తీసుకువచ్చి, వారిని అభ్యుదయ మార్గములో నడిపించాలంటే కేవలము చట్టాలు చాలవు. వాటిని అమలువరచటానికి ఒత్తిడి కావాలి. ప్రజలకు చట్టాల మీద ఆదరణా గౌరవమూ కలగాలి.

ఆమధ్య లీలావతీ మున్షీగారు మహిళలనందరినీ సమావేశపరచి ''చట్టాలు చేసినంత మాత్రాన ప్రజలను సంస్కరించలేము. వాటిని ప్రజలు ఉల్లంఘించకుండా నిరంతరమూ కనిపెట్టి ఉండాలి. అలా చేయగలిగినవారు స్త్రీలే. మహిళలు సంఘాలుగా ఏర్పడి ప్రజలలో ప్రచారము చేస్తూవుంటే చట్టాలను గౌరవించటము వారికి అలవాటవు తుంద''ని అన్నారు.

సరిగ్గా ఇటువంటి అభిప్రాయాన్ని వరకట్న నిషేధ చట్టాన్ని ఆమోదిస్తూ పార్లమెంటు సభ్యురాం డ్ర ందరూ వెలిబుచ్చారు. ప్రజలపైన అజమాయిషి చేయటానికి ఒక సంఘాన్ని ఏర్పాటు చేయమన్నారు.

పాకిస్తాన్‌లో స్త్రీలకు సంబంధించినంతవరకూ పరిపాలన చక్కగా వున్నది. సాంఘిక దురాచారాలను రూపుమాపటానికి దశాలుగా ఏర్పడి మహిళా సంఘాలు పని చేయాలని స్త్రీ లందరూ తీర్మానించుకున్నారు.

విదేశీయులు పరిపాలన చేసిన కాలములో వారు మన మతము జోలికి సాంఘిక దురాచారాలపైకీ తమ దృష్టిని పోనివ్వలేదు. హరవిలాస్ శారదాగారు బాల్యవివాహ చట్టాన్ని ప్రవేశపెట్టినప్పుడు ప్రభుత్వము ఆమోదించినా సనాతనులందరూ ఆయనను శపించటానికి పూనుకున్నారు. ఎన్ని కఠిన నిబంధన లేర్పరచినా ఏనాం వెళ్ళి, వెర్రుపాలెం వెళ్ళి తమ కన్యలకు బాల్యవివాహాలు చేస్తూ ఉండేవారు. ముప్ఫయి సంవత్సరాలకుపైగా చట్టమయిన శారదా ఆక్టు ఇప్పటికి ప్రజలలో బాగా వ్యాపించింది. ఇప్పుడు జరిగేవన్నీ ప్రౌఢ వివాహాలేగాని బాల్యవివాహాలు కావు.

ఈవిధంగానే మిగతా చట్టాలన్నీ క్రమంగా ప్రజలలో వ్యాపించిపోతాయనటములో సందేహము లేదు. ప్రజాహృదయాన్ని సంస్కరించటానికి నిరాశపడకుండా నిరంతరమూ కృషి జరపాలి. ఈ పనికి పూనుకొన తగిన వారు స్త్రీలే.

# మొదటి నెలలో పిల్లలు

డాక్టర్ వేమిరెడ్డి రాజేశ్వరమ్మ

పుట్టడంతోనే చంటిపాపకు జీవితం కొత్తగా వుంటుంది. అంతకుముందు తనకు కావలసిన ప్రతీదీ తల్లి దగ్గరనుండి తీసుకునే పాప యిప్పుడు స్వయంగా తను తయారుచేసుకోవాలి. గాలి పీల్చడం, రక్తప్రసరణ - అన్నీ తనకు తానే చేసుకోవాలి. సాధారణంగా మొదటి వారంలో పిల్లలకు 100°-107° F దాకా వుంటుంది. వంటిలోనుండి నీరు పోవడం వల్ల వచ్చే జ్వరం అది. అంతేగాని ప్రమాదకరమైన జబ్బేమీ కాదు. ఇలా నీరు పోవడంవల్లే పిల్లలు మొదటివారంలో బరువు తగ్గిపోతారు. వీరికి పోయిన నీటికి బదులుగా తాగడానికి నీరు యిస్తే జ్వరం తగ్గిపోతుంది. కాని సాధారణంగా తల్లి పాలు యివ్వడంవల్ల దానికదే జ్వరం తగ్గిపోతుంది. తల్లిపాలు లేనప్పుడు గ్లూకోజు నీళ్ళు యిస్తే చాలు. అయితే జ్వరం కేవలం యిందువల్లే కాకుండా మరింకే కారణం చేతనైనా రావచ్చు. కొన్ని ప్రమాదకరమైన జబ్బులవల్లగూడా జ్వరం వస్తుంది. ఈ జబ్బులలో చంటిపాపకు జ్వరం తగలడమేగాకుండా మత్తుగా కనిపిస్తుంది. నీరు తగ్గడంవల్లనే అయితే జ్వరం వచ్చినా కులాసాగానే కన్పిస్తారు.

మొదటి నెలలో మరొక ముఖ్యమైన విషయం ఏమిటంటే సాధారణంగా నూటికి 50 పాళ్ళు పిల్లలకు రొమ్ములు వాస్తూ వుంటాయి. వాచి వానిలోనుండి కొంచెం పాలలాంటి పదార్థం వస్తుంటుంది. ఈ వాపు 2-3 వారాలు వుంటుంది. ఇది జబ్బేమీ కాదు. దానంతట అదే తగ్గిపోతుంది. దానినేమీ చేయకూడదు. ఏమైనా చేసి వత్తిడిచేస్తే క్రిములు లోపలకు వెళ్ళి గడ్డకట్టే ప్రమాదం వుంది. అప్పుడు దాన్ని కోసి, చీము తీయాల్సి వస్తుంది. నిజానికి పైన చెప్పిన రెండూ జబ్బులేమీ గావు. సర్వసాధారణంగా జరిగేవే.

ఇక నిజమైన జబ్బుల్ని గురించి వివరిస్తాను.

కొంతమంది పిల్లలు పుట్టగానే నీలి రంగులో వుంటారు. రకరకాల జబ్బుల వల్ల ఆ రంగు రావచ్చు. పిల్లల ముక్కు, గొంతు, ఛాతీలలో తల్లి ఉమ్మునీరు చేరినందువల్ల రావచ్చు. ఆ బలహీనం తల్లికిచ్చిన మందులవలన కావచ్చు. తలకు దెబ్బ తగిలినందువల్ల కావచ్చు. తల్లికి నొప్పు లెక్కువసేపు వుండడంవల్ల పిల్లకు ప్రాణవాయువు అందక ఆ రంగు రావచ్చు. గుండె జబ్బువల్ల కూడా రావచ్చు. అందువల్ల పుట్టినప్పుడు పిల్లలను జాగ్రత్తగా పరీక్షచేసి యీ పై కారణాలలో ఏ కారణం వల్లనో తెలుసుకోవాలి. బిడ్డ స్థితి ఆ చెప్పిన కారణంమీద ఆధారపడి వుంటుంది. తల్లి ఉమ్మనీరు తాగినందువల్లనయితే అది తీసివేస్తే బిడ్డ గాలిని బాగా పీల్చగలుగుతుంది. నీలిరంగు పోతుంది. తల్లి కిచ్చిన మందువల్లనయితే బిడ్డకు ఊపిరి తిత్తుల బలానికి మందిస్తే చాలు. తలలో జబ్బు అయితే మాత్రం గట్టి జాగ్రత్తలు తీసుకోవాలి. ఇది కొంచెం ప్రమాదకరమైనది. ఇందుకు చికిత్స యీ విధంగా వుంటుంది. బిడ్డ ముక్కు, నోరు, ఛాతీలలోకి ట్యూబు పోనిచ్చి లోనవున్న ఉమ్మినీరు మొదలైన వాటిని తీసివేయాలి. బిడ్డను ఒక ప్రక్కకు పడుకోబెట్టి తల కొంచెం కిందకు వుండేటట్లు చేయాలి. ప్రాణవాయువు యివ్వాలి. ఊపిరితిత్తుల బలానికి ఇంజక్షన్ యివ్వాలి.

కాన్పుసమయంలో బిడ్డకు దెబ్బలు తగులవచ్చు. అందులోనూ ముఖ్యంగా తలకు. తల్లి ఎక్కువసేపు నొప్పులతో బాధ పడితే బిడ్డకు ప్రాణవాయువు తక్కువయి, ముఖ్యంగా తలలో బిడ్డకు ప్రమాదం చేయవచ్చు. కొన్ని రక్తనాళాలు తెగిపోయి రక్తం గూడు కడుతుంది. సాధారణంగా అలా అయితే పిల్లలకు పుట్టుకతోనే జబ్బు కన్పిస్తుంది. పిల్లలు పాలిపోయి ఏడవకుండా అలానే పడుకొనివుంటారు. వాళ్ళకు ఊపిరికూడా సరిగా అందదు. ఏడవడానికిగూడా శక్తి వుండదు. పాలు చీకలేరు. గొంతులో పోస్తే మింగలేరు. ఒక్కొక్కసారి చేతులు, కాళ్ళు కొట్టుకొంటుంటారు. ఉన్నట్టుండి ఏడవడం, చేతులు కాళ్ళు గట్టిగా అయిపోవడం మొదలైనవి చేస్తారు. కొన్ని సమయాలలో మాడు ఉబ్బుతుంది. మెల్ల

కన్ను కూడా రావచ్చు. మరొకప్పుడు చేయిగాని, కాలుగాని పడిపోవచ్చు. వెన్నెముక నుండి నీరు తీస్తే అది పసుపు పచ్చగా ఉంటుంది. ఒక్కొక్కసారి మామూలు నీళ్ళలాగకూడా వుండవచ్చు.

ఆరక్తం ఎక్కడ గూడు కట్టుకున్నదో దానిమీద ఆ బిడ్డడి భవిష్యత్తు ఆధారపడి వుంటుంది. ఈ రక్తం, వెనుక భాగంలో గూడు కడితే, అదిచాలా ప్రమాదకరం. మిగతాచోట్ల నయితే కొద్దిపాటి చికిత్సతో తొలగించవచ్చు. వెనుక భాగంలో గూడు కట్టడంవలన తెలివి తక్కువతనము; కాళ్ళు, చేతులు పడిపోవడము, మొదలయినవి సంభవిస్తాయి. అందుచేత రక్తం గూడు కట్టకుండా చూడడం చాలా అవసరం. దీనికి చికిత్స ఈ విధంగా వుంటుంది. ఈ రకమైన పిల్లలను నిశ్శబ్దంగావున్న ఒక చీకటిగదిలో పెట్టాలి. వారికి చలిగాలి తగలకుండా బట్టలు కట్టాలి. వారిని అతి సున్నితంగా కదపాలి. పైన చెప్పినట్టు ముక్కునుండి, నోటినుండి ట్యూబువేసి ఏమైనావుంటే తీసివేయాలి. ప్రాణవాయువు యివ్వాలి. ఒక్కొక్కసారి 10% సెలైన్ (ఉప్పునీరు) అపాన వాయుమార్గంగుండా 2 ఔన్సులు ఎక్కించాలి. మళ్ళీ నాలుగేసి గంటలకు ఒక్కొక్కసారి ఎక్కించాలి. క్లోరల్ హైడ్రాస్ 1 గ్రైను లెక్కన ఫిట్సు వచ్చినప్పుడు యివ్వాలి. దానితో తగ్గకపోతే ఫినోబార్బిటోన్ ¼ గ్రైను ఇంజక్షన్ యివ్వాలి. ఒక్కొక్కసారి రక్తం తల ఎముకకు, చర్మానికి మధ్యకు చేరడం జరుగుతుంది. ఇది తలతో పుట్టిన వాళ్ళల్లో ఎక్కువగా జరుగుతుంది. దీనివల్ల తలమీద మెత్తటివాపు ఏర్పడుతుంది. దీనికి మందు అవసరం లేదు. దానంతట అదే కొన్నివారాలకు తగ్గిపోతుంది.

ఒక్కొక్కసారి కాళ్ళతోపుట్టే పిల్లలను కొంచెం బలంగా లాగినందువల్ల వెన్నెముకలోపల నరాలకు దెబ్బతగలవచ్చు. అలా దెబ్బతగిలిన బిడ్డలు కాళ్ళు కదపలేరు. కాని యిది చాలా అరుదు.

పరికరాలతో బిడ్డను తీసేటప్పుడు ఒక్కొక్కసారి ముఖానికి దెబ్బతగిలి మూతి వంకరపోయే ప్రమాదం వుంది. కాని యిది 2-3 వారాలలో సర్దుకుంటుంది. దీనికి మందులేవీ వాడనవసరం లేదు. కన్ను మూయడంకష్టమైతేమాత్రం కంటికి ఏదైనా కట్టులాంటిది దుమ్ము పడకుండా కట్టాలి.

కష్టమైన కాన్పులో చేతిని బలంగా లాగితే భుజంగూడు ఊడి, దానిక్రింద వున్న నరాలు దెబ్బతిని చేయి పడిపోవచ్చు. ఇది కూడా దానంతట అదే కొన్ని నెలల్లో బాగవుతుంది. దీనికి ఉట్టి చేతినే సరియైన పద్ధతిలో పెట్టి కట్టు కడితేచాలు. ఈ కట్టును కొద్ది నెలలు వుంచాలి. 2-3 వారాలు అయిన తర్వాత తోమడం మొదలు పెడితే మంచిది.

కొంతమంది పిల్లలకు 2-3 వారాలకు మెడ ముందు భాగంలో గడ్డలాంటిది కన్పిస్తుంది. ఇది ఎక్కువగా కాళ్ళతోను, ముడ్డితోను పుట్టిన పిల్లల విషయంలో జరుగుతుంది. ఇది ఉంటే సాధారణంగా పిల్లలు మెడను అది వున్నవైపుకే తిప్పి ఉంచుతారు. దీనికి గూడా మందులేమీ అవసరం లేదు. రోజూ కొన్నిసార్లు తలను అటూయిటూ తిప్పితే చాలు. కొన్ని నెలలకు దానంతట అదే తగ్గిపోతుంది.


విజయ చిహ్నాలను యేర్పరచండి!

మోటారు బండ్లకు, కార్లకు

"V" చిహ్నాలు ఇప్పుడు రవాణా అధికారులవద్ద లభిస్తాయి.

కార్లకు :— రు. 10-00 మాత్రమే. బస్సులు, లారీలకు :— రు. 25-00 మాత్రమే.

మీ బాడ్జికోసం రవాణా కమీషనర్‌ను కానీ, ఇతర రవాణా అధికారులను కానీ కలవండి.

మీ విజయకాంక్షను మీ కార్లద్వారా ప్రదర్శించండి

# బాలానందం

# నేరాలు చేసే పిల్లలు

వాసిరాజు ప్రకాశం

*తమ్ముళ్లూ! చెల్లాయిలూ!*

మానవులన్న తరువాత – అందరూ ఒకే విధంగా వుండరు. మనిషికీ, మనిషికీ ఎంతో భేదం వుంటుంది. కొందరు చాలా మంచివారయి వుంటారు. మరి కొందరు, కదిపితేనే తగవులు తెచ్చుకొనే విధంగా వుంటారు. కొందరు పలకరిస్తేనే గాని, మాట్లాడరు; మరికొందరు గంటలకొద్దీ మాట్లాడుతుంటారు. ఇట్లా, ఎన్నో ఎన్నో రకాల మానవులు మనమధ్య మసలుతూ వుంటారు.

బాలల్లో కూడా అంతే. ఎన్నో రకాలవారు, ఎన్నెన్నో మనస్తత్వాల వాళ్ళు వుంటారు. మల్లెపూలులాగా వుండే బట్టలు వేసికొని, శుభ్రంగా తలదువ్వుకొని స్కూలుకు వస్తుంటారు కొందరు. కొందరు ఎప్పుడుచూచినా, ఆవే బట్టలు తొడుక్కొంటూ, మురికి మురికిగా వుంటారు.

తత్వాలలోకూడా అంతే. పలకదగ్గరా, పుస్తకం దగ్గరా – చీటికి, మాటికి – తగవులు పెట్టుకొని, నానా అల్లరీ చేస్తుంటారు కొందరు ఎదుటివాని బలహీనత అర్థం చేసికొన్న కొందరు ఎలాగో సర్దుకొని పోతుంటారు.

ఎప్పుడూ చక్కగా బడికి వెళుతూ, బుద్ధిమంతుల్లా వుండే వారితో కొందరు స్నేహం చేస్తుంటారు. అందరూ అలానే ఎందుకు చేస్తారు? అల్లరి చిల్లరిగాతిరుగుతూ, నెలకు ఒక మారో, రెండు నెలలకు ఒక మారో స్కూలుకు వెళ్ళేవారితో స్నేహం చేసేవారుకూడా కొందరుంటారు.

చెడు స్నేహాలు చేస్తే, ఏంజరుగుతుందో ఎలాంటి ఫలితాలు వస్తుంటాయో మనందరికీ తెలుసు. – 'రౌడీ'లతో స్నేహం చేస్తే, మనమూ రౌడీల్లా తయారవుతాం. 'రౌడీలు' చేస్తున్న 'దొంగ'పనులేమనమూచేస్తుంటాం. అప్పుడు, అందరూ మనల్ని 'దొంగ' అంటారు. మనల్ని చూచినవారంతా, ముఖం ఆటు త్రిప్పుకొని, అసహ్యించు కొంటారు.

ఇంతకీ చెప్పొచ్చే దేమంటే, దేశంలో తప్పులుచేసే చిన్నపిల్లలలో చాలామంది చెడుసావాసాల వల్లనే అలా చేస్తుంటారు. మన ప్రాణస్నేహితు డొక డున్నాడు – అతను సినిమాకు వెళితే, అతనితోమనమూ వెళుతాం. అతను 'జేబులు' కత్తిరిస్తూ వుంటే, మనకూ చేయాలని అనిపించవచ్చును.

ఇవన్నీ కావాలని చేసే నేరాలుకావు. తెలియక చేసిన తప్పుడు పనులు. అలాంటి తప్పుచేయాలని, నలుగురిచేతా చీవాట్లు తినాలని, మన మనస్సులో లేకపోయినా, పరిస్థితుల ప్రభావంవలన అలాచేస్తారని వూహించవచ్చును.

పిల్లలు ఎక్కడున్నా పిల్లలే. – తమకు తెలియకుండానే ఒకోక్కసారి మంచిపనులను చేస్తారు మరోమారు తమకుతెలియకుండా చెడ్డపనులనూ చేస్తారు.

తమకు తెలియకుండా – అంటే ఏదో అమాయకత్వం వలన చిన్నతనం వలన చెడుసావాసాలను చేసి, చెడ్డపనులను చేసే వారిని బాగుచేసి, వాళ్ళకు మంచిబుద్ధులూ, చదువూసంధ్యా నేర్పించి, ఉత్తమపౌరులుగా చేసేందుకు మన ప్రభుత్వం ప్రత్యేకశ్రద్ధతో కృషి చేస్తున్నది. చెడుమార్గంపట్టిన – బాలలను బాగుచేయటం ప్రభుత్వం రూపొందించిన కార్యక్రమాలలో ఒకటి.

బాగా ఎదిగి, పెద్దవాళ్ళయి, 'దొంగ' పనులను చేస్తున్న నేరస్థులను చూస్తూ వుంటాం. వాళ్ళు దొంగతనం తప్పని తెలిసికూడా చేస్తూవుంటారు. అలాంటి వాళ్ళను పోలీసులు అరెస్టుచేసి, కోర్టుకి తీసుకవెడతారు. కోర్టులోవుండే 'న్యాయమూర్తి' కేసు విచారించి, అవసర మయితే తగినంత శిక్షను విధిస్తాడు.

బాలలు – తెలియకనే యీ 'నేరాలు' చేస్తుంటారు గనుక, వారిని ఇంత కఠినంగా శిక్షించరు. ఇలాంటి శిక్షలనే బాలలకుకూడా విధిస్తే, వారు బాగుపడ

టానికి బదులుగా, మనో వ్యాకులతతో, ఇంకా క్రుంగి కృశించిపోతారనీ, శిక్ష అనుభవించిన తరువాతకూడా దేశంలో ఉత్తమ పౌరులుగా తయారుకాలేరని ప్రభుత్వం భావించి, వారికి యీ శిక్షలను వర్తింప చేయటంలేదు.

అసలు 'శిక్షలు' అంటే యెట్లావుంటాయో మనలో చాలామందికి తెలుసు. పత్రికల్లో చదువుతూనే వుంటాం. 'ఉరిశిక్ష' యనీ, 'యావజ్జీవ కారాగార శిక్ష' యనీ, — 'కఠిన శిక్ష' యనీ —, పెద్దపెద్ద నేరాలు — అంటే హత్య మొదలైన వన్నమాట — చేసిన వారికి 'వురిశిక్ష' విధిస్తూ వుంటారు. చిన్న చిన్న నేరాలుచేస్తే 'జైలుశిక్ష' విధిస్తారు.

ఎలాంటి వానికి ఏశిక్ష విధించాలో, ఏది పెద్దనేరమో, ఏది చిన్న నేరమో, తెలిపే గ్రంథాలు కొన్ని వున్నాయి, మన దేశంలో. ఆ గ్రంథాల మొత్తాన్ని 'ఇండియన్ పీనల్ కోడ్' లేక 'భారతీయ శిక్షాస్మృతి' అంటారు.

అసలు — ఫలానాది నేరమని తెలియక, ఆ పని చేసినా, శిక్షనుంచి తప్పించు కోవటానికి వీల్లేదని చట్టం చెపుతుంది — ఇది పెద్దవాళ్ళ విషయంలో.

చిన్నపిల్లల విషయంలో యీ నియమాలను కొంత సడలించారు. కొందరు చిన్నపిల్లలు తెలియకనే నేరాలు చేస్తూ వుంటారని సర్వత్రా అంగీకరించడం జరిగింది. అందువల్ల, చిన్నపిల్లలకు కూడా అవే నియమాలను వర్తించేస్తే, వారు ముమ్ముందు అయినా బాగుపడరన్న భావంతో ప్రభుత్వం వారికోసం కొన్ని ప్రత్యేకమైన సౌకర్యాలను కల్పించింది.

ఈ సౌకర్యాలనువినియోగించుకొన్నబాల నేరస్థులు బుద్ధిమంతులవుతారు. ముందు ముందు ఎప్పుడూ నేరంచేయరు సరిగదా, ఆ ఛాయలకే వెళ్ళరు.

తెలియక కేవలం అమాయకత్వం వలన నేరాలుచేసిన బాలలకు, చక్కని శిక్షణ ఇచ్చి, బుద్ధిమంతులుగా చేస్తున్న సంస్థలలో "సర్టిఫైడు స్కూళ్ళు" కొన్ని ఉన్నాయి. వీటినే తెలుగులో ధ్రువీకృత పాఠశాలలని అంటారు. ఇలాంటివిప్రస్తుతం హైదరాబాదులో మూడు వున్నాయి.

మొదటిది చంపాపేటలోని జూనియర్ సర్టిఫైడు స్కూలు. చట్టరీత్యా తప్పులు చేసిన మగపిల్లలను మొదట న్యాయస్థానానికి తీసుక వెడుతారు. ఆ కేసును విచారించి, ఆ అబ్బాయిచేసిన 'నేరాన్ని బట్టి'. కొన్ని సంవత్సరాలపాటు, 'సర్టిఫైడు స్కూలు'కు పంపమని న్యాయమూర్తి తీర్పుచెపుతారు. అలాంటి వారందరినీ యీ 'స్కూలు'లో వుంచుతారు.

రెండవది ముషీరాబాదులో వున్నది. దీన్ని ఆడపిల్లలకోసమే ప్రత్యేకించారు. అంటే — తెలియక తప్పులు చేయటంవల్ల, కొందరు బాలికలు న్యాయస్థానాలకు హాజరు కావలసి వుంటుంది. వారు చేసినవి చట్టం ప్రకారం తప్పులే అయితే, 'న్యాయమూర్తి' పేర్కొన్నంత కాలం, ఆ బాలికలంతా యీ 'సర్టిఫైడు స్కూలు'లో వుంటారు.

ఇదికాక మరో 'సంస్థ' వున్నది. బాల బాలికలను న్యాయస్థానాలకు తీసుకవస్తారు. వారిని ఇంకా సర్టిఫైడు స్కూలుకు పంపరు. ఈ మధ్యకాలంలో — అంటే న్యాయవిచారణ జరుగుతున్నంతకాలమూ, వారిని ఇక్కడ వుంచుతారు. ఇదికూడా ముషీరాబాదులోనే వున్నది.

రాష్ట్రంలో ఇలాంటి 'నేరాలు' జరుగ కుండా చూడాలని, భారీఎత్తున మన ప్రభుత్వం కృషిచేస్తున్నది. త్వరలో మరి కొన్ని 'సర్టిఫైడు స్కూళ్ళ'ను తెరిచే అవకాశా లున్నాయి.

## దీపావళి నాడు...

ప్రత్తి సేకరించి వత్తుల నొనరించి
మంచి నూనెలోన ముంచి తడిపి
ప్రమిదలెల్లపేర్చి అమితశ్రద్ధాసక్తి
దీపమాల గూర్చె తెలుగు బాల!

'చిట్టి' కాల్చినట్టి 'సీమటపాకాయ'
తుస్సుమనెను సుంత బుస్సుమనుచు!
'బాల' కొట్టినట్టి 'నేలటపాకాయ'
బొమ్మ బెదర, మ్రోగె ఢామ్మటంచు!!

'కప్పగంతులు' చిటపట చప్పుడులను
వింతవింతగ అటునిటు గంతులేయ
ముద్దుపాపలు నవ్వుల మ్రోతలలర
సంతసమ్మున ఇటునటు గంతులిడిరి!

'అగ్గిపుల్ల' గాల్చ సిగ్గాయెనోయేమొ
కాలుననుచు భీతి కలిగెనేమొ
ముదము మీర తల్లి ముట్టించి యిచ్చినా
'చిట్టిబాబు' చేత బట్టడాయె!

'విష్ణుచక్రము' చేబూని, కృష్ణుడనని
'బాబు' గిర్రున త్రిప్పగ డాబుసరిగ
జారిపడిపోయినది విష్ణుచక్రమకట
మారిపోయెను కృష్ణావతార మంత!

మింటిచుక్కలంట మీదిమీదికెగిరి
ఊపు తగ్గి నేల కొరిగి పోవ
'చిచ్చుబుడ్డి'మోముచిన్నదైపోయెను
'చిన్ని' మోము అయ్యె చిచ్చుబుడ్డి!

కాల్చె 'ముద్దుపాప' 'కాకరపూవత్తి'
గోగుపుల్లచివర గ్రుచ్చియెత్తి
చెదరిపోవ ధరణి చీకటి దవ్వు దవ్వు
చింద తల్లిపెదవులందు నవ్వు!!

అలపర్తి వెంకట సుబ్బారావు

ఈ భారాన్ని ప్రభుత్వంలోని మూడు వేర్వేరుశాఖలు నిర్వహిస్తున్నాయి. మొదటిది పోలీసుశాఖ. ఫలానాచోట బాల లెవరయినా, తప్పుచేశారని తెలియగానే పోలీసు అధికారులు ఆ బాలలను తీసుకొని వచ్చి, 'ఛార్జీ-షీటు' దాఖలుచేసి, న్యాయ స్థానానికి తీసుక వెడుతారు. అసలు నిజం ఎంతో, అబద్ధంఎంతో కూడా పోలీసువారే విచారించి, ఆ వివరాలన్నీ న్యాయమూర్తివద్ద దాఖలు చేస్తారు.

ఈ భారాన్ని నిర్వహిస్తున్న రెండవశాఖ, జైళ్ళశాఖ. 'సర్టిఫైడు స్కూళ్ళు' జైళ్ళ శాఖ అధీనంలోనే వుంటాయి. తప్పుచేసిన బాలుణ్ణి, 'సర్టిఫైడు స్కూలు'కు పంపిన మొదటిరోజునుంచీ, జైళ్ళశాఖయే వాళ్ళ బాధ్యతలను స్వీకరిస్తుంది. చదువూ సంధ్యా చెప్పించి, వాళ్ళను పెద్దవాళ్ళను చేస్తుంది. వాళ్ళ మనస్తత్వాలను పరీక్షించి, అందుకు తగిన విద్యను నేర్పుతారు. వాళ్ళ పాత అల వాట్లను మార్చి, తనకూ, తానువుండే సంఘా నికీ ఉపయోగకరమైన అలవాట్లు కొన్నింం టిని నేర్పుతారు.

ఈ మహత్కార్యంతో సంబంధం వున్న మరొకశాఖ, సాంఘిక సంక్షేమశాఖ. బాలలు నేరాలు చేయటం మన దేశంయొక్క సాంఘిక పరిస్థితులమీద దెబ్బ. అందువల్ల అలాంటి లోపాలు జరుగకుండా చూచేభారం కూడా ప్రభుత్వానిదే. వెనుకటికి ఆంగ్ల సామెత ఒకటి వున్నది. జబ్బు వచ్చాక, నయంచేసికోవడం కంటె, జబ్బురాకుండా చూచుకోవడం మంచిది. అదేవిధంగా, నేరం చేశాక సర్టిఫైడు స్కూలుకు పంపడం కంటె, నేరంజరుగకుండాచూడడమేమంచిది.

ఈ మూడుప్రధానప్రభుత్వ శాఖలతోనూ, సహకరిస్తూ, యీ సమాజ సంక్షేమ కార్య క్రమంలో చేదోడు-వాదోడుగా నున్నమరో రెండు ప్రభుత్వ శాఖలున్నాయి.

ఆ రెండు శాఖల్లో మొదటిదివిద్యాశాఖ. ఈ శాఖ సహకారం ఎంతో అవసరం. సర్టిఫైడు స్కూలులో బాలుడు కేవలం బాగుపడటమే కాకుండా, బయటికి వెళ్ళే లోగా కొద్దో గొప్పో చదువుకూడా నేర్చు కోవాలి. చదువునేర్పేభారం విద్యాశాఖది.

రెండవశాఖ, వైద్యశాఖ. సర్టిఫైడు స్కూల్లో వున్నంతకాలమూ, బాలబాలికలకు ప్రభుత్వమే చక్కని వైద్య సదుపాయాలను కలుగజేస్తుంది. ఇంట్లో అమ్మా, నాన్నను వదలి ఎక్కడో పరాయిచోట వుండటం కష్టంగానే వుండవచ్చు. చిన్నపిల్లలు కావటంవల్ల మానసికంగా కూడా దెబ్బ తినవచ్చును. అలాంటికొరత లేకుండా, ఆప్యాయంగా చూసేశాఖ వైద్యశాఖ.

పోలీసుశాఖలో బాలనేరస్థులకు ప్రత్యేక విభాగం వున్నది. ఒక పోలీసు డిప్యూటి సూపరింటెండెంటు ఆశాఖ అధిపతి. రాష్ట్రంలోజరిగే 'బాలనేరాల'ను సింహావ లోకనంచేసి, అలాంటివి మున్ముందు జర క్కుండా వుండేందుకు తగిన మార్గాలను కూడా యీ శాఖే సూచిస్తుంది. ప్రతి కేసులోను, నేరం జరగటానికి గల కారణా లను కూడా యీ విభాగమే చర్చించి, ప్రభు త్వానికి నివేదిస్తుంది.

బాలలు ఒకానొక 'మూడుమాసాల' కాలంలో 116 నేరాలు చేసినట్లు ప్రభుత్వ దృష్టికి వచ్చించి. ఇన్ని నేరాలు జరుగ టానికిగలకారణాలు, పరిస్థితులనుప్రభుత్వం పరిశోధించింది.

ఇంటివద్దఅన్ని సౌకర్యాలు-అంటే తిండీ, బట్టా, వగైరా సమకూరనివారు, తలి దండ్రుల సక్రమమైన పాలన పోషణలో లేనివారు, చిన్నపిల్లల వ్యవహారాలలో చీటికి మాటికి తలిదండ్రులు జోక్యం కలుగ చేసి కోవడం వలస, చెడుసావాసాల వలన, కొన్ని సందర్భాలలో సినిమాలవలన ఇలాంటి నేరాలకు పిల్లలు దిగుతారని నిశ్చ యించటం జరిగింది.

చిన్నపిల్లలు, అసలు నేలాలు చేయ కుండానే, తగిన రక్షణ చర్యలు ప్రభుత్వం తీసి కొన్నది. 1961 మార్చినెలలో హైదరా బాదు నగరంలోని 'జుమాయత్ బజార్'లో ప్రభుత్వం 'పిల్లలక్లబ్' నొకదానిని స్థాపిం చింది. మరీ పేదలువుండే, మురికి ప్రాంతా లలో యీ 'క్లబ్'ను స్థాపించడంలో కూడా అర్థం లేకపోలేదు. పేదతనం మూలంగా, పిల్లలెవరైనా నేరాలకు దిగకూడదనే ప్రభుత్వం వుద్దేశం. ఈ 'క్లబ్బు'లో 50మంది పిల్లలకు అవకాశం వున్నది. ఆటలు, పాట లతో అందంగా, ఆనందంగా గడుపుతూ వుంటారు ఇక్కడిపిల్లలు.

భారతదేశం అంటే బాలలదేశం అని విదేశీయులు అంటూ వుంటారు. అందువల్ల, బాలల బాధ్యతలు ఎన్నో వున్నాయి.

మనకు స్వాతంత్ర్యంవచ్చి 17 సంవత్స రాలయినా కాలేదు. తెల్లదొరలు చిన్నా భిన్నం చేసిన మన దేశాన్ని, మెల్లి మెల్లిగా బాగుచేసుకొంటూ వున్నాం. మనం దేశాన్ని బాగుచేయటానికి, పెద్దవాళ్ళ బాధ్యత ఎంతో, చిన్నపిల్లల బాధ్యతకూడా అంతే.

అందువల్ల బుద్ధిగావుండి నేరాలు చేయకుండా, మన స్కూలుకీ, మన వూరికీ, చివరకుమన దేశానికీ మంచిపేరు, ప్రతిష్ఠలు తీసుకరావలసిన బాధ్యత బాలలదే.

# కాకి పిచ్చుక - తలాతోకా

— వేటూరి ఆనందమూర్తి

ఒక ఊళ్లో ఒక కాకి ఒక పిచ్చుక కలిసి మెలిసి ఉండేవి. ఒకసారి ఆ రెండిటికీ బాగా ఆకలి వేసింది. కాకి అందిట 'పిచ్చికా! పిచ్చికా! నువ్వేమో ఒక నువ్వుగింజ తీసుకురా నేనేమో ఒక వడ్లగింజ తీసుకు వస్తాను' అని.



పిచ్చికా, కాకి ఇద్దరూ ఎగిరిపోయి నువ్వుగింజా వడ్లగింజా తెచ్చుకొని నిప్పు రాజేసి వండుకున్నారు. వంట పూర్తి కాగానే కాకి అన్నది గదా 'పిచ్చికా! పిచ్చికా! నువ్వేమో అన్నం చల్లారుస్తూ వుండూ, నేను ఈలోగా స్నానం చేసి వస్తాను' అని.



కాకి అలా స్నానానికి వెళ్లగానే పిచ్చికకి నోరూరింది. కాస్త అన్నం రుచి చూస్తే బాగుండదూ? అనుకొంది. అలానే కాస్త కాస్తే రుచి చూస్తూ వండిన అన్నం కాస్తా తినేసింది.



తిన్న తర్వాత గానీ దానికి తెలియలేదు అన్నం అంతా అయిపోయిందని! ఇప్పుడు కాకి వస్తే ఎలా? ఏం చేయనూ! అని గాభరాతో అటూయిటూ ఎగిరి చివరికి ఎటూ దారి తోచక ఒక మూలనున్న తిరగలిరాయి వెనక్కి వెళ్ళి తల దాచుకొన్నది. ఇంతలో కాకి రానే వచ్చింది. అన్నమూ లేదూ - పిచ్చికా లేదూ. ఇదంతా పిచ్చిక పనే అయి వుంటుందని కాకికి ఒళ్ళు మండి ఇల్లంతా గాలించింది



చివరికి తిరగలిరాయి వెనకాల పిచ్చిక తోక కనిపించింది. పిచ్చిక పాపం తల దాచుకొన్నదే గాని తోక దాచుకో లేదుగా! వెంటనే కాకి వెళ్ళి పొయ్యిలో మండుతున్న ఒక కొఱివి కట్టె తెచ్చి పిచ్చిక తోకకి ముట్టించింది.



ఇంకేముంది! పిచ్చిక తోక కాలి ఒకటే నాట్యం! అప్పుడు కాకి "తిక్క కుదిరిందా! నీవంతే కాక నా వంతు కూడా తిన్నావే. తల దాస్తే మాత్రం తోక చెప్పదూ?" అందిట.

పిచ్చికకి బుద్ధి వచ్చింది. మళ్ళా కాకి పిచ్చికా కలిసిమెలిసి సుఖంగా ఉన్నాయి.

# ముఖ్యవార్తలు

## రాష్ట్రంలో

సెప్టెంబరు 25 : విశాఖపట్నంలో స్థాపించబడగల ఎరువుల కర్మాగారానికి అమెరికా ఎగుమతులు – దిగుమతుల బ్యాంకు 68 మిలియన్ డాలర్ల ఋణాన్ని ప్రకటించింది.

సెప్టెంబరు 26 : కేంద్ర రక్షణమంత్రి రెండు రోజుల పర్యటనపై హైదరాబాదుకు విచ్చేశారు.

ఇంద్రకీలాద్రి కొండపై అడవులను పెంచే పథకానికి కేంద్ర విద్యుచ్ఛక్తి, నీటివనరుల శాఖామంత్రి ప్రారంభోత్సవం చేశారు. ఈ పథకానికి రూ. 3 లక్షలు ఖర్చవుతుంది.

అక్టోబరు 2 : తిరుమల కొండలపై రూ. 30 లక్షలు ఖర్చు కాగల గోగర్భం నీటి సరఫరా పథకాన్ని యూనియన్ విద్యుచ్ఛక్తి, నీటి వనరుల శాఖామంత్రి ప్రారంభించారు.

అక్టోబరు 3 : విజయవాడలో పాడి వుత్పత్తుల ఫ్యాక్టరీకి ముఖ్యమంత్రి శంకుస్థాపన చేశారు. దీనికి రూ. 37 లక్షలు వ్యయమవుతుంది.

అక్టోబరు 5 : ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర న్యాయవాదుల సమాఖ్య ద్వితీయ వార్షిక మహాసభను భారత ప్రధాన న్యాయమూర్తి హైదరాబాదులో ప్రారంభించారు.

అక్టోబరు 6 : హైదరాబాదులో నగరకోర్టుల భవనానికి భారత ప్రధానన్యాయమూర్తి పునాది రాయివేశారు.

మీర్ ఆలమ్ చెరువు సమీపంలో నెలకొల్పిన జూలాజికల్ పార్కుకు ఆంధ్రప్రదేశ్ గవర్నరు ప్రారంభోత్సవం చేశారు.

అక్టోబరు 9 : రాష్ట్ర విద్యుచ్ఛక్తి, నీటివనరులశాఖామంత్రి పులివాగు ఆనకట్టకు శంకుస్థాపన చేశారు. ఇది విజయవాడకు 18 మైళ్ళ దూరంలో వుంది.

అక్టోబరు 14 : తెలంగాణా ప్రాంతంలోని పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తుల నిర్వాహకుల మహాసభను హైదరాబాదులో ముఖ్యమంత్రి ప్రారంభించారు.

అక్టోబరు 16 : అనంతపురం జిల్లాలో కనమనయనపల్లి గ్రామసమీపంలో మధ్య పెన్నార్ కాలువల పథకాన్ని ముఖ్యమంత్రి ప్రారంభించారు.

## భారత దేశంలో

సెప్టెంబరు 21 : యూనియన్ రైల్వేశాఖ మంత్రిగా శ్రీ హెచ్. సి. దాసప్ప, ప్రణాళికాశాఖ సహాయ మంత్రిగా శ్రీ బి. ఆర్. భగత్ కొత్త ఢిల్లీలో పదవీ ప్రమాణ స్వీకారంచేశారు.

సెప్టెంబరు 30 : ఆసియా, దూర ప్రాచ్యాలలోని ఆరుదేశాలకు చెందిన వ్యవసాయ ప్రాజెక్టుల నిపుణుల సమావేశాన్ని కేంద్ర ఆహార, వ్యవసాయ శాఖామంత్రి కొత్త ఢిల్లీలో ప్రారంభించారు. ఈ సమావేశం 10 రోజులపాటు జరిగింది.

అక్టోబరు 7 : భారత విజ్ఞానశాస్త్ర సంస్థ 50 వ సభను కొత్త ఢిల్లీలో ప్రధానమంత్రి ప్రారంభించారు.

## విదేశాలలో

అక్టోబరు 1 : నైజీరియా కామన్వెల్త్‌లో ఆరవ రిపబ్లిక్‌గా ఏర్పడింది.

తొలి అణుశక్తి కృత్రిమ ఉపగ్రహాన్ని అమెరికా కక్ష్యలోకి ప్రయోగించింది.

అక్టోబరు 9 : ఉగాండా ప్రథమ అధ్యక్షుడుగా బుగాండాకు చెందిన కబాకా సర్ ఎడ్వర్డ్ ముటేసా పదవీ ప్రమాణ స్వీకారం చేశారు.

అక్టోబరు 10 : అమెరికాకు చెందిన డాక్టర్ లీనస్ కార్ల్ పాలింగ్‌కు 1962 వ సంవత్సరానికి నోబుల్ – శాంతి–బహుమతి లభించింది. 1963 వ సంవత్సరానికి ఈ బహుమతి, అంతర్జాతీయ రెడ్ క్రాస్ కమిటీ, రెడ్‌క్రాస్ లీగ్‌లకు సంయుక్తంగా బహూకరించబడింది.

అక్టోబరు 17 : 1963 వ సంవత్సరానికి వైద్యంలో నోబుల్ బహుమతిని కాంబెర్రాకు చెందిన సర్ జాన్ కార్య్యూ ఎకల్స్‌కూ, కేంబ్రిడ్జికి చెందిన శ్రీ అలన్ లాయడ్ హడ్గ్‌కిన్‌కూ, లండన్ విశ్వవిద్యాలయ కళాశాలకు చెందిన శ్రీ ఏండ్రూ ఫీల్డింగ్ హక్సిలీకి బహూకరించారు.

# గ్రంథ సమీక్ష

# అల్పజీవులు : ఉత్తమ నవల

సమీక్ష

సి. హెచ్. ఆచార్య

సాగరంలో ఆటుపోటులున్నట్టు, సంసారమనే సాగరంలోగూడా ఆటుపోటులు ఉంటాయి; తుఫానులను ఉప్పెనలను సుడిగుండాలను 'కుటుంబాలనే బోట్లు' సంసారసాగరంలో ఎదుర్కొనవలసి వుంటుంది. ఈ తాకిడులను తట్టుకొని ఒడ్డుకుచేరే కుటుంబాలు కొన్ని ఉంటే, మరికొన్ని బోల్తా కొట్టేస్తాయి. ఇట్టి ఒకానొక సామాన్య కుటుంబాన్ని ఇతివృత్తంగా తీసుకొని ఈ 'అల్పజీవులు' నవలలో జీవన సమస్యలను శ్రీ వాసమూర్తి కడు హృదయంగమంగా చిత్రించారు.

దాదాపు 350 పేజీలుగల ఈ బృహత్ నవలలో మధ్య తరగతికి చెందిన ఒక ఉపాధ్యాయ కుటుంబ జీవితం యథాతథంగా చిత్రించబడింది. ఇందులోని పాత్రలు, వారు ఎదుర్కొనే సమస్యలు, చేసే చర్చలు వాదోపవాదాలు తరచుగా ప్రతి కుటుంబంలో కన్పించేవే కాని కథా చిత్రణ వివిధ సంఘటనల అల్లికను అతి సహజంగా సరళంగా సాగించి పాఠకుల హృదయాలపై రచయిత తన ముద్రను వేసి సానుభూతిని సృష్టిస్తారు. నవల చివరంతా విసుగు కల్గించకుండా పాఠకులను తనవైపు లాగుకొని వెళ్ళుతారు.

ఈ నవలలోని రామలింగంగారిలో ఇండ్ల యజమానుల మనస్తత్వాన్ని బాగా చూడగల్గితే శ్రీహరి ఆయన భార్య వరలక్ష్మిలో ఆదర్శ దాంపత్యాన్ని తిలకించ గల్గుతాం. శ్రీహరి తమ్ముడు రాధాకృష్ణ, అతన్ని ఒక ఇంటివానిగా చేయడానికి శ్రీహరి పడే పాట్లు ప్రతి కుటుంబంలోని అగ్రజుల అవస్థను జ్ఞప్తికి తెస్తాయి.

జీవితావసర వస్తువుల ధరలకు నెలసరి జీతానికి ఏమాత్రం పొందిక లేకుండా పోతున్నది. ధరలు ఏ రష్యావాళ్ళకన్నో అమెరికావాళ్ళకన్నో, చంద్రగోళాన్ని అందుకునేలా వున్నాయి. ఇక జీవితాలా? లోలోపలే కుళ్ళుకొని చావాలికాని గట్టిగా మూలగడానికి వీలుండదంటాడు రచయిత. ఖర్చులకు రాబడికి ముడిపెట్టేసరికి తల ప్రాణం తోకకు వస్తున్న సంగతి అందరికీ అనుభవైకవేద్యమే కదా?

ఏమి చేసినా ఎంతగా పొదుపు చేసినా లాభం లేదు. మన జీవితాలు సంసార సాగరంలో అంచులవరకు మునిగి నడుస్తున్న పడవల వంటివి. ఈ పడవలకుండే చిల్లులూ, బెజ్జాలూ ఎంతకప్పుకోవస్తున్నా, లోపలికి ఊరే నీటిని చేతులు పడిపోయేలా ఎంతగా తోడివేసినా ప్రయోజనం కన్పించడం లేదంటాడు శ్రీహరి తోడి ఉపాధ్యాయుడు సుబ్బారావు ఒకానొకచోట. ఇట్టి నైరాశ్యాన్ని నిస్పృహను మనలో ఎంతమంది ఈ రోజుల్లో ఎదుర్కోవడం లేదు!

పెద్దపెద్ద మేడలూ కార్లూ కావాలనే కోరిక లేకున్నా ఉండటానికి 'నా' అనదగిన స్వంత ఇల్లూ, శుభ్రమైన బట్టలూ కాలక్షేపానికో చిన్న రేడియోసెట్టూ ఉంటే బాగుండునని ప్రతి సామాన్య గృహిణి కోరుకుంటుంది, ఈ నవలలోని వరలక్ష్మి గూడా అంతే. శ్రీ వాసమూర్తి ఉపాధ్యాయుడు తన వృత్తి ధర్మాన్ని నిర్వర్తించడంలో పడే సాధక బాధకాలను బాగా వర్ణించారు. "పాఠాలు చదవలేదని, హోంవర్క్ చేసుకురాలేదని కాంపోజిషన్ చేసుకురాలేదని ఏ విద్యార్థినీ కొట్టవద్దు. వాళ్ళకులేని ఆదుర్దా మనకెందుకు? జీతపురాళ్ల కోసం మనం వస్తే పరీక్షలు ప్యాసవడానికి పిల్లలొస్తున్నారు. నిజమైన చదువు లెవరికీ అవసరంలేదు ఈ రోజుల్లో. ఇంతకీ తెలివైన వాడికి చెప్పకపోయినా ఫరవాలేదు. తెలివి లేని వాడికోసం బుర్ర బ్రద్దలు చేసుకున్నా లాభం లేదు" అని తోటి ఉపాధ్యాయుడు గోపాలరావు శ్రీహరికి సలహా ఇస్తాడు.

అది శ్రీహరి ఒకపిల్లవానిని కొట్టగా హెడ్మాస్టర్ చీవాట్లు వేసిన సంఘటన. పలుకుబడి కలవారి పిల్లలను

ఆఫీసర్ల పిల్లలను కొట్టడంవల్ల కలిగే ప్రమాదాన్ని గూర్చి హెచ్చరిస్తాడు.

జీవితమంటే వెలుగునీడల కలయిక. ఎండను అనుభవిస్తేనే నీడ సుఖం తెలిసేది. జీవితంలో సుఖదుఃఖాలు ఎలా పెనవేసుకొని ఉంటాయో ? అల్పజీవులు నవలలో వాసమూర్తి సమర్ధంగా రూపకల్పన చేశారు. ప్రతి ఒక్కరూ చదవదగిన ఈ నవల వెల రు. 5-00.

[ప్రాప్తిస్థానం: తెలుగువెలుగు పబ్లికేషన్స్, వారణాసి వారి ఇల్లు, కూచిమంచి అగ్రహారం, అమలాపురం (ఆం. ప్ర.)]

## చెట్టు - చేమ

[వెల రు. 1-50. రచయిత :- టి. రామచంద్రరావు, బి.ఎస్సి. (అగ్రి), నవోదయ పబ్లిషర్స్, విజయవాడ-2].

భారత ప్రభుత్వ విద్యాశాఖవారిచే నిర్వహింపబడిన ఏడవ వయోజన విద్యా గ్రంథ రచన పోటీలో బహుమతి పొందిన గ్రంథమని చెప్పడంలోనే దీని ఉత్కృష్టత వెల్లడి అవుతున్నది.

చెట్లూ చేమలను మనం రోజూ చూస్తూనే ఉన్నా వానినిగూర్చి సమగ్రమైన శాస్త్రీయ విజ్ఞానం అందరికీ అందుబాటులో ఉండదు. తేటతెల్లమైన భాషలో అందరికీ అవగాహన అయ్యేలా 22 లఘు ప్రకరణాలలో ఈ గ్రంథం నడిచింది. ప్రాణి అప్రాణి అంటే ఏమిటి ? ప్రాణుల పుట్టుక, చెట్లకుగూడా ప్రాణం ఉన్నదీ, నోరున్నదీ అని వివరించడంతోపాటు, చెట్టుచేమలు మనకు తిండిని, బట్టను ఆహారాన్ని ఇస్తున్నాయని, వర్షాలు వీని వల్లనే పడుతున్నాయని, కలప, రకరకాల సామాను అంతా చెట్లనుండే లభిస్తున్నదని, చిత్రవిచిత్రాలు చెట్లలో చూడవచ్చని చెట్లకుగూడా తెలివితేట లున్నాయని రచయిత దీనిలో సుబోధకంగా ఆకర్షకంగా వ్రాశారు.

## ధాత్రి (మిడ్‌వైఫ్)

[మూల్యం రు. 5-00. రచన :- డా॥ అరిశే వేంకటేశ్వర్లు, ప్రతులకు: రాజమ్మ చికిత్సాలయం అండ్ గర్భవతుల సంరక్షణశాల, పోస్టు: పెదకళ్ళేపల్లి, గ్రామం: శివరాంపురం, వయా, మోపిదేవి, దివి తాలూకా, కృష్ణా జిల్లా].

పల్లెపట్టుల్లో వంశపారంపర్యంగా మంత్రసాని వృత్తిలో అనువంశికంగా గడిపేవారు చాలామంది ఉన్నారు. వీరికి అనుభవం అధికంగా ఉన్నా ప్రసూతికి సంబంధించిన ఆధునిక విజ్ఞానం అంతగా ఉండదు. ప్రసూతి విజ్ఞానాన్ని ఈ వృత్తిలో ఉండువారికి సమగ్రంగా ఇచ్చే ఉద్దేశ్యంతో శ్రీ వేంకటేశ్వర్లుగారు ఈ గ్రంథాన్ని రచించారు. ధాత్రి అనగా భూదేవి.వంటి ఓపిక మంత్రసానులకు ఉంటుందని కావున ఈ నామం ఉచితమని గ్రంథకర్త అభిప్రాయ. గర్భిణిస్త్రీల పట్ల తీసుకోవలసిన జాగ్రత్తలు, సుఖప్రసవానికై అనుసరింపవలసిన విధులు, వాడవలసిన ఔషధాలు దీనిలో ఇవ్వబడినవి. ఇది మంత్రసానులకు మాత్రమే కాక, సాధారణ గృహిణులకు ఉపయోగపడగల గ్రంథం.

## ముత్యాలసరాలు-మహాకవి గురజాడ

[వెల అమూల్యం. రచయిత:-చిట్టి మల్లె శంకరయ్య (రుద్రశ్రీ), సాహిత్య సంసద్, జనగామ, వరంగల్ జిల్లా, ఆంధ్రప్రదేశ్].

ముత్యాలసరాలు, మహాకవి గురజాడపై ఐదు విమర్శనాత్మక వ్యాసాలున్నాయి. ఉత్తమ సాహిత్యం అంటే ఏమిటి? వ్యవహారిక భాష పరిణామం. గురజాడ ముత్యాల సరాలు, అందులో వాడిన ఛందస్సుగూర్చి ఈ వ్యాస సంపుటిలో రచయిత సరళంగా వివరించారు. వ్యావహారిక భాష సాహిత్య నిర్మాణానికి అన్నివిధాలా తగినదని ప్రతిమనిషిలోను ప్రేమను స్నేహాన్ని సొగసును గురజాడ చూచారని రుజువు చేయడానికి ప్రయత్నించారు. ఈ గ్రంథం సాహిత్య జిజ్ఞాసువులు ఒక తడవ చదవదగినది.

# స్వీకారం

### పంచవర్ష ప్రణాళికా ప్రచారిణి

రచయిత: శ్రీరావ్ వీరబ్రహ్మకవి. పేజీలు: 52, వెల: 0-75 న. పై., ప్రతులకు: గ్రంథకర్తపేర బందరునకుగాని లేక భారత్ సమితీ ప్రధాన కార్యదర్శి విద్వాన్, ఉభయభాషాప్రవీణ శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావుగారు, పాముఱ్ఱు, (కృష్ణా జిల్లా) అనికాని వ్రాసి తెప్పించుకోవచ్చు.

### రాణాప్రతాప్

రచయిత: వల్లభనేనికాశీ విశ్వనాథం, పేజీలు: 88, వెల: 0-75 న. పై. ప్రతులకు: ప్రజా ప్రచురణలు - ఏవరుపేట, ఏలూరు.

### శ్రీ భగవన్నామ సంకీర్తనలు

రచయిత: కొప్పవలి వెంకటరాజేశ్వరరావు, పేజీలు: 21, వెల: 0-25 న.పై. ప్రతులకు: శీతారామ విలాసము, నరసన్నపేట, శ్రీకాకుళం జిల్లా.

# సైనిక దళాలకు సౌకర్యాలు

## ఒక విజ్ఞప్తి

గత సంవత్సరం సరిహద్దు సంఘర్షణ ప్రారంభమైనప్పటి నుంచీ ప్రజలు సాహసవంతులైన మన సైనికుల ఉపయోగార్థం అనేక రకాల వస్తువులను కానుకలుగా అందజేస్తూవున్నారు. అయితే అద్యతన భావిలో ఇంకా ఇలాంటి వస్తువులు అనేకం అవసరమని సైనికాధికార్లు తెలియజేశారు. దిగువ పేర్కొన్న వస్తువులను ఉత్పత్తిచేసే డీలర్లు కానీ, ప్రజలుకానీ వాటిని జవానుల ఉపయోగార్థం విరాళంగా పంపవలసిందిగా ప్రభుత్వం విజ్ఞప్తిచేస్తున్నది. ఈవిరాళాలను న్యూఢిల్లీ-4 రాష్ట్రపతిభవనం, కేంద్రపౌరమండలి అధ్యక్షురాలు శ్రీమతి ఇందిరాగాంధి చిరునామాకు పంపవచ్చు. రైల్వే ఛార్జీలు చెల్లించనవసరం లేదు.

### అవసరమైన వస్తువులు ఇవి

ట్రాన్సిస్టర్లు : అస్సాం సరిహద్దు ప్రాంతాలలో జవానుల ఉపయోగార్థం తక్షణమే 500 ట్రాన్సిస్టర్ల అవసరం వుంది. వెంటనే దిగువ పేర్కొన్న వస్తువుల అవసరం వుంది : (అ) 16 లేక 35 ఎం. ఎం. ప్రొజెక్టర్లు (జనరేటర్లతో సహా); (ఆ) ట్రాన్సిస్టర్లు; (ఇ) ట్రాన్సిస్టరుగా ఉపయోగపడే రికార్డు ప్లేయర్లు; (ఈ) టాయిలెట్ వస్తువులు (సబ్బులు – వాసన నూనెలు) (ఉ) పానీయాలు : హార్లిక్స్, ఓవల్టిన్, పౌడరు పాలు, కోకో, పానీయాలకు ఉపయోగించే చాక్లెట్; కాఫీ; (ఊ) కెఫ్టీరియాలలో ఉపయోగించే టటువంటి స్టెయిన్ లెస్ స్టీల్ పళ్ళాలు; (ఋ) ఆయిల్ స్టవులు; (ౠ) ప్రెషర్ కుక్కర్లు; (ఌ) ఆసుపత్రుల కొరకు ఇంటర్ కమ్యూనికేషన్ సెట్లు, (300మంచాలు అంతకుపైన); (ౡ) స్టెయిన్ లెస్ స్టీల్ స్పిటూన్లు. (మూతలతో సహా)

### ఇండోర్ గేమ్స్, ఆటవస్తువులు

కేరమ్ బోర్డులు, చైనీస్ చెకర్లు, ల్యూడ్ సెట్లు, చెస్‌బోర్డులు (పూర్తిగా) పజిల్స్, 'పాములు – నిచ్చెనలు, బొంబాయి ట్రేడ్, బెగటెల్స్, చీట్లపేకలు, డార్ట్ బోర్డులు, డార్టులు వగైరా, ఫుట్‌బాల్, వాలీబాల్, బాస్కెట్ బాల్, డెక్ టెన్నిస్ (రింగులు) వగైరా.

పుస్తకాలు, పత్రికలు, సంచికలు వగైరా.

---

## రచయితలు

డాక్టర్ యస్. రాధాకృష్ణన్. 'భారతరత్న' భారత రాష్ట్రపతి, ఢిల్లీ.

శ్రీ పి. వి. నరసింహారావు, న్యాయ సమాచారశాఖల మంత్రి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం, హైద్రాబాద్.

శ్రీ యం. పి. పాయ్, ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి, హైద్రాబాద్.

శ్రీ చలసాని ప్రసాదరావు M. L. A. క్వార్టర్స్ హిమాయత్‌నగర్, హైద్రాబాద్.

శ్రీ జంధ్యాల లక్ష్మీనారాయణశాస్త్రి; M. A., తెలుగు అసిస్టెంట్ లెక్చరర్, గవర్నమెంట్ ఆర్ట్సుకాలేజి, అనంతపురం

శ్రీ కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు, లింగసముద్రం పోస్టు, కందుకూరు తాలూకా, నెల్లూరు జిల్లా.

శ్రీ కె. వి. భాస్కరరావు, పబ్లిక్‌రిలేషన్స్ ఆఫీసర్, సమాచార పౌరసంబంధాలశాఖ, హైద్రాబాద్.

శ్రీ యశోకాంత్, గూడూరుపోస్టు, వయా: షంషాబాద్, హైద్రాబాద్.

డాక్టర్ యస్వీ జోగారావు, తెలుగు లెక్చరర్, ఆంధ్రయూనివర్సిటి వాల్తేరు.

శ్రీ అరసాడ ధర్మారావు, సీతయ్యపేట, వయా: వడ్డాది; విశాఖపట్టణం జిల్లా.

శ్రీ జి. రామకృష్ణ, మలక్‌పేట, హైద్రాబాద్–2

వాఙ్మయమహాధ్యక్ష శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్య, ఎడిటర్, ఆంధ్రప్రదేశ్ (తెలుగు) సమాచార పౌర సంబంధాలశాఖ హైద్రాబాద్.

శ్రీ బి. నీలకంఠశాస్త్రి, తెలుగుపండిట్, హిందూకాలేజీ, గుంటూరు.

శ్రీ యస్. టి. పి. వి. రామానుజాచార్యులు, తెలుగుపండిట్ S. S. R. Z. P. M. P. స్కూల్స్, నూజివీడు, కృష్ణా జిల్లా.

శ్రీ గోలి వేంకటరామయ్య, తెలుగుపండిట్, నాగార్జునసాగర్ హైస్కూలు, ఉత్తరవిజయపురి.

శ్రీ రమణలాల్ వసంతలాల్ దేశాయ్....

శ్రీ యన్. వి. ఆర్. శేషగిరిరావు, రామకోటి, హైద్రాబాద్.

శ్రీ సురభి నరసింహము, తెలుగుపండిట్, V. R. కాలేజి హైయ్యర్ సెకెండరీ స్కూల్, నెల్లూరు.

శ్రీ కొత్త భావయ్య చౌదరి, సంగం జాగర్లమూడి, గుంటూరు జిల్లా.

శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి, అంబర్‌పేట, హైద్రాబాద్.

డాక్టర్ వేమిరెడ్డి రాజేశ్వరమ్మ, నీలోఫర్‌హాస్పిటల్, హైద్రాబాద్.

శ్రీ వాసిరాజు ప్రకాశం, బషీర్‌బాగ్, హైద్రాబాద్.

శ్రీ అలపర్తి వెంకటసుబ్బారావు, అంగలకుదురు పోస్టు, తెనాలి తాలూకా, గుంటూరు జిల్లా.

శ్రీ వేటూరి ఆనందమూర్తి, తెలుగు లెక్చరర్, సాయం కళాశాల, హైద్రాబాద్.

గ్రంథసమీక్ష : శ్రీ సి. హెచ్. ఆచార్య, జాంబాగ్ హైద్రాబాద్.



# భారతీయ హస్తకళాఖండాలు

...పండుగ సమయాలలో బహుమతిగా ఇవ్వడానికి ఎన్నోరకాల వస్తువులు...అత్యుత్తమమైన పనితనముతో తయారైన నగలతో అలంకరించిన దుస్తులు...అందాలను చిందే వెండి నగిషీపని...లోహముతో చేయబడిన కళాఖండాలు...వెండితాపిన, బంగారు మలామా చేసిన రాగి, ఇత్తడి వస్తువులు...దంతపు నగిషీ సామాను...సహజ సుగంధమును వెదజల్లే మంచి గంధపు వస్తువులు...కళాత్మకమైన కొమ్ముసామానులు, అక్రోటు కర్రసామానులు...అసంఖ్యాకమైన నమూనాలతో, వివిధ ఆకృతులలో చేయబడిన కన్నులకింపైన జయపూర్ నీలి, ఢిల్లీ నలుపు లేక ఖుర్జా మృణ్మయ పాత్రలు...ఇవన్నీ ఒకతరము నుండి మరియొక తరానికి...అందించబడిన కళా కౌశలముతో...తయారైన కళాఖండాలు.

ఆల్ ఇండియా హేండిక్రాఫ్ట్స్ బోర్డ్, పరిశ్రమల మంత్రిత్వశాఖ, భారత ప్రభుత్వము

DA

భారత ప్రభుత్వము

# ప్రీమియం ప్రైజ్ బాండ్లు 1963

పండుగ రోజులకు
చక్కని బహుమతి

**1963** డిసెంబరు **31** వరకూ మాత్రమే
విక్రయించబడును.

వాటిని ఇప్పుడు మీరు కొంటే మీ అదృష్టముకొలదీ
వచ్చే సంవత్సరం మీకు ఆకర్షణీయమైన
బహుమతి లభించవచ్చును

ఇతర వివరాలు ఈ క్రింది చోట్ల లభిస్తాయి —

రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా అన్ని కార్యాలయాలు
స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా శాఖలు
మరియు వాటి సబ్సిడియరీ బ్యాంకులు
అన్ని హెడ్ పోస్టాఫీసులు మరియు
డిపార్ట్‌మెంటుకు చెందిన సబ్ పోస్టాఫీసులు



**జాతీయ పొదుపు ఉద్యమ సంస్థ**

DA 63/310

ఢిల్లీ ఆగ్రా జైపూర్

ఎయిర్ కండీషన్ డీలక్స్
లగ్జరీ కోచ్ (బస్) లలో

# ప్రతి మంగళ, శనివారాలలో విహార పర్యటనలు
# 1963 మే 7 వ తేదీ నుంచి ప్రారంభించడం జరిగింది

ఢిల్లీ

జైపూర్ ఆగ్రా

పర్యటన స్థలాలు

మొదటి రోజు :

సికంద్ర — తాజ్‌మహల్, ఆగ్రా

*

రెండవ రోజు :
ఫతేపూర్ సిక్రీ,
జైపూర్ అబ్జర్వేటరీ,
సిటీ ప్యాలెస్ మ్యూజియం.

*

మూడవ రోజు :
అంబర్ ప్యాలెస్

ఛార్జీలు

ముక్కోణపు మార్గం.
ప్రవేశరుసుం రూ. 125/-
జైపూర్‌సిటీ ప్యాలెస్ మినహా

*

విడి ఛార్జీలు :

ఢిల్లీనుంచి ఆగ్రాకు రూ. 35/-
ఆగ్రానుంచి జైపూర్‌కు రూ. 40/-
జైపూర్‌నుంచి ఢిల్లీకి రూ. 50/-

*

రిజర్వేషను కొరకు దిగువ చిరునామాదార్లను సంప్రదించండి:
స్టేషన్ ఇన్‌ఛార్జీ, రాజస్థాన్ స్టేట్ రోడ్‌వేస్, భారత ప్రభుత్వం, టూరిస్ట్ ఆఫీసు 88,
జనపత్, న్యూఢిల్లీ.

రాజస్థాన్ టూరిజం డైరెక్టరు (జైపూర్) చే ప్రకటితం.

# ఆంధ్రప్రదేశ్

| | | |
|---|---|---|
| విస్తీర్ణం | | 1 06 286 చదరపు మైళ్లు |
| జిల్లాలు | | 20 |
| తాలూకాలు | | 189 |
| పట్టణాలు, నగరాలు | ... | 212 |
| గ్రామాలు | ... | 28,997 |
| పూర్తి జనాభా (1961) | ... | 359.83 లక్షలు |
| జన సాంద్రత | ... | ఒక చదరపుమైలుకు 339 |
| అక్షరాస్యులు (1961) | ... | 76.27 లక్షలు |
| నికర సాగుభూమి (1960-61) | ... | 10,783,000 హెక్టర్లు |
| పశువులు (1961) | ... | 326.43 లక్షలు |
| నమోదైన ఫ్యాక్టరీలు (1961) | ... | 3,140 |
| విద్యుదుత్పాదన (1962) | ... | 1,120.3 మిలియన్ కె డబ్ల్యు హెచ్ |
| విద్యుత్ సౌకర్యాలుగల పట్టణాలు, గ్రామాలు (1962-63) | ... | 4,315 |
| విశ్వవిద్యాలయాలు | ... | 3 |
| కళాశాలలు (1961-62) | ... | 125 |
| ఉన్నత పాఠశాలలు (1961-62) | ... | 1,435 |
| వృత్తివిద్యా పాఠశాలలు | ... | 440 |
| పంచాయతీలు (1959-60) | ... | 14,552 |
| అభివృద్ధి మండలాలు (31-3-1963 నాటికి) | ... | 446 |
| 1961-62 లో అప్పటి ధరలనుబట్టి రాష్ట్రాదాయం అంచనా | ... | రూ. 1,066.04 కోట్లు |
| పార్లమెంటు సభ్యులు | ... | 61 |
| శాసన సభ సభ్యులు | | 301 |
| శాసన మండలి సభ్యులు | | 90 |

Andhra Pradesh, November, 1963 Regd. No. A. 136




# ఈ సంచికలోని

## కొందరు రచయితలు

నారాయణరెడ్డి

దాశరథి

వాచస్పతి

కోడూరి కౌసల్యాదేవి

వ ఎస్

ఇంకా
వడ్డాది పాపయ్యగారి
వర్ణచిత్రాలు కార్టూనులతో
నెలాఖరుకు వెలువడుతుంది

ముఖచిత్రం :- 

వివరాలకు :

యువ కార్యాలయం
పబ్లిక్ గార్డెన్ రోడ్
హైదరాబాద్ - 1